యానాం కవితోత్సవ ప్రత్యేక సంచిక




# కవిసంధ్య ④

అక్టోబర్-డిసెంబర్ 2016

కవిత్వ ద్వైమాసిక పత్రిక



- కె. శివారెడ్డి, ఎస్వీల ఇంటర్వ్యూలు
- మన కావ్య సంకలనాలు
- నా తొలి రచన
- పాటల పల్లకిలో సాహిత్య నోబెల్
- సమకాలీన భారతీయ కవిత్వం
- మహాశ్వేతాదేవి, ఆవంత్స సోమసుందర్, బొజ్జా తారకం, చిలుకూరి దేవపుత్రలకు నివాళి
- పుస్తక ప్రపంచం.. టూకీగా..

రూ. 50/-







CI

పద్మభూషణ్ **గుర్రం జాషువా**



**1895-1971**

(సెప్టెంబర్ 28 జయంతి)



పద్మభూషణ్ **బోయి భీమన్న**



**1911-2005**

(సెప్టెంబర్ 19 జయంతి)

## 'నేను'

నివసించుటకు చిన్న నిలయమొక్కటి దక్క
గడన చేయుట కాస పడనునేను
అలుబిడ్డలకునై అస్తి పాస్తులు గూర్ప
పెడత్రోవలో పాదమిడను నేను
నేనాచరింపని నీతులు బోధించి
రాని రాగము తీయలేను నేను
సంసారయాత్రకు చాలినంతకు మించి
గుడ్డి గవ్వయు కోరుకొననునేను

కులమతాలు గీచుకున్న గీతల జొచ్చి
పంజరాన కట్టుపడను నేను
నిఖిలలోక మెట్లు నిర్ణయించిన నాకు
తరుగులేదు విశ్వనరుడనేను.

(ఖండకావ్యం-5వ భాగం నుండి)

## 'గుడిసెలు కాలిపోతున్నై'

గుడిసెలు కాలిపోతున్నై
ఎవరి గుడిసెలో పాపం !
మాల మాదిగల వే అయి వుంటై
గుడిసెలు ఎవరికుంటై
అయితే ఈ గుడిసెలు
ఏడాదికొక సారైనా కాలి పోతుంటై
ఒకసారి కాలిపోయిన గుడిసెలు
మళ్లీ మళ్లీ కాలిపోవడానికి
ఎక్కడనుంచి వస్తుంటై
అదే మన ధర్మంలోని రహస్యం

ఈ విష వలయం సాగడం
ఎంతవరకు?
రహస్యం
గుడిసెల వాళ్లకు తెలిసే వరకు.

('గుడిసెలు కాలిపోతున్నై' కావ్యం నుండి 1973)




**జ్యోతిర్మయమ్ వాఙ్మయమ్**

**ద్వైమాసిక పత్రిక - అక్టోబర్,డిసెంబర్ 2016**

సంపుటి: 1 సంచిక: 4

సంపాదకులు: డా॥ శిఖామణి

సెల్: **9848202526**

కార్యనిర్వాహక సంపాదకులు

డా॥ వరుగు భాస్కర్ రెడ్డి

సంపాదక వర్గం:

దాట్ల దేవదానం రాజు

మధునాపంతుల సత్యనారాయణమూర్తి

పి.ఆర్.ఎల్. స్వామి, కె. విజయలక్ష్మి

సహాయ సంపాదకులు:

ముమ్మిడి శ్రీ వీర నాగప్రసాద్ (చిన్నారి)

సిహెచ్. రాం, బొల్లోజు బాబా

పొనుగుమట్ల అశోక్ కుమార్

కవి సంధ్య

ఇంటి నెం. **2-1-043**

అంబేద్కర్ నగర్, యానాం-**533 464**

ముఖచిత్రం, అక్షరాలంకరణ:

ఆర్టిస్ట్ అక్బర్

డి.టి.పి. & లే అవుట్:

కవిసంధ్య గ్రాఫిక్స్

డిజైనర్:

విజయకార్తీక్, 9948963516

ముద్రణ:

నాగేంద్రప్రెస్, విజయవాడ

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ. **200** |
| **3** సం॥రాల చందా | రూ. **600** |
| **5** సం॥ల చందా | రూ. **1000** |
| విశిష్ట చందా | రూ. **5000** |
| జీవిత సభ్యత్వ చందా | రూ. **10,000** |


## పాటకు నోబెల్ పట్టం




## జయహో బాబ్ డిలాన్


రచనలు పంపవలసిన చిరునామా:

డా॥ వరుగు భాస్కర్ రెడ్డి

కార్యనిర్వాహక సంపాదకుడు

#1-7-008, జి.ఎన్. నాయుడు కాలని, యానాం-**533 464.**

సెల్: 94401 27967

email: kavisandhya.yanam@gmail.com

www.kavisandhya.com లో పత్రికను చదవచ్చు.

# ఈ సంచికలో...

**శీర్షికలు:**



# సంపాదకీయం



కవిసంధ్య ముచ్చటగా మూడు సంచికలను దాటి నాలుగో సంచికలోకి అడుగుపెట్టింది. సోషల్ మీడియా వెల్లువలో సాహిత్యాధ్యయనం గాలికి కొట్టుకుపోయిందనే మాట కవిసంధ్యకు అందుతున్న ఆదరాభిమానాల వల్ల అబద్ధం అని తేలింది. ఈ సంచిక వజ్రాయుధ కవి, అభ్యుదయ సాహిత్యోద్యమ నాయకుడు ఆవంత్స సోమసుందర్ ముఖచిత్రంతో వెలువడుతోంది. తెలంగాణను నిజాం ఉక్కిపిడికిళ్ల నుండి విముక్తం చేసే పోరాటంలో, తూర్పుగోదావరి జిల్లా మారుమూల పిఠాపురం గ్రామం నుండి, కళాకేళి ద్వారా ఉద్యమ కాహళి వినిపించిన తిరుగుబాటు కవి సోమసుందర్. వజ్రాయుధం కావ్యంతో అభ్యుదయ కవిగా తన విరాట్ స్వరూపాన్ని ప్రదర్శించాడు.

రవీంద్రనాథ్ టాగూరు, శరత్‌బాబు తెలుగువారికి ఎంత చిరపరిచితులో బెంగాలీకి చెందిన మహాశ్వేతాదేవి అంతే పరిచితులు. మార్క్సిస్టు నేపథ్యంలో ఎదిగి వచ్చిన శ్వేతాదేవి దళితులు, ఆదివాసీలు, నిరుపేదలు, కార్మికులు, స్త్రీల హక్కుల కోసం జీవితాంతం రచనలు చేసిన మహా రచయిత్రి. ఎవరిదీ అడవి, అగ్నిగర్భ, బషాయిటుడు, రుడాలీ వంటి రచనలు మహాశ్వేత దేవి ఏమిటో సాహిత్య ప్రపంచానికి తెలియచెప్పాయి.

బొజ్జా తారకం ప్రముఖ పౌర హక్కుల నేత, న్యాయవాది, రచయిత, కవి గొప్ప మానవతావాది. అటు తండ్రి బొజ్జా అప్పలస్వామి, ఇటు మామ బోయిభీమన్నల నుండి సాంఘిక సాహిత్య వారసత్వాలను అందిపుచ్చుకొన్నవాడు. మానవ హక్కులంటే దళితుల హక్కులు కూడా అని తన కార్యాచరణ ద్వారా నిరూపించిన వాడు. 1985 కారంచేడు నరమేధం తర్వాత కత్తి పద్మారావుతో కలిసి ఆంధ్రప్రదేశ్ దళిత మహాసభను స్థాపించడంలోనూ న్యాయ పోరాటంలోనూ ముందున్నవాడు. ఎంతటి సామాజిక కార్యకర్తో అంతటి రచయిత. నదిపుట్టిన గొంతుక, నాలాగే గోదావరి, పంచతంత్రం, కులం వర్గం వంటి రచనలు తారకంగారిని నిబద్ధతగల రచయితగా రుజువుచేస్తాయి. అద్దంలో చందమామ నవలతో దళిత వాస్తవికతను ప్రవేశపెట్టిన రచయితగా గుర్తింపు పొందిన చిలుకూరి దేవపుత్ర తన కథలు, నవలలతో అటు తెలుగు కాల్పనిక సాహిత్యానికి, ఇటు దళిత సాహిత్యోద్యమానికి ఏకకాలంలో గొప్పదైన ఒరవడిని అందించారు. ఈ నలుగురు గొప్ప రచయితల మృతికి కవిసంధ్య అంజలి ఘటిస్తుంది. ఈ డిసెంబర్ 6 భారతరత్న డా॥ బి.ఆర్. అంబేడ్కర్ వర్ధంతి సందర్భంగా ప్రత్యేక వ్యాసం అందిస్తున్నాం.

ఈ సంచిక వెలువడుతున్న సందర్భంలోనే కవిత్వానికి సంబంధించి మూడు మంచి కార్యక్రమాలు రూపుదిద్దుకున్నాయి. 1) ప్రపంచ సాహిత్యంలో అత్యంత విలువైన బహుమతిగా భావించే నోబెల్ సాహిత్య పురస్కారం ఈసారి అమెరికాకి చెందిన ప్రజా గాయకుడు బాబ్ డిలాన్‌కు ప్రకటించడం. 2) ది కల్చరల్ సెంటర్ ఫర్ విజయవాడ & అమరావతి సంస్థ "అమరావతి పొయిటిక్ ప్రిజమ్-2016' పేరుతో నవంబర్ 13,14 తేదీలలో అంతర్జాతీయ బహుభాషా కవిసమ్మేళనం నిర్వహిస్తుంది. ఈ సందర్భంగా సుమారు 46 ప్రపంచ భాషల నుండి దాదాపు 500 కవితలను ఆయా భాషల లిపులతో ముద్రించబడిన ఒక బృహత్ కవితా సంకలనం ఆవిష్కరణ జరుగుతుంది. ప్రపంచ సాహిత్యంలో బహుశా ఇది తొలి ప్రయత్నం కవిసంధ్య, స్ఫూర్తి సాహితి సంయుక్తంగా పుదుచ్చేరి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాల సాంస్కృతిక శాఖల సహకారంతో నవంబరు 26, 27 తేదీలలో జరుగుతున్న యానాం కవితోత్సవం-2016. ఈ సందర్భంగా వెలువడుతున్న ప్రత్యేక సంచిక ఇది. ప్రతీ మూడేళ్లకోసారి యానాంలో ఒకసారి కవితోత్సవం జరపాలని కవిసంధ్య సంకల్పం. దీనికి కవిత్వాభిమానుల ఆశీస్సులు, అండదండలు ఉంటాయని ఆశిస్తున్నాం. వచ్చే సంవత్సరం నుండి ప్రపంచ కవితా దినోత్సవ సందర్భంగా 'కవిసంధ్య' కవితల పోటీ నిర్వహించాలనుకోంటోంది. ●

## సంభాషణ



### వర్గ కుల నిర్మూలనా పద్ధతులను అన్వయించే
# మార్క్సిస్టు మహా తత్త్వవేత్త మనకు దొరకలేదు

**ప్రముఖ కవి, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత కె. శివారెడ్డితో శిఖామణి ఇంటర్వ్యూ**

ప్రశ్న : **మీ కుటుంబ నేపథ్యం, బాల్యం గురించి చెప్పండి.**

**జవాబు** : కింది మధ్య తరగతి వ్యవసాయ కుటుంబం నుండి వచ్చాను. ఇటువంటి కుటుంబానికీ ఒక 20 ఎకరాలున్న ఎగువ మధ్యతరగతి కుటుంబానికీ చాలా తేడా ఉంది. ఒకటి రెండు ఎకరాలున్న ఆసామి రైతు కూలీలాగానే జీవిస్తాడు. అటువంటి కుటుంబంలో పుట్టిన నా మీద అప్పటి సామాజిక ఘర్షణలన్నీ ఉన్నాయి. పైగా తల్లి లేని బాల్యం. అప్పులపాలైన కుటుంబం. ఇక్కణ్ణుంచి లోకాన్ని చూడటం ప్రారంభించాను.

ప్రశ్న : **మీరు చదివిన చదువులు, చేసిన ఉద్యోగాలు?**

**జవాబు** : గుంటూరు జిల్లా కూచిపూడిలో ఎస్ఎస్ఎల్‌సి దాకా, తెనాలి వివిఎస్ఆర్ కాలేజీలో బి.ఏ. డిగ్రీ అయితే ఇంగ్లీషు తెలుగు లిటరేచర్స్‌లో చేసాను. ఎం.ఏ. ఇంగ్లీషు ఆంధ్రా యూనివర్సిటీలో చేసాను. ఎం.ఏ. అయ్యాక మార్కుల జాబితా తీసుకుని హైదరాబాద్ వచ్చాను. ఒకటే ఉద్యోగం, 1966 నుండి 1999లో రిటైర్ అయ్యిందాకా వివేకవర్ధిని కాలేజీలో లెక్చరర్‌గా చేరి ప్రిన్సిపల్‌గా పదవీ విరమణ చేసాను.

ప్రశ్న : **కవిత్వ రచనపై ఆసక్తి ఎలా కలిగింది?**

**జవాబు** : దానికి హై స్కూల్‌లోనే బీజం పడింది. మా తెలుగు మాస్టారు జాస్తి శ్రీరాములు గారు ఛందస్సు నేర్పటంతో మొదలైంది. గొప్ప టీచర్. సాహిత్యం పట్ల, కవిత్వం పట్ల నాకు అభిరుచి కలగటానికి ఆయనే ప్రధానకారణం. దానికి తోడు మా అన్నయ్య (పెదనాన్నగారబ్బాయి) దగ్గర పెద్ద లైబ్రరీ ఉండేది. ఆనాడు తెలుగులో వచ్చిన ప్రముఖ సాహిత్య గ్రంథాలన్నీ అందులో ఉండేవి. ఎస్ఎస్ఎల్‌సి అయ్యేలోపు ఆ లైబ్రరీ మొత్తం చదివేశాను. ఇది రెండో కారణం.

ప్రశ్న : **బాల్యంలోనే తల్లిని పోగొట్టుకున్నానని చాలా సందర్భాల్లో చెప్పారు కదా! మీ కవిత్వంపై దాని ప్రభావం?**

**జవాబు** : తండ్రి లేకపోవటం వేరు, తల్లి లేకపోవటం వేరు. తల్లిలేకపోవటం పెద్ద లోటు. జీవితంలో ప్రధానమైన అంశం ఏదో కోల్పోతాం! బహుశా ఈ అమ్మలేని తనమే నన్ను కవిగా మలిచిందనుకుంటా! ఇది ఆశ్చర్యంగా ఒక సంపుటికి సరిపడా స్త్రీల మీద రాసిన కవిత్వం ఉంది. నిజానికి గుడిపాటి, పెన్నా ఎంతో వర్కవుట్ చేసి ఆమె ఎవరైతేనేం పేరుతో పుస్తక రూపంలో తెచ్చిందాకా నా 50 ఏళ్ల కవిత్వ జీవితంలో స్త్రీల మీద ఇన్ని కవితలు రాసాననే స్పృహ నాకు లేదు. బహుశా స్త్రీ ఒక అదృశ్యశక్తిలా నా కవిత్వం అంతటా ఆవరించడానికి అమ్మ లేకపోవటమే కారణమనుకుంటా!

ప్రశ్న : **ఇంగ్లీషు చదువులు చదివిన మీరు తెలుగు కవిత్వం వైపు ఎలా మళ్లారు?**

జవాబు : మళ్లడం అనేది ఏమీ లేదు. ఎంత ఇంగ్లీషు చదువుకున్నా, మాతృభాష అయిన తెలుగులో పలకటం హాయిగా సుఖంగా ఉంటుంది. సుళువుగా అభివ్యక్తి చెయ్యొచ్చు. ఇంగ్లీషులో నువ్వు ఎంత పండితుడివైనా కొన్ని పరిమితులుంటాయి.

ప్రశ్న : **మీరు కవితా రంగ ప్రవేశం చేసే నాటికి తెలుగు కవిత్వం స్థితిగతులు, రాజకీయ సామాజిక ఉద్యమాలు ఎలా వున్నాయి?**

జవాబు : 1966లో హైదరాబాద్ వచ్చిందాకా తెలుగు సాహిత్యం స్థితిగతుల గురించి పెద్దగా తెలీదనే చెప్పాలి. ఇక్కడి కొచ్చాకే తెలుసుకుంటానికి ప్రయత్నించాను. అయితే అప్పటి దాకా నాకు అంతగా ఆధునిక దృక్పథం లేదు. హైదరాబాద్ వచ్చేసరికి దిగంబర కవుల రెండవ సంపుటి వచ్చింది. దిగంబరుల గురించి తెలుసుకునే క్రమంలో తెలుగు కవిత్వం నేపథ్యం గురించి తెలుసుకోవలసిన అవసరం ఏర్పడింది. అప్పటికింకా అరసం కొనసాగుతున్నది. కమ్యూనిస్టు మేనిఫెస్టో చదవటంతో ప్రారంభమయిన నా మార్క్సిస్టు అధ్యయనం మావోయిజం దాకా వెళ్ళింది. నిజానికి 1955-65 దశాబ్దాన్ని స్తబ్ద దశాబ్దం అంటారు. అటు సమాజంలోనూ ఇటు సాహిత్యంలోనూ ఒక స్తబ్దత ఆవరించింది. నిజాం వ్యతిరేక తెలంగాణా సాయుధ పోరాట విరమణ తర్వాత దశ ఇది.

ప్రశ్న : **జీవిక కోసం మీరు హైదరాబాద్ వచ్చి ఉండకపోతే మీ సాహిత్య జీవితం ఎలా మలుపు తిరిగి ఉండేది?**

జవాబు : నేను హైదరాబాద్ వచ్చిందే కవిత్వం కోసం. 66 నుండి తెలంగాణలోనూ హైదరాబాద్‌లోనూ ఉండకపోతే, ఇక్కడి ఉద్యమాలతో అనుబంధం ఏర్పరచుకుని ఉండకపోతే కవిగా ఇప్పటి శివారెడ్డి ఉండే వాడు కాదు.

ప్రశ్న : **'శివారెడ్డి విరసం బయట ఉన్నా లోన ఉన్నట్టే' అనే మాట వింటుంటాం! విరసం మీ మీద అంత ప్రభావం చూపించిందా?**

జవాబు : చూపించింది. విరసం అంటే విరసం వెనకమాల వున్న రాజకీయ తాత్విక దర్శనం, పోరాటాలు అన్నీ కలగలిసే ఉంటాయి. వాటినుంచి విరసాన్ని విడదీసి చూడలేం! మరొక రకంగా ఈ రెంటిలో కలిసిపోయిన శివారెడ్డినీ విడదీసి చూట్టమూ సాధ్యం కాదు.

ప్రశ్న : **ఒక సందర్భంలో 'విరసం లేకపోతే శివారెడ్డి లేడు' అనే ప్రకటన చేసారు?**

జవాబు : ఆ మాట ముమ్మాటికీ నిజమే! విరసంతో పాటు ఎదిగిన వాణ్ణి నేను. ఇది నిజాయితీతో చెప్తున్న మాట. ఎవ్వరినీ సంతోషపెట్టడానికి కాదు. ఇది వాస్తవం.

ప్రశ్న : **అచ్చయిన మీ మొదటి కవిత ఏది? ఏ పత్రికలో?**

జవాబు : మార్టిన్ లూథర్ కింగ్ మీద రాసింది. ఆయన చనిపోయిన సందర్భంలో రాసాను. ఆంధ్రప్రభ వారపత్రికలో అచ్చయింది. తేదీ గుర్తు లేదు. అది అందరి దృష్టిలో పడింది.

**ప్రశ్న :మీ మొదటి కవితా సంపుటి ఏది? దానికి వచ్చిన స్పందన?**

**జవాబు :** రక్తం సూర్యుడు. 1973లో వచ్చింది. నా దృక్పథంలో మార్పు వచ్చిన తర్వాత అచ్చయిన కవితల నుండి ఎంపిక చేసి వేసిన సంపుటి. దాని మీద భారతి వంటి పత్రికల్లో మంచి సమీక్షలు వచ్చాయి. దానికి ఫ్రీవర్స్ ఫ్రంట్ బహుమతి రావడంతో సాహితీలోకం గుర్తించినట్టయింది. ఇప్పటికీ చాలా మంది రక్తం సూర్యుడు పేరుతో నన్ను రిఫర్ చేస్తుంటారు.

**ప్రశ్న :మీ కవితా యాత్రలో టర్నింగ్ పాయింట్‌గా మీరు ఏ కవితా సంపుటిని చెబుతారు? దానికి కారణాలు?**

**జవాబు :** భారమితి. 1983లో వచ్చింది. నా నాలుగో కవితా సంపుటి. అంతకు ముందు ఆసుపత్రి గీతం అనే దీర్ఘకావ్యం రాసి వున్నాను. క్రమక్రమంగా రాజకీయాలలో నిమగ్నమౌతూ, లోతులు కెళ్లే దశ. విస్తృతంగా తిరగటం, హైస్కూలు మొదలు డిగ్రీ కాలేజీల వరకూ ప్రసంగాలు, కవిత్వాలు వినిపించడం, జరుగుతున్న దశ. కవిత్వం విద్యార్థులకు, సామాన్యులకు అందాలంటే రూపపరంగా, ఏఏ మార్పులు చేసుకోవాలో అర్థమవుతూ వస్తున్న దశ. అందుకని ఒకరకమైన రూప విస్తృతి అవసరం అయింది. బహుశా ఆస్థితినుంచి వచ్చిన కవితలన్నీ భారమితిలో ఉన్నాయి. పొలిటికల్‌గా శివారెడ్డి ఏమిటనేది భారమితి చెప్తుంది.

**ప్రశ్న :మీ ముందు తరం కవులతో మీకున్న పరిచయాలు - ప్రభావాలు?**

**జవాబు :** నేను హైదరాబాద్ వచ్చేసరికి దిగంబర కవులున్నారు. కుందుర్తి సారథ్యంలో ఫ్రీవర్స్ ఫ్రంట్ చురుగ్గా ఉంది. కుందుర్తి, శీలావీర్రాజు గార్లతో సాన్నిహిత్యం, తద్వారా అప్పటికే ప్రసిద్ధులైన కవులతో పరిచయాలు, ప్రత్యేకించి ఏ ఒక్క తెలుగు కవో నన్ను ప్రభావితం చేయలేదు. తేనెటీగలాగ నా ముందుతరం కవులనుండి, వారి కవితా పద్ధతుల నుండి నేను చాలా స్వీకరించాను.

**ప్రశ్న :మీ కవిత్వ ప్రభావం 80వ దశకం కవులపై విపరీతంగా వుండేది? కవులకు సొంత గొంతు అవసరం కాదా?**

**జవాబు :** 80వ దశకంలో శివారెడ్డి కవిగా, ఉపన్యాసకుడిగా పాపులర్ అవడానికి అతని సంచార జీవితం, విద్యార్థి ఉద్యమాలతో అతని మమేకం, అవుట్ & అవుట్ వామపక్ష రాజకీయాలతో ఐక్యం కావటం కారణాలు. దీన్నుంచి శివారెడ్డి స్వీకరించింది చాలా ఉంది. బహుశా ఆయా కారణాల వల్ల ఆ తరం కవులపై నా ప్రభావం వుండొచ్చు. తొలిదశలో నా తర్వాత వచ్చిన కవులు, నా శైలిని ఎక్కువ అనుసరించి ఉండొచ్చు. తర్వాత తర్వాత వాళ్ల వాళ్ల సొంత గొంతులు వెతుక్కున్నారు. మంచి కవులుగా స్థిరపడ్డారు.

**ప్రశ్న :1979లో 'ఆసుపత్రి గీతం' తర్వాత మీరు మళ్లీ దీర్ఘకావ్యం రాయకపోవడానికి కారణం?**

**జవాబు :** నిజానికి ఆసుపత్రి గీతంకంటే ముందే 70, 80 పేజీలు రాసిన లాంగ్ పోయెం ఒకటుంది. అసంపూర్తి రచన. దాని గురించి మళ్లీ పట్టించుకోలేదు. 2002లో వెలువడిన 'అంతర్జనం' దీర్ఘకావ్యం అన్నారు కొందరు. ఆసుపత్రిలో ఉండగానే 70 పేజీల దీర్ఘకావ్యం 'అశ్వమేధం' పేరుతో రాసాను. ముగింపు ఇవ్వాల్సి ఉంది. దీనిలో కొన్ని భాగాలు పత్రికల్లో వచ్చాయి.

ఆధునిక జీవితంలో గత రెండు దశాబ్దాల కాలంలో వచ్చిన మార్పులను తీసుకుని, హైదరాబాద్ నేపథ్యంగా దీర్ఘకావ్యం రాయాలనే ఆలోచన ఉంది. ఇది ఎన్నటికీ ఆరని నిప్పు.

**ప్రశ్న : ఇప్పటి సామాజిక సమస్యల పరిష్కారానికి మార్క్సిజం సమాధానం చెబుతుందా?**

**జవాబు :** మార్క్సిజం భావ వాదపు ఛాయ కాదు. భౌతిక వాదం. అదొక శాస్త్రం, సైన్సు. శాస్త్రీయ దృక్పథం దాని ఆత్మ. మార్క్సిజం లెనినిజం అయిందీ, లెనినిజం మావోయిజం అయిందీ అంటే అర్థం మార్క్సిజాన్ని రష్యాకు అన్వయించినప్పుడు దాని విముక్తి మార్గం కనుగొనే దశలో లెనిన్ మహాశయుడు ప్రతిపాదించి, అన్వయించిన, విస్తృతంచేసిన మార్క్సిజమే లెనినిజం. అది ఆదేశ సమస్య పరిష్కారానికి మార్గమయ్యింది. చైనా సందర్భం వచ్చినప్పుడు 90 శాతం వ్యవసాయిక దేశమైన చైనా విముక్తి మార్గాన్ని కనుగొనే దశలో మావో మార్క్సిజం, లెనినిజాన్ని చైనాకు అన్వయించినప్పుడు పుట్టుకొచ్చిందే మావోయిజం. అంటే దేశ కాలాల పరిస్థితులకనుగుణంగా అన్వయించి పరిష్కార మార్గాలను అన్వేషించే శాస్త్రం అది. భారత దేశ స్థితిగతులను పరిగణనలోకి తీసుకున్నప్పుడు ఇక్కడున్న సంక్లిష్ట సామాజిక సంబంధాల్నీ, వర్గ, కుల, నిర్మూలనా పద్ధతుల్ని విశ్లేషించి, అన్వయించే ఒక మార్క్సిస్టు మహాతత్వవేత్త మనకు దొరకలేదేమో!

**ప్రశ్న : డా॥ బి.ఆర్. అంబేద్కర్ భారతదేశంలో శ్రమ విభజన మాత్రమే జరగలేదు, శ్రామికుల విభజన కూడా జరిగిందని ఆనాడే స్పష్టంగా గుర్తించాడు కదా?**

**జవాబు :** భారతదేశంలో వర్గం ఎంత సత్యమో! కులమూ అంతే వాస్తవం. కమ్యూనిస్టులు కులాన్ని పట్టించుకోలేదనే మాట ఒకరకంగా వాస్తవమే! అయితే ఆయా కాలాల రాజకీయ, సామాజిక సందర్భాలనుబట్టి, ప్రాధాన్యతలనుబట్టి అవగాహన మారుతూ ఉంటుంది. 40లలో పరిస్థితి వేరు ఇప్పటి పరిస్థితి లేదు. ఆ లెక్క కొస్తే దళితుల్నీ, స్త్రీలనూ పోరాటాల్లోకి తీసుకొచ్చింది కమ్యూనిస్టులే! అయితే స్త్రీ వాద, దళిత వాదాలు వచ్చిన తర్వాత వామపక్ష ఆలోచనా విధానంలో మార్పు రాలేదా అంటే వచ్చింది! నిన్న పట్టించుకోని వాటిని నేడు పట్టించుకుంటున్నారు.

**ప్రశ్న : మీ కవిత్వంలో పదాలు, వాక్యాలు ఎక్కువగా పునరావృతం అవుతుంటాయి, ఇది టెక్నిక్‌లో భాగమా?**

**జవాబు :** భాగమే! పాటలో లాగా వచన కవిత్వంలో కూడా సంగీతాన్ని ప్రవేశపెట్టే క్రమంలో ఇదిపుట్టుకొచ్చింది. అంటే శ్రోతను ఆకట్టుకుంటానికీ, తన వాతావరణంలోకి లాక్కుంటానికీ ఇది అద్భుతంగా పనికొస్తుంది. ముఖ్యంగా నువ్వొక పొయెమ్‌ని రెండర్ చేసినప్పుడు శ్రోతలను అద్భుతంగా ఆకట్టుకునే శక్తి దీనికుంది. అయితే ఇది ఆ దశ వరకే! మోహనా మోహనా తరువాతి కవితా సంపుటులకు ఇది వర్తించదు.

ప్రశ్న : **'కవిత్వం రాజకీయ సిద్ధాంతాల ప్రచారం కోసం కాదు' అంటారు అనుభూతివాదులు, మీరేమంటారు?**

జవాబు : తెలిసంటారో, తెలియకంటారో నాకైతే తెలియదుగానీ, ప్రాచీన సాహిత్యాన్ని బాగా చదువుకున్న వారు కూడా, రామాయణ, మహాభారతాల్ని అవలోకనం చేసిన వారు కూడా ఈ మాట ఎట్లంటారో నాకర్థం కాదు. కొంచెం ఆలోచిస్తే రాజకీయం కానిదేదీ జీవితంలో లేదు. స్త్రీవాదులన్నారు "పర్సనల్ ఈజ్ పొలిటిక్స్" అని. నువ్వు రాజకీయాల్ని మాట్లాడేటప్పుడు, రాజకీయ వస్తువును కవిత్వం చేసేటప్పుడు అది కవిత్వం అవుతుందా లేదా అనేది ముఖ్యం తప్ప రాజకీయాల్ని ఉచ్చరించడం నేరం అనటం కూడా ఒక సామాజిక నేరం అనుకుంటాను నేను. విషయం ఏమిటంటే - వస్తువు ఏదైనా సరే అది కవిత్వం అవుతుందా కాదా అనేది ముఖ్యం.

ప్రశ్న : **కళాభివ్యక్తి లేని సామాజిక రచనలను మీరు కవిత్వంగా అంగీకరిస్తారా?**

జవాబు : కళామూల్యాలు లేని ప్రజాకవిత్వం ఎంత నిరర్థకమో, కళా మూల్యాలున్నా ప్రజలు వస్తువుగాని కవిత్వం కూడా అంతే నిరర్థకం అన్నాడు మావో!

ప్రశ్న : **కవిత్వం రాయడానికి ఒక్కో కవికి ఒక్కో పద్ధతి ఉంటుంది కదా! మీరు కవిత్వం రాసే పద్ధతి?**

జవాబు : నా విషయానికొస్తే ఒక దశలో ఎక్కువ కవిత్వం తెల్లవారు జామున 2, 3 గంటల ప్రాంతాల్లో రాసే వాణ్ణి. పొద్దున్నే మళ్లీ దాన్ని తిరిగి చూసుకుని సవరణలు చేసుకోవటం జరిగేది. 50 ఏళ్ల సాధన తర్వాత ఇప్పటికీ ఒక మాటో, ఒక శబ్దమో, ఒక ఘటనో నన్ను కవిత్వం రాయడానికి ప్రేరేపిస్తాయి. బస్సులో రాస్తాను, ఆటోలో రాస్తాను. పాఠం చెబుతూ క్లాసు రూంలో మనసులో రాస్తాను. ఒక కవిత్వ వాతావరణ స్థితిలో నిత్యం నన్ను ఉంచుకోగలడం వలనే నేను రాయ గలుగుతున్నాను.

ప్రశ్న : **1969 తెలంగాణా ఉద్యమ సందర్భంలో సమైక్యవాదిగా 'వెలుగు బావుటా' దీర్ఘకావ్యం రాసారు కదా! అప్పటికీ యిప్పటికీ మారిన రాజకీయ అవగాహనే కారణమా?**

జవాబు : తర్కంకోసం కాదుగానీ, ఇప్పటి వీర తెలంగాణా వాదులంతా అప్పటి సమైక్య వాదులే! అది నా బాల్య దశ. రాజకీయ తాత్విక అవగాహన లేని దశ. అందుకనే తర్వాత ఆ కావ్యాన్ని నేను 'Disown' చేసుకున్నాను.

ప్రశ్న : **'నేను తెలంగాణ దత్త పుత్రుణ్ణని ప్రకటించుకున్నారు', కానీ తెలంగాణా కవులు, రచయితలు మిమ్మల్ని own చేసుకున్నట్టు లేదు?**

జవాబు : ఇందులో ఎటువంటి అవాస్తవం లేదు. నన్ను కవిగా, వ్యక్తిగా తీర్చిదిద్దింది తెలంగాణా. తెలంగాణ కవులనేది ఏ కవులో నాకు తెలీదు. కవిగా శివారెడ్డికి శత్రువులు చాలా మంది వున్నారు. వాళ్లు నా మీద దాడిచేయడానికి ఇదొక అవకాశంగా భావించి ఉండొచ్చు. నాకు తెలిసి ప్రధాన స్రవంతిలో ఉన్న సృజన కారులు ఎవరూ శివారెడ్డిని Disown చేసుకున్న దాఖలాలు లేవు.

ప్రశ్న : **ఇటీవల సాహిత్యంలో 'అసహనం' గురించి విపరీతమైన చర్చలు జరిగాయి. అవార్డులు వాపసు యివ్వడం వరకూ వ్యవహారం వెళ్లింది, దీనిపై మీ స్పందన ఏమిటి?**

జవాబు : బి.జె.పి. ప్రభుత్వం నరేంద్ర మోడి నాయకుడిగా అధికారంలోకి వచ్చాక జరుగుతున్న రాజకీయ, సాంస్కృతిక పరిణామాల దృష్ట్యా ఈ అసహనం ప్రధానాంశం అయింది. అంటే బిజెపి వచ్చాక డివిసీవ్ పాలిటిక్స్ ప్రధానం అయ్యాయి. అంటే విడగొట్టి పరిపాలించడం. మైనార్టీ ప్రజల్ని అనుమానస్పదంగా చూట్టం, శత్రువులుగా భావించడం, వారి ఆచార వ్యవహారాల మీద, ఆహార పద్ధతుల మీదా దాడి జరగటం జరుగుతుంది. ఇది వాళ్ల రాజకీయాల్ని ప్రమోట్ చేసుకుంటానికీ, ఎస్టాబ్లిష్ చేసుకుంటానికి వాడుకునే ఒక ప్రాసెస్. అక్కణ్ణుంచి వచ్చిందే ఈ అసహనం. ఆ నేపథ్యం నుండి కొంత మంది రచయితలు అవార్డులు తిరిగి యిచ్చారు. నిరసన తెలియ చేయడానికి వాళ్లు ఇదొక మార్గం అనుకున్నారు. నేను అలా అనుకోలేదు. నా కొత్త పుస్తకంలో అసహనం మీద సూటిగా, వ్యతిరేకిస్తూ నాలుగైదు పద్యాలున్నాయి.

ప్రశ్న : **మీరు చాలా కాలంగా చాలా అనువాదాలు చేస్తూ వస్తున్నారు. ఇంతవరకూ మీ అనువాద కవితలు గ్రంథరూపంలో రాకపోవడానికి కారణం?**

జవాబు : నా అలసత్వమే కారణం. నా అనువాదాలు అన్నీ కలిపి నాలుగైదు సంపుటాలు వుంటాయి. ఒక్క ఆఫ్రికన్ కవిత్వమే ఒక వాల్యూం అవుతుంది. అవీ త్వరలో వెలుగు చూస్తాయి.

ప్రశ్న : **ఇతర భారతీయ భాషా కవులు తెలుగు వారికి తెలిసినంతగా, తెలుగు కవులు ఇతర భాషల కవులకు తెలియక పోవడానికి కారణం?**

జవాబు : ఎక్కువ స్థాయిలో అనువాదకులు, తగినన్ని అనువాదాలు రాకపోవడమే! కర్ణాటక వంటి ప్రాంతాల్లో ఉన్నట్టు తెలుగులోనూ అనువాద కేంద్రాలు ఏర్పడినప్పుడు కొంతమార్గం సుగమమౌతుంది.

ప్రశ్న : **దళితవాదం ఉధృతంగా ఉన్నప్పుడు 'మా కవిత్వం మేం రాసుకుంటాం' అని కొందరంటే, శివారెడ్డి దళిత సమస్యల పట్ల స్పందించలేదని కొందరన్నారు? మీ అభిప్రాయం?**

జవాబు : ఒక సమస్యను నువ్వు మార్క్సిస్టుగా అర్థం చేసుకోవడం వేరు. అంబేద్కరిస్టుగా అర్థం చేసుకోవడం వేరు. శివారెడ్డి మార్క్సిస్టు. వాడికి అన్నీ ఇన్‌క్లూసివ్. ఒక సమస్యను సర్వసమగ్రంగా టోటల్‌గా అర్థం చేసుకోవడం వేరు. విడివిడిగా అర్థం చేసుకోవడం వేరు. కులసమస్య నాకు ఒక ఇన్‌క్లూసివ్ సమస్య. దానికదే ఎక్స్‌క్లూసివ్ కాదు. కాబట్టి తాత్కాలిక ఉద్రేకాలనించి నిందించిన వాళ్లు, వక్రీకరించిన వాళ్లు ఉండొచ్చు. శివారెడ్డి ఏమిటో తర్వాతి చరిత్ర చెబుతుంది.

ప్రశ్న : **ఇంత జీవితానుభవం, సాహిత్యానుభవం ఉన్న మీరు ఆత్మకథ రాసే ప్రయత్నం ఎందుకు చేయలేదు?**

జవాబు : రాసే ఉద్దేశం ఉంది. అది రెండు భాగాలుగా వచ్చుద్ది. హైదరాబాద్ రాకముందటిది మొదటి

భాగం. హైదరాబాద్ వచ్చాక అంటే 1966 నుండి ఇప్పటి వరకూ రెండో భాగం. రాస్తాను. దానికీ తగిన సమయం రావాలి కదా!

ప్రశ్న : **తెలుగు రాష్ట్రం యిప్పుడు రెండు రాష్ట్రాలయ్యాయి కదా! భాషా సాహిత్య సాంస్కృతిక అంశాలపై దీని ప్రభావం ఎంతవరకు వుంటుంది?**

**జవాబు** : ఆధిపత్య దశ దాటి, అన్యోన్య అవగాహనతో పరస్పరం సాంస్కృతిక సహజీవనం దిశగా ప్రయాణించటం ముఖ్యమైన అంశం అని నేననుకుంటున్నాను. దానికి ఇరు ప్రాంతాల కవులు, రచయితల, కళాకారులు తీసుకోవాల్సిన కార్యక్రమాలేమిటో కలిసి నిర్ణయించుకోవలసిన అవసరం ఉంది.

ప్రశ్న : **తెలుగు కవిత్వంపై సోషల్ మీడియా ప్రభావం మంచికా? చెడుకా?**

**జవాబు** : బహుశా మేలుకంటే కీడే ఎక్కువ జరిగిందేమోనని నా అనుమానం. ఫేస్‌బుక్‌లో కవిత పెడతావు. నీకదే సర్వస్వం. నువ్వే కవివి. నువ్వే జడ్జివి. నువ్వే శ్రోతవి, నిర్ణయాత్మక శక్తి కూడా నువ్వే! ఇది ఎక్కడికి తీసుకెళ్లుద్ది? నా అనుమానాలు నాకున్నాయి. ఇంక రాసిన మాటకీ, అచ్చయిన మాటకీ ఉన్న విలువలు వేరే వాటికి ఉండవేమో! ఇది పాతతరం అభిప్రాయం ఏమో!

ప్రశ్న : **కవి సంధ్య పత్రిక యానాం నుండి రావటంపై మీ అభిప్రాయం? యానాంతో మీకు గల సాహిత్యానుబంధం?**

**జవాబు** : మారిన సందర్భంలో కవిసంధ్యలాంటి పత్రికల అవసరం ఎంతైనా ఉంది. ఈ విషయమై గత సంచికలో నా అభిప్రాయం చెప్పాను. ఇక యానాంతో నా సాహిత్యానుబంధం గొప్పది. 1992లో అనుకుంటా, తెలుగు యూనివర్సిటీ రాజమండ్రి సాహిత్య పీఠానికి పోయిట్రీ వర్క్‌షాప్‌కు వచ్చిన కవులందర్నీ శిఖామణి మొదటిసారిగా యానాం తీసుకెళ్లాడు పది పన్నెండు మందిని. అప్పుడు జరిగిన కవిసమ్మేళనంలోనే దేవదానం రాజు మొదటి సారి కవిగా గళం వినిపించాడు. ఆ తర్వాత మళ్లీ శిఖామణి పెళ్లి, చిలక్కొయ్య ఆవిష్కరణ అదో పెద్ద జాతర. ఆ జ్ఞాపకాలు, అనుభవాలు ఇప్పటికీ కవులనోళ్లలో నానుతూనే ఉన్నాయి. అప్పటి నుండీ అనేక సందర్భాల్లో దేవదానం రాజు పుస్తకాల ఆవిష్కరణలకీ, 2014లో దేవదానం రాజు కవితా పురస్కారం అందుకునే వరకూ అనేకసార్లు. ఎప్పుడొచ్చినా కొత్తగా వుంటుంది యానాం – అఫ్సర్ యానాం వేమన ఏమనె, శిఖామణి యానాం సరస్వతి, యానామా నా ఆరోప్రాణామా కవితలు, దేవదానం రాజు కథా యానాం, యానాం కథలు, యానాం చరిత్రలు ఇలా తెలుగు సాహిత్యంలో యానాంకు ప్రత్యేక స్థానం ఉంది. పూర్వపు గొప్ప ఫ్రెంచి సంస్కృతి వారసత్వం ఉంది. ఇప్పుడు పెద్ద కల్చరల్ సెంటర్‌గా అభివృద్ధి చెందుతుందనే ఆశ కలుగుతోంది.

ప్రశ్న : **కొత్తగా కవిత్వం రాసే తరానికి మీరు చేసే దిశానిర్దేశం?**

**జవాబు** : అంత పెద్ద మాట ఎందుకు గాని, విస్తృతంగా చదవండి, మరింత విస్తృతంగా రాయండి. కవిత్వపు కాంక్షతో దహించుకుపొండి. కవిత్వం ఎట్లారాయాలో మీకే అర్థమౌతుంది. ●

నివాళి

# మా నాన్న సోమ సుందర్ గారి ప్రజ్ఞా విశేషాలు



శశికాంత్ శాతకర్ణి, 98853 89759

మా నాన్న గారు శ్రీ ఆవంత్స సోమసుందర్ వ్యక్తిత్వంలో మూడు ప్రధాన పార్శ్వాలు ఉన్నాయి. సృజనకారుడిగా, కవిగా, రచయితగా, విమర్శకుడిగా ఆయన కావించిన నిరంతరమైన విశేషమైన కృషి మొట్టమొదటిది అతి ప్రధానమైనదీను. వక్తగా ఆయన వచోధారావిశేషాలు రెండవది. సరస సంభాషణాశీలిగా, హాస్య సంభాషణలతో యువకులనందర్నీ అక్కున చేర్చుకొన్న గొప్ప స్నేహితుడిగా చివర దాకా కొనసాగడం మూడవ పార్శ్వం. మొదటి అంశం గురించి రెండు తెలుగు రాష్ట్రాల పత్రికలలోనూ వ్యాసాలు వెలువడుతున్నాయి. రెండు మూడు అంశాల గురించిన వివరాలు కొన్ని.

మేధావిగా ఆయనకు జవహర్‌లాల్ అంటే చాలా ఇష్టం. సోషలిస్టు శిల్పిగా, సోషలిస్టు భావుకుడిగా, స్వాప్నికుడిగా నెహ్రూ సోమసుందర్‌కు ఎంతో స్ఫూర్తినిచ్చారు. తత్కారణంగా నెహ్రూ ఆయన ఇష్టులైన మేధావులలో ఒకరు. అలాగే గురజాడ, దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, రాయప్రోలు, వేదుల, చలం, నండూరి సుబ్బారావు, కట్టమంచి రామలింగారెడ్డి, దువ్వూరి రామిరెడ్డి వంటి తెలుగు కవులు, టాల్‌స్టాయ్, మాక్సిమ్‌గోర్కీ, చెఖోవ్, డాస్టాయ్ విస్కీ, మయ్‌కో విస్కీ, పాబ్లో నెరుడా, ఆడెన్, టి.ఎస్. ఎలియట్, డిలాన్ థామస్ లాంటి పాశ్చాత్య రచయితలు అంటే ఎంతో ఇష్టం. వీరిలో ఎవరి గురించి ఏ ఒక్కరు వ్యతిరేకంగా మాట్లాడినా ఆయనకు బాగా ఆవేశం వచ్చేది. ముఖ్యంగా తాను పాల్గొన్న సభలలో ఆ అవకాశాన్ని అలా మాట్లాడిన వారిని ఖండించేందుకు వినియోగించుకొనేవారు. ఆవేశం వచ్చినప్పుడు చాలా మందికి మాటలు కుంటుపడతాయి. మాటల కోసం తడుముకొంటారు. కాని సోమసుందర్‌కు అటువంటి అవస్థ ఎప్పుడూ ఎదురుకాలేదు. ఆయన ప్రసంగం ప్రారంభించిన వెంటనే మాటల వెంట మాటలు, భావాల వెంట భావాలు, తాను ప్రతిపాదించదలచిన విశ్లేషణ పూర్తయ్యేదాకా నిరాఘాటంగా ప్రవహించేవి. ఆ ప్రసంగధారలో సంబంధిత కవి లేదా రచయిత రాసిన ప్రముఖ రచనలలోంచి ఉటంకింపులు వారి రచనా దృక్పథం, జీవన విధానం వంటి వన్నీ చోటు చేసుకునేవి. వారిని విమర్శించిన వారి అవగాహనా రాహిత్యాన్ని పఠన లోపాన్ని నిర్ద్వంద్వంగా ఎత్తి చూపేవారు.

ఒకసారి ఆయన జవహర్‌లాల్ నెహ్రూపై చేసిన ప్రసంగం గురించి చెప్పుకోవాలి. ఇది పిఠాపురం చినమాంబ పార్కులో జరిగింది. 1963లో కావచ్చు. ఆనాటి పురప్రముఖుడు, స్వాతంత్ర్య సమరయోధుడు, కాంగ్రెస్ నేత కె. సత్యనారాయణ ఆనాడు తన ప్రసంగంలో నెహ్రూ అంటే నిరసన వ్యక్తం చేశారు. దానికి సోమసుందర్‌కు బాగా ఆవేశం వచ్చింది. ఆవేశం వచ్చినప్పుడు రెండు చేతులూ నడుంకి చెరోవైపు పెట్టుకొని మాట్లాడటం ఆయనకు అలవాటు. నెహ్రూ గొప్పతనం గురించి, సోషలిస్టు స్వాప్నికుడిగా ఆయన మేధ గురించి, ఆయన రాసిన 'డిస్కవరీ ఆఫ్ ఇండియా'లో ఆయన ప్రదర్శించిన

అంతర్ దృష్టి గురించి కూలంకషంగా వివరిస్తూ గంటసేపు అనర్గళంగా ప్రసంగించారు.

ఆయన గురజాడ, దేవులపల్లి, శ్రీశ్రీ ఇత్యాదులపై పుంఖాను పుంఖంగా ప్రసంగాలు చేశారు. కృష్ణశాస్త్రి గారు మరణించిన తర్వాత ఆయనపై ఒక మంచి విమర్శనా గ్రంథాన్ని ప్రచురించాలని రాజాలక్ష్మీ పురస్కార వ్యవస్థాపకులు శ్రీ రమణయ్య రాజా సంకల్పించారు. పాలగుమ్మి పద్మరాజు వంటి పెద్దలతో చర్చించి, పోటీ నిర్ణయించి అందిన గ్రంథాలలో ఉత్తమ గ్రంథానికి పదివేల రూపాయలు బహుమతిని ప్రకటించారు.

కృష్ణశాస్త్రి గారు జీవించి ఉండగా తనపై గ్రంథాన్ని రాయవలసిందిగా సోమసుందర్‌ను పలుమార్లు కోరారు. తప్పక రాస్తానని సోమసుందర్ ఆయనకు వాగ్దానం చేశారు. కాని సోమసుందర్ ఆ పుస్తకం రాయకుండానే కృష్ణ శాస్త్రి గారు మరణించారు. సోమసుందర్ ఆ గ్రంథ రచనను దీక్షతో పూర్తిచేసి, 'కృష్ణశాస్త్రి కవితాత్మ' అనే పేరుతో ఆ గ్రంథాన్ని పోటీకి పంపారు. ఉత్తమ గ్రంథంగా ఆ పుస్తకమే ఎన్నికయింది. బహుమతి పురస్కారం సభ చెన్నైలో జరిగింది. విదుషీమణి శ్రీమతి రుక్మిణీ అరండేల్ చేతుల మీదుగా సోమసుందర్ పురస్కారాన్ని అందుకొన్నారు. ఆ సభకు బెజవాడ గోపాలరెడ్డి ముఖ్య అతిథిగా హాజరయ్యారు. గోపాలరెడ్డి గార్కి రవీంద్రనాథ్ ఠాకూర్ అంటే బాగా అభిమానం. ఆయన కొంతకాలం శాంతినికేతన్‌లో గడపడమే దానికి కారణం. ఆయన తన ప్రసంగంలో కృష్ణశాస్త్రిని ఠాగూర్‌తో పోలుస్తూ కృష్ణశాస్త్రి కంటే ఠాగూర్ గొప్పవాడని మాట్లాడారు. ఆ మాటలకు సోమసుందర్‌కు బాగా ఆవేశం వచ్చింది. భావకవి చక్రవర్తిగా, దార్శనికుడిగా, షెల్లీ కీట్స్ వంటి ఆంగ్ల భాష కవులు ప్రభావాన్ని అందిపుచ్చుకొన్న తొలి తెలుగు కవిగా తెలుగు జాతి సాంస్కృతిక పునరుజ్జీవన మేధావిగా, బ్రహ్మశ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడు గారి అంతే వాసియైన సాంఘిక సంస్కర్తగా భాషలో, భావనలో ఆయన తీసుకొచ్చిన విప్లవాత్మక మార్పులను 'సోదాహరణంగా వివరిస్తూ కృష్ణశాస్త్రి గేయాలు, ఇతర రచనల నుండి ఎన్నింటినో ఉటంకిస్తూ కృష్ణశాస్త్రి ఎంతటి మహత్తరమైన కవో వివరించారు. ఆధునిక భావజాలంలో శాస్త్రీయ చైతన్యంలో కృష్ణశాస్త్రి ఠాగూర్ కంటే ఎంత ముందంజవేశారో నిరూపించారు. ఆయన నిర్భీతికి సభలోని వారు ఆశ్చర్యపోవడంతో పాటు ఎంతో ఆనందించారు.

తర్వాత ముచ్చటించుకోవలసిన అంశం సంభాషణ చతురుడిగా సోమసుందర్ ప్రతిభా విశేషాలు. ఆయన శ్రీకాకుళం మొదలుకొని ఆదిలాబాద్ వరకుగల విజయనగరం, విశాఖపట్టణం, రాజమండ్రి, ఏలూరు, విజయవాడ, ఖమ్మం, అనంతపురం, కర్నూలు, కడప, చిత్తూరు, హైదరాబాద్, కరీంనగర్, వరంగల్ వంటి అనేక ప్రదేశాలలో అనేకసార్లు ప్రసంగించారు. ప్రసంగాల కోసం ఎక్కడకు వెళ్ళినా ఒకరిద్దరు యువకులను తన కూడా తీసుకువెళ్ళేవారు. ఎక్కడికి వెళ్ళినా ప్రసంగానంతరం స్థానికులయిన యువకులు పదిపదిహేను మంది ఆయన చుట్టూ చేరేవారు. హాస్యపూరితమైన సంభాషణ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ వంటి వారి గేయాలు గొంతెత్తి పాడడం, ఆయా కవుల రచనా విశేషాలను, జీవిత విశేషాలను వివరించడం నిర్విరామంగా చేసేవాడు. సభానంతరం యువ బృందమంతా ఆయనతో పాటు ఆయన వసతికి చేరుకొని అనేక ప్రశ్నలతో సందేహాలతో ఆయనను సంభాషణలోకి దింపేవారు. వారితో మాట్లాడిస్తూ, అనేక జోకులు, తెలుగు రచయితలే కాక పాశ్చాత్య రచయితల రచనా జీవిత విశేషాలు వివరిస్తూ సోమసుందర్ తెల్లవార్లూ వారితో గడిపేవారు. మరీ ముఖ్యంగా విశ్వనాథ

సత్యనారాయణ గార్కి సంబంధించిన జోకులు విరివిగా చెప్పేవారు. కొద్దిపాటి సూచనలతో యువకులు గొప్ప కవితలు రాయగలరనే ప్రగాఢ విశ్వాసం ఆయనకుండేది. వారి కవితలు, రచనలు వినడం, అప్పటికప్పుడే వాటిలో మార్పులు సూచించడం కవితలో ప్రస్తావిత అంశానికి, వాడిన పదజాలానికి తుల్యమైన ప్రముఖుల గేయాలు, కవితలు సమయ స్ఫూర్తితో పేర్కొనడం ఆయన అలవోకగా చేసేవారు. ఈ కారణంగానే యువకులు ఆయనతో ఎన్ని గంటలు గడిపేందుకైనా ఉత్సాహించేవారు. వారితో ప్రియ సంభాషణ చేయడం, హాస్యోక్తులతో గేయాలాపనతో సోమసుందర్ వారిని మంత్రముగ్ధులను కావించేవారు. ఆయనతో ముచ్చటిస్తూ గడిపిన రాత్రుల గురించి ప్రసిద్ధ కవులు శివారెడ్డి, నిఖిలేశ్వర్, దిలావర్, కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ వంటివారు తమ ప్రసంగాలలో ఎన్నోసార్లు పేర్కొన్నారు.

ఆయన తరచు పేర్కొనే ఉటంకింపులలో ఎలియట్ పేర్కొన్న కవితలోని ప్రతిపద అర్థం తెలియకపోయినా కవిత అంతరార్థం మనకు బోధపడుతుంది అన్నది. డైలాన్ థామస్ పేర్కొన్న కవితలోని పదాలు కాక పదాల మధ్య కొత్త భావాలు తలెత్తినవి. హుంకరించాలి, గర్జించాలి అన్నది ఆకులందున అణిగి మణిగి కవిత 'కోవిల పలుకవలెనోయ్' అన్న గురజాడ మాటలు 'ప్రపంచమొక పద్మవ్యూహం కవిత్వమొక తీరని దాహం' అన్న శ్రీశ్రీ మాటలు ఆయనకెంతో ఇష్టమైనవి ఆయన వాటిని తరచు పేర్కొనేవారు. చిన్ననాటనే తలిదండ్రులను కోల్పోయి, అనాథ అయి భుక్తికోసం ఎన్నో క్లిష్ట పనులు చేసి దుర్భరమైన బాల్యాన్ని గడిపిన గోర్కీ జీవితంలోని పలు అంశాలను ఆయన తరచు వర్ణించేవారు. ఒ. హెన్రీ కథలను వివరణాత్మకంగా మనసుకు హత్తుకొనేలా వివరించి చెప్పేవారు. ఏ చిన్న దుర్వాసనను ఆయన భరించలేకపోయేవారు. కనుకనే ఆయన దగ్గర ఖరీదైన అత్తర్లే కాక పునుగు, జవాది, గంధం వంటి సుగంధ ద్రవ్యాలుండేవి. ఆయన రుచిప్రియులు. రుచిగా ఉన్న వంటకం ఎక్కడ తిన్నా ఆ వంటకం ఎలా చేశారని చేసిన వారిని తరచి తరచి అడిగి తెలుసుకొనేవారు. పదిమందికీ దాని గురించి తెలియజెప్పేవారు. కారం, పులుపు ఇష్టంగా తినేవారు.

శాస్త్రీయ సంగీతం అంటే వల్లమాలిన ప్రీతి. బాలమురళి, బడేగులాం, ఎమ్.ఎల్. వసంతకుమారి, ఎమ్.ఎస్. గోపాల కృష్ణన్, డాక్టర్ ఎన్. రాజం వంటి వారి సంగీతం నిరంతరం వినేవారు. నిద్దట్లో కూడా సంగీతం సన్నగా వినబడవలసిందే. ఆ సంగీతం కల్గించిన పారవశ్యంతో అనేక కవితలు, వ్యాసాలు రాశారు. ●




## కృతజ్ఞతలు!

యానం కవితోత్సవ సందర్భంగా 'కవిసంధ్య' ప్రత్యేక సంచికను వెలువరిస్తున్నాం అని తెలుపగానే తమ సంస్థ పక్షాన ప్రకటనను మంజూరుచేసిన **ఆంధ్రప్రదేశ్ గిరిజన సహకార సంస్థకూ,** ముఖ్యంగా దాని మేనేజింగ్ డైరెక్టర్, ప్రముఖ కవి **శ్రీ అకెళ్ల రవిప్రకాష్** గారికి కవిసంధ్య సంపాదకవర్గం ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేసుకుంటుంది. **- సంపాదక వర్గం**

# సుహృల్లేఖ

డా॥ పొత్తూరి వెంకటేశ్వరరావు
సీనియర్ పాత్రికేయులు, హైదరాబాద్

**శిఖామణి గారి సంపాదకత్వంలో వెలువడిన 'కవిసంధ్య' మూడవ సంచిక అందింది.**
**సంపాదకవర్గం అందరికీ ధన్యవాదాలు,**

నాకు తెలిసినంతలో కేవలం కవితలు, తత్సంబంధమైన రచనల ప్రచురణ కోసం ఇప్పుడు తెలుగులో వెలువడుతున్న ఏకైక పత్రిక ఇదే. ఇంగ్లీషు, ఇతర భాషలలో, ఇతర దేశాలలో వస్తుండవచ్చు. తెలుగులోనూ కథలు, ఇతర సాహిత్య రచనలతో కొన్ని పత్రికలు, తక్కువేగాని ఉన్నాయి.

1954లో అబ్బూరి ఛాయాదేవి గారి సంపాదకత్వంలో 'కవిత' సంచికలు రెండు వెలువడ్డాయి. దాచి ఉంచుకొనదగిన సంచికలవి. ఛాయాదేవి, సంకలనకర్తగా ఆమె పేరే ఉన్నప్పటికీ, ఆమే, ఆమె భర్త అబ్బూరి వరదరాజేశ్వరరావు సమష్టి కృషి ఫలితం ఆ సంచికలు. సంవత్సరానికి నాలుగు సంచికలు వెలువరించాలనుకొన్న ఈ దంపతుల సంకల్పం రెండు సంచికలతో ఆగిపోయింది.

అబ్బూరి రామకృష్ణరావు, శ్రీశ్రీ, ఆరుద్ర, అజంతా, బైరాగి మొదలైన కవుల రచనలు కవితలో వచ్చాయి. గొప్ప ప్రయోగం.

శిఖామణి గారు, భాస్కర్ రెడ్డి గారు, మరికొందరు సాహితీ మిత్రులు కలసి ప్రచురిస్తున్న 'కవిసంధ్య' సాహిత్యాభిమానులందరు స్వాగతించవలసిన గొప్ప ప్రయత్నం. స్వాగతించటమేకాదు సహకరించి, చేతనైన విధంగా ప్రోత్సహించవలసిన ప్రయత్నం.

ప్రసిద్ధ కవుల రచనలతోపాటు, ఔత్సాహిక రచయితల రచనలను ప్రచురించటం మంచి విధానం. సమీక్షలు మరొక ఆకర్షణ. సాహిత్య వ్యాసం ఒకటే వేసినా అది చాలా విలువైనది. మునుముందు మరెన్నో కొత్త శీర్షికలు వస్తాయని అనుకొంటున్నాను.

అందుకు అవకాశం ఉన్నదిగాని, తగిన వనరులు ఉంటేనే అది సాధ్యం. సహృదయులైన సాహిత్యాభిమానులు, పోషకులు తెలుగునాట ఉన్నారు. అందరి సహాయసహకారాలు లభించి, 'కవిసంధ్య' కలకాలం వర్ధిల్లుగాక!

కొత్తశీర్షిక

# మనకావ్య సంకలనాలు



సుధామ, 9849297958

ఒక కవి తనకవితలను ఒకచోట చేర్చి పుస్తకంగా ప్రచురించినప్పుడు దానిని కవితా 'సంపుటి' అనీ, అదే కొందరు కవుల కవితలను ఏర్చికూర్చి గ్రంథరూపం ఇచ్చినప్పుడు దానిని కవితా 'సంకలనం' అనీ వ్యవహరిస్తున్నాం. 'ఆంథాలజీ' అని అంగ్లంలో పేర్కొనేదానినే, మనం 'సంకలనం'అంటున్నాం. మన కవితా సంకలనాలు అనగానే కవితాభిమానులకు చటుక్కున గుర్తొచ్చేపేరు 'వైతాళికులు'. దానిని ముద్దుకృష్ణ సంకలనం చేశాడు. ఆధునిక చైతన్యాన్ని వెలార్చే కవితాసంకలనంగా సాహిత్య ప్రపంచంలో పేరొంది పలుముద్రణలు పొందిన సంకలనం 'వైతాళికులు'.

హాలుడి 'గాథాసప్తశతి' అతి ప్రాచీన సంకలనం అనాలి. ఎందుకంటే గాథాసప్తశతిలో హాలుడు చేసిన పని సంకలనమే. అత్యంత ప్రాచీనమైన లౌకిక సాహిత్యం అది. గాథాసప్తశతి వందలాది మంది కవులు రాసిందే. శాతవాహన సామ్రాజ్య ప్రభువైన హాలమహారాజు నాటి జనభాష అయిన ప్రాకృతాన్నే రాజభాషగా కూడా చేసుకుని, సామాన్య జనానీకంలోని కవులుసైతం అభివ్యక్తం చేసిన జనజీవన సంఘటనల కవితాత్మక అంశాలనీ ఒక ఏడువందలు గ్రంథస్థం చేశాడు. సప్తశతి అంటే ఏడువందలు అనే! కాళిదాసువంటి మహాకవి సైతం ప్రభావితుడైన సంకలనం అది. శ్రీనాథుడు తన నూనుగుమీసాలనూత్న యౌవ్వనంలో ఈ గాథాసప్తశతినే 'శాలివాహన సప్తశతి'గా తెలుగులోకి అనువదించానని స్వయంగా చెప్పుకున్నాడు. అది అనువాదం అనేకన్న అనుసృజన అనవచ్చు. 'శాలివాహన స్తపశతి నుడివితి' అన్నాడందుకే. శ్రీనాథుడి శాలివాహన సప్తశతిలో అయిదుపద్యాలు మాత్రమే ప్రస్తుతం లభ్యాలు. అందులో రెండు వినుకొండ వల్లభరాయుని 'క్రీడాభిరామం'లో వున్నాయి. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, తిరుమల రామచంద్ర, ఇంద్రగంటి శ్రీకాంత శర్మ, దీవి సుబ్బారావు, నరాల రామారెడ్డి, కోడూరి ప్రభాకర రెడ్డి గాథాసప్తశతిలోని రమణీయ కవితాత్మక భావనలను, కథలను తెలుగులోకి తెచ్చారు.

ప్రాచీన కవుల పద్యాలను ప్రబంధ రత్నాకరం, ప్రబంధ మణిభూషణం వంటి కవితా సంకలనాలుగా గతంలోనే కూర్చిన వారున్నారు. కల్యాణ కల్పవల్లి పేరిట కరుణశ్రీ గారు (జంధ్యాల పాపయ్యశాస్త్రి) ప్రాచీన కవుల పద్యాలను ఏర్చికూర్చి సంకలనం చేశారు. (1966లో జరిగిన ద్వితీయ ముద్రణ ప్రతి భవదీయుడి వద్ద ఉంది). అందులో ప్రతి కవి పద్యాలకూ ఓ పుష్పాన్ని సంకేతం చేశారాయన. నన్నయ్యగారి నందివర్ధనాలు, కవిబ్రహ్మ కమలాలు, నాచనసోముని నల్లకలువలు, బమ్మెర వారి మందారాలు, కంకంటి కనకాంబరాలు అలా... బహుశా ఆయనకు తెలుసోలేదో గానీ మొట్టమొదట గ్రీకు కవితా సంకలనం క్రీస్తుపూర్వం 60వ సంవత్సరంలోనే గ్రీకు కవి, సంకలనకర్త అయిన మెలియాగెర్ గడారా నాటి 130 మంది చాటువులను, చతురోక్తులను 'ది గార్లెండ్' పేరిట

సంకలనం చేశాడు. అంతకుముందు క్రీస్తు పూర్వం రెండవ శతాబ్దంలోనే ఏథెన్స్‌కు చెందిన 'పోలెమాన్' గ్రీసుదేశం అంతటా విస్తారంగా పర్యటించి శాసనాలు, శిలాఫలకాల మీద వున్న కవితాత్మక రచనలను సంకలనం చేశాడట. అవేవీ నిలవక కాలగర్భంలోనే కలిసి పోయాయట. 'దిగార్లెండ్' ఆఫ్ మెలియాగర్‌గా ప్రసిద్ధి పొందిన గ్రీకు కవితా సంకలనంలోని కవులందరికీ సంకలనకర్త అయిన మెలియాగర్ ఒక పువ్వునో, పొదపేరునో, మైలికపేరునో ప్రతీకాత్మకంగా ఆ కవుల పేర్లకు జతచేశాడు. గ్రీకు కవితా సంకలనాలకు ఆద్యమైనదిగా 'ది గార్లెండ్' ప్రసిద్ధి చెందింది. 'ఆంథోలజీ' అనే ఇంగ్లీష్ మాట 'సంకలనం' అన్న అర్థంలో 17వ శతాబ్దంలోనే గ్రీకునుంచి 'ఆంథోలజియా' నుంచి వచ్చింది. గ్రీకులో ఆ పదానికి 'పూలసేకరణ' అనే అర్థం. కవితా సంకలనం అంటే ఆ రకంగా పుష్పగుచ్ఛంగానో, పూలదండగానో సంభావించుకోవచ్చు. ప్రతి కవితా ఒక పువ్వే మరి!

తూర్పు ఆసియా సంప్రదాయాన్ననుసరించి 'ఆంథోలజీ' అంటే కవితాసంకలనం స్థిరపడిన మాటయ్యింది. ఒక ప్రక్రియలోని 'బెస్ట్' నంతా ఒకచోటచేర్చడం చైనా వారికి చాలా ఇష్టమైనపనిట. అలాగే జపాన్‌లో 'టంక' అనేది చరిత్రలో ఒక కాలంలోని ప్రముఖులనంతా ఒకచోట చేర్చి విస్తృత ప్రాచుర్యం కల్పించడంగా వుందిట!

20 దశతాబ్దంలో కవితా సంకలనాల ప్రచురణ ఒక ప్రముఖమైన విషయం అయింది. ఆంగ్ల కవిత్వంలో జార్జియన్ పొయెట్రీ పరంపర ఒక ట్రెండ్ సెట్టర్ అయింది. ముఖ్యంగా ఒక భావజాలానికి చెందిన యువకవులను ఆ తరం కవితా సంకలనంగా వారి కవితలతో సంకలనల ప్రచురణ జరిగింది. 'ఆక్స్‌ఫర్డ్ బుక్ ఆఫ్ ఇంగ్లీష్ వర్స్' అనే పేరుతో క్విల్లర్ కౌచ్ చేసిన సంకలనం ఇంగ్లీష్ కవితా సంకలనల్లో ఒక మైలురాయి. 1250 నుండి 1900 వ సంవత్సరం వరకూ వచ్చిన ఇంగ్లీష్ కవిత్వం నుండి ఏర్చికూర్చిన కవులకవితలతో ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్ 1900 సంవత్సరంలో ప్రచురించిన ఆ ఆంగ్ల కవితా సంకలనం ప్రథమ ముద్రణలోనే సుమారు అయిదులక్షల కాపీలు అమ్ముడు పోయిందంటే ఆ సంకలన ప్రాచుర్యం ఎలాంటిదో వేరే చెప్పాలా? 1939లో పరిష్కృత ముద్రణను సంపాదకుడు కొన్ని కవితలను 19వ శతాబ్దం ముందువాటిల్లోంచి తొలగించి కూర్చాడు. 1901 నుంచి 1918 వరకూ వచ్చినకొన్ని కొత్తకవితలను చేర్చాడు. ఆ ద్వితీయముద్రణ అందుబాటులో వుంది. ఆక్స్‌ఫర్డ్ కవితా సంకలనాలు ఆ తరువాత అనేకం పలువురు సంకలనకర్తలు వెలువరిస్తూ వచ్చారు. హెలెన్ గార్డెనర్, జాన్‌వైన్, విలియమ్‌హార్మన్, క్రిస్టోఫర్ రిక్స్, థామస్‌కిన్సిల్లో డేవిడ్ సెసిల్, డోనాల్డ్ డేవి, వై.బి. ఈట్స్, ఫిలిప్ లార్కిన్, గిల్బర్ట్ ముర్రే, స్టీఫెన్ గోసెల్లీ వంటి సంకలనకర్తలు సంపాదకులుగా వివిధ పేర్లతో బ్రిటిష్ పొయెట్రీని కవితా సంకలనాలుగా వెలువరించారు. 1999లో క్రిస్టోఫర్ రిక్స్ 'ఆక్స్‌ఫర్డ్ బుక్ ఆఫ్ ఇంగ్లీష్ వర్స్' సంకలనం చేశాడు. వైవిధ్యభరితమైన కవితా సంకలనాలు వెలువరించడంలో వారికివారేసాటి అనాలి.

**(మళ్ళీ వచ్చే సంచికలో)**

నివాళి

# సాహితీ వజ్రాయుధం: సోమసుందర్



డా॥ ఎన్. ఈశ్వరరెడ్డి, 9490192228

తెలుగు కవిత భావ కవితా లక్షణాలతో పితృదేవతల మత్తునుండి, అగ్రదేవతల గుత్తాధిపత్యం నుండి, పురాణగాథల్నుండి పాడిందే పాటగా నిరాటంకంగా సాగుతున్న దశలో సోమసుందర్ (18.11.1924) జన్మించారు. ఇక్ష్వాకుల కాలం నుండి ఇంగ్లీషువారి దాకా నిరాఘాటంగా సాగుతున్న ఫ్యూడలిజం భారతీయుల గుండెల్లోకి వేళ్ళు దించి, తనను కీర్తించడమే సాహిత్య పరమావధిగా మనగలుగుతున్న సందర్భంలో సోమసుందర్ కలం పట్టారు.

కాళ్ళూరి ప్రకాశరావు. వెంకాయమ్మ దంపతులకు ఎనిమిదో సంతానం సోమసుందర్. తూర్పుగోదావరి జిల్లా అన్నవరం సమీపంలోని శంఖవరం సోమసుందర్‌కు పురుడు పోసిన గ్రామం. కాళ్ళూరి దంపతులకు తొమ్మిది మంది సంతానం. వారిలో ఇద్దరు మరణించగా ఏడు మంది మిగిలారు. తల్లి వెంకాయమ్మ ఆరోగ్యం క్షీణిస్తున్న దశలో పినతల్లి ఆవంత్స వెంకాయమ్మ ఇంటికి దత్తపుత్రుడుగా వెళ్ళిపోవలసిన వచ్చింది. సోమసుందర్‌కు అప్పటికి 4 సంవత్సరాలు.

'కక్కి'గా పిలవబడే పినతల్లి ఆవంత్స వెంకాయమ్మ సోమసుందర్‌కు చిన్నతనంలోనే శ్రీకృష్ణశతకం, భాగవతం, అమరకోశం, శబ్దమంజరి, బాలరామాయణం, సంస్కృత పంచ కావ్యాలను బోధించింది. తల్లి ఒడే సోమసుందర్‌కు మొదటి పాఠశాల. పెంచిన తండ్రి వెంకటరావుకు సాహిత్యంపై వున్న ఎనలేని మక్కువ కూడా సోమసుందర్‌లో సాహిత్యాభిరుచిని పెంచింది. సోమసుందర్ భాషా గంభీరతకు పెంచిన తల్లే పునాదు లేసింది.

విద్యార్థి దశనుండే దేశకాల పరిస్థితులను అవగతం చేసుకుంటూ ప్రగతికోసం కొత్త మార్గాలు అన్వేషించడంలో విశ్వకవి రవీంద్రుడి సాహిత్యం, పెండ్యాల ఉద్యమస్ఫూర్తి ఎంతగానో దోహదపడ్డాయని ఆయన స్వయంగా చెప్పేవారు. కళాశాలలో చదువుతున్న రోజుల్లో కళాశాల చదువు వ్యర్థమనిపించింది. తను ఆవాహనం చేసుకొన్న కవిత్వంతో సమాజంలో మార్పు తేవాలని నిర్ణయించుకున్నారు. బతుకు తెరువు గురించి బెంగ పడాల్సిన అవసరం లేనంత ధనం ఉండడంతో ఉద్యోగం గురించి ఆలోచించాల్సిన అవసరం లేకపోయింది. వృత్తి- ప్రవృత్తి రెండూ సాహిత్యసృజనే అయ్యాయి. కాల్డ్‌వెల్ చెప్పిన 'కళ ప్రజల చేతుల్లో ఉన్న తిరుగులేని ఆయుధం' అనే సిద్ధాంతాన్ని నిరూపించాలనే ప్రయత్నంలో కవిత్వానికి సానబెట్టే పనిలో పడ్డారు సోమసుందర్.

కమ్యూనిజం సోమసుందర్‌కు కొత్తదారి చూపించింది. సమాజ మార్పుకు అవసరమైన కొత్త సూత్రాలను బోధించింది. కవితా వస్తువు ఉపాస్య దేవతల చుట్టూ తిరగడం ఆయనకు సుతరామూ నచ్చలేదు. సామాన్య మానవుడే ఆయన కవితా హృదయంలో అల్లుకున్నాడు. 'సామాన్యుడి కనువెలుగులు

కొనచూపులే నా కవితామతల్లికి పరిణయ హారాలుగా మారాయం'టాడు. 1943 మార్చిలో ప్రజాశక్తి వారపత్రికలో అచ్చయిన శ్రీశ్రీ 'జగన్నాథ రథచక్రాలు' కవితను ఆర్.బి. పెండ్యాల సోమసుందర్‌కు తెచ్చి ఇచ్చారు. ఆ కవిత చదివిన సోమసుందర్ శరీరంలో విద్యుత్తు తరంగాలు ప్రసరించాయి. ఆ ఆవేశం, ఆ కసి సోమసుందర్‌లో వజ్రాయుధమై పైకి లేచింది.

"తన చరిత్ర తనె పఠించె, పక్కున నవ్వింది ధరణి/ తన గాథను తనె ధరించె, బోరున ఏడ్చింది ధరణి' (సమధర్మం) అంటూ భూమాత పురిటి నొప్పులను వినిపించారు.

"నిర్భాగ్యుల గుండె చీల్చి/ ధనికులు త్రావిన రక్తం/ నరభక్షకుడగు దుందుభి / కట్టిన ఎముకల దుర్గం" గా ఉన్న బూర్జువా వ్యవస్థపై సమర శంఖారావం పూరించారు.

'బానిసల దండయాత్ర' పేరుతో నిరంకుశ నిజాంను వ్యతిరేకిస్తూ రాసిన గేయం నిజాం చర్యలతో అట్టుడికిన తెలంగాణా ఉద్యమకారులకు గొప్ప ఉత్సాహానిచ్చింది. నవాబుకు వెన్నులో చలి పుట్టించే వాక్యాలు గేయ రూపంలో నాట్యం చేశాయి.

ఖబడ్దార్ ఖబడ్దార్ / హే నిజాం పాదుషా హే
ఒక వీరుడు మరణిస్తే / వేల కొలది ప్రభవింతురు/
ఒక నెత్తుటి బొట్టులోనే / ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు

"నిజాం కీచకుడా/ నీ పీచ మణచ ప్రజలంతా / ఒక పిడికిలి ఒక గొంతుక / ఒక మ్రోతై ధ్వనిస్తారు/ మృతవీరుల స్మరిస్తారు / నవయోధుల సృజిస్తారు" అంటూ విప్లవజ్వాలగా ఎగిసి పడ్డారు సోమసుందర్. సోమసుందర్ కవిత్వానికి చిరునామాగా 'వజ్రాయుధం' మారడానికి ఈ కవితా జ్వాలలే కారణం.

వజ్రాయుధం తర్వాత వేల కవితలు, గేయాలు పుస్తక రూపంలోకి వచ్చాయి. గోదావరి జలప్రళయం, రక్తాక్షి, మేఘరంజని, సోమరసం- సుందరకాండ, మిణుగురులు, అనలకిరీటం, వెన్నెలలో కోనసీమ, రాలిన ముత్యాలు, మావూరు మారింది, ఆగతానికి శుభారంభం, బృహత్కావ్యాలు, ఒక్కకొండలో వేయి శిల్పాలు, ఆంగ్లసీమలో ఆమని వీణలు, గంధమాదనం, చేతావనీ, దోనాపాలా, రక్తరేఖ, హృదయంలో హిరోషిమా, ధూపచ్ఛాయ, ఆమ్రపర్ణి, క్షితిజరేఖలు, మనస్సంగీతం, చిన్మయలహరి, జీవనలిపి, సీకింగ్ మై బ్రోకెన్ వింగ్ మొదలైన కావ్యాలు గ్రంథరూపంలో వచ్చాయి. వచనం, గేయం, ఛందోరూప కవిత్వం, మినీకవిత, దీర్ఘకవిత మొదలైన రూపాలలో ఈయన కవిత్వం వెలువడింది.

కథారచయితగా సోమసుందర్ రాసిన కథలు వాస్తవ సంఘటనలకు అక్షరసత్యాలుగా నిలిచాయి.

బుద్ధదేవ్‌బోస్, లియోనార్డో డావెన్సీ, ఖాజా నజ్రూల్ ఇస్లాం, షెల్లీ జీవితం మొదలైన కవుల జీవితాన్ని- సాహిత్యాన్ని పరిచయం చేస్తూ అదే పేరుతో రాసిన చరిత్రలు, సంగీత కళాకారుల గురించి రాసిన 'హంసధ్వని', కాళిదాసు రఘువంశంలో చెప్పిన కథను 'కాళిదాసు రామకథ' అనే శీర్షికలతో విభిన్న రచనలు చేశారు.

విమర్శకుడిగా 20వ శతాబ్దంలో వచ్చిన అభ్యుదయ రచయితలందరి రచనలపై విమర్శ రాశారు. కృష్ణశాస్త్రి కవితాత్మ, మార్క్సిజము- కవిత్వము, రుధిర జ్యోతిర్దర్శనం, కవిత్వం కాలాతీత కాంతిరేఖ, అమృతవర్షిణి, సాహిత్యంలో సంశయ కల్లోలం, అక్షర సమార్చన, పురిపండా ఎత్తిన పులిపంజా, నారాయణచక్రం మొదలైన విమర్శగ్రంథాలు సోమసుందర్‌లోని విమర్శకుడికి వెన్నె తెచ్చాయి.

అభ్యుదయ కవిత్వం రెక్కలు తొడిగే కాలంలో ప్రారంభించి నడిపిన 'కళాకేళి' సాహిత్య పత్రిక, 'మందీ- మనిషి' నాటకం, 'సమాగం' నవల ఆయనలోని బహుముఖ ప్రజ్ఞకు సాక్ష్యాలు. 'కలలు-కన్నీళ్ళు' స్వీయచరిత్ర ఆయన అనుభవాన్ని పట్టించే మనఃప్రవాహం.

అభ్యుదయ కవితా సాహిత్య ప్రస్థానం ప్రారంభించిన సోమసుందర్ చివరి వరకు కూడా అదే లక్ష్యంతో రాశారు. తొలితరం అభ్యుదయ కవులలో ఒకడుగా ఉండి, వాళ్ళ ఆశయాల్ని కడవరకూ కొనసాగించారు. శ్రీశ్రీ, నారాయణబాబు, పురిపండా, ఆరుద్ర, అనిశెట్టి, దాశరథి, కుందుర్తి మొదలైన మహోన్నతులతో కవితా ప్రస్థానం మొదలుపెట్టి, తదనంతరం కూడా వాళ్ళ వారసత్వాన్ని బతికించారు.

శతాధిక గ్రంథకర్తగా సోమసుందర్‌కు శతాధిక సన్మానాలు జరిగాయి. 1974 నాటి ముఖ్యమంత్రి జలగం వెంగళరావు, మండలి వెంకట కృష్ణారావు, బాట్టం శ్రీరామమూర్తి, ఉషశ్రీ, ప్రోలాప్రగడ, మూల్యాల భద్రమూర్తిశర్మ, శొంఠి కృష్ణమూర్తి లాంటి ఎంతోమంది సోమసుందర్‌ను సన్మానించారు.

'మావూరు మారింది' కావ్యానికి 1979లో సోవియట్ లాండ్ 'నెహ్రూ' పురస్కారం లభించింది.

1985లో 'కృష్ణశాస్త్రి కవితాత్మ' విమర్శ గ్రంథానికి 'రాజ్యలక్ష్మి ఫౌండేషన్' అవార్డు, 1991లో తెలుగు విశ్వవిద్యాలయ ప్రతిభా పురస్కారం, 1993లో తెలుగు విశ్వవిద్యాలయ గౌరవ డాక్టరేట్ సుగుణమణి సాహితీ పురస్కారం (2001), తిలక్ అవార్డు (2001), గురజాడ అవార్డు (2001) మొదలైనవి సోమసుందర్‌ను వరించిన వాటిలో కొన్ని.

మానవతావాదిగా, అభ్యుదయ ప్రవర్తకుడిగా, తెలుగుజాతికి సోమసుందర్ ఎంతో సేవ చేశారు. విమర్శకుడిగా దాదాపు అభ్యుదయ కవులందరి సాహిత్య సమాలోచన చేసి విమర్శాచరిత్రలో తన స్థానాన్ని భద్రపరుచుకున్నారు. 69 సంవత్సరాలు సాహితీ జీవితాన్ని ఉన్నత విలువల కోసం వెచ్చించారు. భారతీయ నాగరికతలోని మంచి సంప్రదాయాలను గౌరవిస్తూనే, విప్లవాత్మకమైన కొత్త విలువల్ని సమాజంలో పరిఢవింప చేయడానికి సోమసుందర్ కృషి చేశారు. తెలుగు సాహిత్య చరిత్రలో సోమసుందర్ స్థానం విశిష్టమైనది. చెరిగిపోనిది. ●



ధారావాహిక - 3

# గాథాసప్తశతి - కొన్ని అనువాదాలు

బొల్లోజు బాబా, 9849320443



## గాథాసప్తశతి - దేవతల ప్రస్తావన

ఈశ్వరునికి శిరస్సుపై గంగ, సగభాగమై పార్వతీదేవి ఉన్నారు. జానపద సాహిత్యంలో "గంగా గౌరీ సంవాదం" పేరిట పాటలు ఉన్నాయి. ఈశ్వరుడు సంధ్యావందనం చేసే సమయంలో చేతిలోకి "గంగను" తీసుకోవలసి వచ్చినప్పుడు, పార్వతీదేవి ఏవిధంగా కనిపించిందో అని ఈ ప్రాచీనకవి చేసిన ఊహ ఎంతో సుందరంగా ఉంటుంది.

అర్ఘ్యమివ్వటానికి అర్థనారీశ్వరుడు
గంగను చేతిలోకి తీసుకొన్నప్పుడు
అసూయతో ఎరుపెక్కిన గౌరీదేవి మోము
దోసిటిలో కమలమై ప్రతిబింబించింది.
ఆ అంజలి జలాలకు వందనమిడు.

ప్రియురాలు సిగ్గుపడే సమయంలో ప్రియుని కనులను తనచేతులతో కప్పటం అనేది ఒక అందమైన చేష్ట. అలా ముక్కంటి కనులు మూయాలంటే పార్వతీదేవికి ఒకచేయి తక్కువైందట. మరప్పుడామె ఏమి చేసిందటా?

శివపార్వతుల సంగమ సమయంలో
వలువలు తొలగగా సిగ్గిల్లిన పార్వతీదేవి
రెండుచేతులతో విభుని రెండు కళ్లూ మూసి
మూడవకంటిని ముద్దాడింది.

ఢిల్లీకి రాజైనా తల్లికి కొడుకే అన్నది ఒక నానుడి. చెట్టంత ఎత్తుకు కొడుకు ఎదిగినా తల్లి మాత్రం ఆకాశమై అతని తలనిమురుతుంది. లేతప్రాయంలోనే కులకాంతల వలువలు దోచిన కృష్ణుని గురించి యశోద మాతృవాత్సల్యంతో మాట్లాడేటప్పుడు....

"నా కృష్ణుడు ఇంకా చిన్నపిల్లాడే' అని
యశోద అన్నపుడు,
గోపికలు కృష్ణుని చూస్తూ
ముసిముసి నవ్వులు నవ్వుకొన్నారు.

ఒక స్త్రీ మోము గుండ్రంగా, కాంతులీనుతూ ఉన్నదని చెప్పటానికి చంద్రబింబంతో పోల్చటం అనేది అనేక మంది కవులు చేసే వర్ణన. కానీ ఇదే విషయాన్ని రెండువేల సంవత్సరాల క్రితం గొప్ప చమత్కారంతో ఈ ప్రాచీన కవి ఎలా చెప్పాడో చూడండి.

సుందరీ ! ఈ రోజు పౌర్ణమి.
ఈ రాత్రి పెరట్లో పడుకోకు సుమీ!
రాహువు నీ ముఖాన్ని
చంద్రబింబమని అని భ్రమపడగలడు.

పై గాథలో చెప్పిన విషయమే మరింత అందంగా, మరింత గడుసుగా ఈ క్రింది గాథలో కనిపిస్తుంది. "చందమామ-స్త్రీమొఖము" ఉపమానాన్ని ఈ గాథ పరాకాష్టకు తీసుకెళ్ళి వదులుతుంది. ఈ క్రమంలో దీనిని మించిన పదచిత్రం మరొకటేదయిన ఉందంటే అది ఖచ్చితంగా ఈ కవి వ్రాసిందే అయి ఉంటుంది.

ప్రతీ పౌర్ణమి రోజునా సృష్టికర్త
చందమామను ఒకసారి తీసి
నీ మోముతో పోల్చిచూసి
చిన్న చిన్న మార్పులు చేసి
మరలా పెడుతున్నాడు.

ఆకుపచ్చని ఈకలతో, ఎర్రనిముక్కుతో రామచిలుక చూడటానికి చాలా అందంగా కనిపిస్తుంది. రామచిలుకలు సాధారణంగా ఒక గుంపుగా ఎగురుతూ ఉంటాయి. అలాంటి ఒక రామచిలుకల గుంపు ఎగురుతూ వచ్చి వాలే దృశ్యాన్ని ఒక అందమైన పదచిత్రంగా ఈ గాథలో దర్శించవచ్చు...

రామచిలుకల దండు ఆకాశంనుండి
క్రిందకు వచ్చి వాలుతుంటే,
వైకుంఠంలోని లక్ష్మీదేవి యొక్క
పచ్చలు కెంపులు పొదిగిన నగలేవో
నేలకు జారిపడినట్లనిపిస్తోంది.

ఈ గాథలలో మన్మథుని గురించి అనేక చోట్ల వస్తుంది. ఒక యవ్వనవతి వక్షాన్ని వర్ణించేటపుడు వచ్చే మన్మథుని ప్రస్తావన ఆ గాథకు గొప్ప పటుత్వాన్ని, లోతును ఇస్తూ, రోమాంచితం చేస్తుంది.

ఆమె చనుద్వయం
ప్రేమను దాచుకొన్న
బంగారు లంకెబిందెలు
ఒక్కోదాని పైనా మన్మథుని
తేనెరంగు అధికార ముద్ర.

*(మిగతా వచ్చే సంచికలో)*

# నా మొదటి పద్యం



ఇంద్రగంటి శ్రీకాంత శర్మ, 98480 78079

నేను హై స్కూలులో చదివే నాటి నుంచి మా నాన్నగారి లైబ్రరీలో ఉండే పుస్తకాలు చదివే వాడిని. ముఖ్యంగా కథలు, నవలలు, పాతభారతి, ప్రతిభ, కిన్నెర వంటి పత్రికలు.

1961 నాటికి చలం పుస్తకాలు బాగానే చదివాను. ఆయన మా నాన్నగారికి స్నేహితుడు కావడం వల్ల చలం తిరువణ్ణామలై రమణ మహర్షి ఆశ్రమంలో ఉంటున్నారని తెలిసింది. అప్పటి నుంచి ఆయనకు ఉత్తరాలు రాస్తూండే వాడిని. ఆయన వెంటవెంటనే జవాబు రాస్తూండేవారు. ఆయన ఉత్తరాలు ఆయన కథలంతగా ఆకర్షించేవి. ఆయనతో ఏర్పడిన ఆపాటి చనువు పురస్కరించుకుని - నేను అప్పుడే కొత్తగా రాసిన "ఆమె నవ్వింది" అనే చిన్న స్కెచ్‌ని అభిప్రాయం కోసం పంపించాను. నాకు అప్పటికి పదిహేడేళ్ల వయస్సు. అందులో థీమ్ ఏమిటంటే బాల్యం నుంచి వృద్ధాప్యం వరకు స్త్రీ జీవితంలో వివిధ దశల గురించి - ఆ స్కెచ్‌ని వచన కవిత్వ పద్ధతిలో వాక్యం క్రింద వాక్యంగా రాసినట్టు గుర్తు.

నాలుగో నాటికల్లా ఆయన్నుంచి నాకొక ఉత్తరం వచ్చింది. "నీ గీతాలు బాగున్నాయి. నువ్వూ నేనూ నిశ్చందోబద్ధ కవులు. నువ్వు పంపిన దానిని దేనికైనా పంపనా?" అని. నాకు ఆనందంతో ఒళ్లు తెలియలేదు. చలం నన్ను మెచ్చుకోవడం!! - "మీ యిష్టం" అని జవాబు రాశాను.

కొద్ది రోజులు గడిచాక ఆయన నాకొక ఉత్తరం రాశారు. "నీ గీతాల్ని కె. సభా గారు నడిపే 'దేవదత్తం' పత్రికకి పంపాను. ఈ మధ్యనెందుకో అది రావడంలేదు. పగిలిపోయిందేమో!" - అని.

ఆయనలా అన్నారుగాని, 'దేవదత్తం' 1961 ఆగస్టు సంచికలో "ఆమె నవ్వింది" అచ్చయింది. నాకు పోస్టులో కాపీ వచ్చింది. (ప్రస్తుతం ఈ రచన అలభ్యం) రచయితగా నా పేరు 'శ్రీకాంత్' అని మాత్రమే ఉంటుంది. అసలు ఈ నాటి నా పేరుని శ్రీకాంత్ చేసింది చల్లంగారే. మా నాన్నగారు నాకుపెట్టిన అసలు పేరు శ్రీకంఠశర్మ. ఇంగ్లీషు స్పెల్లింగ్ రీత్యా అలా మారింది. నిజానికి శ్రీకాంత్ పేరు పక్కన శర్మ ఉండడం చలంగారికి ఇష్టం లేదు. మా నాన్న గారి మీద గౌరవం కొద్దీ నా పేరులో ఆయన పెట్టిన శర్మని నేను కొనసాగించాను.

తొలినాళ్లలో - అంటే 1962, 1963 సంవత్సరాలలో నా పేరుముందు ఇంటిపేరు పెట్టేవాణ్ణి కాను. ఆంధ్రపత్రిక వారపత్రిక నా మొట్టమొదటి కథ అచ్చువేసింది. నా తొలి సాహిత్య వ్యాసాన్ని 1962లోనే ఆంధ్రప్రభ దినపత్రిక ఆదివారం అనుబంధంలో అచ్చువేశారు. నా తొలి రేడియో కవిత, నాటకం, 1969లో ప్రసారమయ్యాయి. తొలి పుస్తకం 'శిలామురళి' గేయ కథా కావ్యం 1970 జనవరిలో ఏలూరు సురుచి ప్రచురణల పేరిట అచ్చయింది. ఆ ముద్రణ ఖర్చు, జానకీ బాల తను పనిచేసే ఆర్.టి.సి. ఆఫీసులో అప్పుపెట్టి ఇచ్చింది.

ఈ తొలి తొలి ఆనందాలు చాలా విలువైనవి, వాటిలో దాగి వున్న ఆరాటాలు, సిగ్గు, భయాలతో సహా... ●

సాంస్కృతికం

# తెలుగులోనే ప్రమాణం చేసాను!



## మల్లాడి అంతరంగం

పి. చంద్రశేఖర్ అజాద్, 9246573575

**వ**రసగా 5వ సారి యానాం శాసనసభ్యులుగా ఎన్నికైన పుదుచ్చేరి రాష్ట్ర ఆరోగ్య మరియు కళలు, సాంస్కృతిక శాఖామాత్యులు శ్రీ మల్లాడి కృష్ణారావు గారు రాజకీయంగానే కాక సాహిత్య, సాంస్కృతిక రంగాల పట్ల విశేషమైన అభిమానం కలవారు. 30 మంది సభ్యులున్న పుదుచ్చేరి తమిళ అసెంబ్లీలో తెలుగులో ప్రమాణ స్వీకారం చేసి తెలుగు తనాన్ని నిరూపించారు. ఆయన అంతరంగ కథనాన్ని ప్రముఖ రచయిత పి. చంద్రశేఖర్ అజాద్ "నేను... నా ప్రజలు.. నా యానాం" పేరుతో గ్రంథస్తం చేయగా 2016 ఫిబ్రవరిలో వెలువడింది. ఆ గ్రంథం నుండి మల్లాడిగారి అంతరంగం తెలిపే ఆయన మాటలు కొన్ని...



**భా**ష గురించి.. నేను ముందుగానే చెబుతాను. నేను చదువుకుంది తక్కువని. నేను భాషా పండితుడ్ని కాదు. నిత్య జీవితంలో వ్యవహరించటానికి, నా ఆలోచనలను ఎదుటివారికి అర్థం అయ్యేలా చెప్పటానికి తగినంతగా నేర్చుకున్నాను. నేర్చుకుంటున్నాను.

ఏ భాషలో అయినా తప్పులున్నా ధైర్యంగా మాట్లాడేస్తాను. తెలుగులో కూడానా అంటారు మీరు. నాకు తెలుగు కూడా పూర్తిగా రాదు. ఇది సరదాకి అనటం లేదు. భాష మహాసముద్రం. ఇంక యాసలు, మాండలికాలు, నదులు, సెలయేర్లు లాంటివి. వీటి లోతులు కొలవటం ఎవరి వల్ల అవుతుంది.

మనం నేర్చుకునే భాష, జ్ఞానం, ఇవన్నీ నిన్నటి నుండి తీసుకుంటూ ఈ రోజు నిర్మించుకుంటున్నాం. రేపు అనంతం - భాషయినా, మతం అయినా, సైన్సయినా, అన్నీ నాకు తెలుసు, నేను పరిపూర్ణ జ్ఞానవంతుడ్ని అని ఎవరయినా చెప్పుకుంటే అంతకు మించిన అమాయకులుండరు. ఎవరి స్వర్గంలో వారిని వుండనిద్దాం. నేనయితే అన్నీ నాకు తెలుసు అనుకునే అజ్ఞానిగా వుండను.

తెలుగు, తమిళం, ఇంగ్లీష్‌ని మాట్లాడగలను - నా తప్పులతో సహా. పూర్తిగా కాకపోయినా సారాన్ని అర్థం చేసుకుంటాను" అంటారు. అందుకే ఆయన ఎన్నో దేశాలు తిరిగారు. మానవులందరికీ ఉమ్మడి భాష ప్రస్తుతం ఆంగ్లం కావచ్చు. కాని హావభావాలుంటాయి. ఒకే రకమైన స్పందనలు ఉంటాయి - కొన్ని విషయాల్లో. అవి కొంతమేర సాధారణ అవసరాలు తీర్చుతాయి. జంతువులకే మనం అన్నీ నేర్పగలుగుతున్నాం. నిజానికి 'అవసరం' అన్నీ నేర్పిస్తుంది అనే మల్లాడిని...

"కవిత్వం - కథలు రాస్తారా, రాయాలనుకున్నారా?" అని అడిగితే

"నాలో సాహసం ఉంది. దుస్సాహసం లేదు. అలాంటి పనులు చేయటానికి చాలామంది వున్నారు. అందుకే వారిని గుర్తించి, గౌరవించటం. నా ప్రయాణాల్లో నాతో పుస్తకాలుంటాయి. అవి చదువుతాను. ఎక్కువ సమయం ఉండదు. అందరిలానే నాలో కళాకారుడున్నాడు. అప్పుడప్పుడు పాడాలని, కొన్ని పాత్రలు పోషించాలని వుంటుంది. అన్ని పనులూ ఒకరే చేయలేరు. ఆ అవసరం లేదు కూడా. మనం ఏం చేయగలం, ఏం చేయాలి అని నిర్ణయించుకోవటంలోనే మనుషుల విజయాలుంటాయి. రెండు పడవలు, నాలుగు పడవల మీద కాళ్లు వేస్తానంటే కుదరదు. మనకు రెండు కాళ్లు, రెండు చేతులు మాత్రమే వున్నాయి. వాటికి కొన్ని పరిమితులున్నాయి.

మిమ్మల్ని కవులూ రచయితలూ, కళాకారులు తమ సభలకు ఆహ్వానించినపుడు మీ ఉపన్యాసాలు ఎలా ఉంటాయి?

ఆయన చిన్నగా నవ్వి...

"ఉపన్యాసమా! అక్కడ నేను మాట్లాడను. ఇంతకుముందు అన్నట్లు ఎక్కడ ఎంతవరకు మాట్లాడాలో నాకు తెలుసు. వారిని సత్కరించటం, వారి కృషికి అభినందనలు తెలియచేయటం వరకు నేను పరిమితం అవుతాను. అనువుగాని చోట్ల అధికులం అనరాదు అంటారు. నేను చదువుకున్నది తక్కువ అని నాకు తెలుసు. అధికారంలో ఉన్నాం కదాని ఏదిబడితే అది మాట్లాడితే అభాసు పాలవుతాం.

నేను ఇంటర్ మీడియట్ తప్పాను. మీరు నా కంటే ఎక్కువ జ్ఞానం ఉన్నవారు. నేను మీ ముందు ఎంత తక్కువ మాట్లాడితే అంత మంచిది. నా నోటి నుండి వచ్చే ప్రతి మాటలోనూ మీరు తప్పులు పట్టేస్తారు. మీరు చెప్పే విషయాలు నేను వినాలనుకుంటున్నాను అని చెబుతాను. ఏ ప్రసంగంలోనైనా చివరిగా ఇట్లు 'మీ మల్లాడి కృష్ణారావు' అని చెప్పి ముగిస్తాను. అది నా అలవాటు.

అలాగే ఆధ్యాత్మిక ఉపన్యాసాలను ఏర్పాటు చేస్తుంటాం. అప్పుడూ అంతే. మనం ఒకరిని ఆహ్వానిస్తున్నామంటే అర్థం వారి జ్ఞానాన్ని, అనుభవాన్ని మనం తెలుసుకుంటానికి. అంతేగాని వారిని అడ్డం పెట్టుకుని మన పాండిత్యం ప్రకటించటానికి కాదు" అన్నారు.

ఆయన ప్రకారం "మనల్ని మనం వ్యక్తపరచుకోవటం ఓ అంశం. మన మాటలు మన పిల్లలకు, ఇంట్లో వారికి అర్థం కావాలి. అలాగే వారూ తమ బాధలను స్పష్టంగా చెప్పాలి. ఇది ఇంట్లో మొదలయితే బయటివారికి మనం ఏదయినా చెప్పవచ్చు.

కొంతమంది ఏం మాట్లాడుతున్నారో వారికే స్పష్టంగా తెలియదు. అంత గందరగోళం, తికమక వారిలో ఉంటాయి. నా వరకు నేను అలాంటి స్థితికి రాకుండా చూసుకుంటాను.

తెలుగులోనే ప్రమాణ స్వీకారం చేసాను

అసెంబ్లీలో నేను మాట్లాడాలనుకున్న ప్రతి అంశాన్ని ఇంగ్లీష్‌లోకి అనువాదం చేయించి ఆ కాపీలను స్పీకర్‌కి, మంత్రులకి, సంబంధిత కార్యదర్శులకు, హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్‌కి, శాసన సభ్యులకి అందించే వాళ్లం. వాళ్లు అవన్నీ చదువుకుంటారు. ఆ రకంగా నేను ఏం చెప్పాలనుకున్నానో వారికి తెలుస్తుంది.

తర్వాత కాలంలో నేను తెలుగులోనూ, తమిళంలోనూ కూడా మాట్లాడుతుంటాను. సమయం, సందర్భం బట్టి తెలుగులో సామెతలతో సహా బలంగా నా వాదం వినిపిస్తూ, తమిళంలో కూడా వాటిని వివరించేవాడిని. ●

నివాళి

# నిత్య చలనశీలి మహాశ్వేతా దేవి



కాత్యాయనీ విద్మహే, 9440550379

"పుటక నీది చావు నీది బ్రతుకంతా దేశానిది" - కాళోజి

బ్రతుకంతా ప్రజల నుండి నేర్చుకొనటానికి, ప్రజల పక్షాన నిలబడి మాట్లాడటానికి, పని చేయటానికి, ప్రజల గురించి రాయటానికి మీదు కట్టిన మహోన్నత అధికారపు పదఘట్టనలో నలిగిపోతున్న, ఆధిపత్యానికి బలి అవుతున్న సన్న చిన్నకారు రైతులు, రైతు కూలీలు, అశేష శ్రామిక జనం, ప్రత్యేకించి ఆదివాసీలు, మహిళలు వారి మౌన వేదనలకు, ఆకాంక్షలకు, ఆరాట పోరాటాలకు గొంతు నివ్వటానికి సాహిత్యాన్ని మాధ్యమంగా చేసుకొన్న ఒక గొప్ప నమూనా మహాశ్వేతా దేవి.

నిజానికి ఆమె సౌకర్యవంతంగా జీవించటానికి అన్ని అవకాశాలు ఉన్న భద్రలోక మహిళ. సామాజిక హోదా, సాంస్కృతిక భావజాల సంపద పుష్కలంగా ఉన్న కుటుంబంలో పుట్టి (1926 జనవరి14) పెరిగి, అటువంటి స్థాయి కలిగిన మరొక కుటుంబానికి కోడలై, స్వయంగా కళాశాలో ఇంగ్లీషు భాషా సాహిత్య బోధకురాలై ఉండికూడా అక్కడ సంతృప్తి పడక పోవటంలోనే మహాశ్వేతాదేవి రూపొందింది. 1950 నుండి సుమిత్రాదేవి అనే కలం పేరుతో కథలు, వ్యాసాలూ రాస్తూనే ఉన్నా ఝాన్సీ రాణి చరిత్రను నవలగా పునర్ని ర్మించాలనుకొన్న క్రమంలో ఝాన్సీ జీవించిన బుందేల్ ఖండ్ ప్రాంతాలలో ప్రజలు సంభావించే ఝాన్సీని తెలుసుకొనటానికి చేసిన ఒంటరి సాహస యాత్ర దానికి ప్రారంభం. అక్కడి నుండి ఆమె సాహిత్య వ్యాసంగం అంతా ప్రధానంగా భిన్న వర్గాల ప్రజాసమూహాల దుఃఖ కారణాల అన్వేషణగానూ, విముక్తి లక్ష్యంగా వున్న సామాజిక ఆచరణగానూ రెండంచుల కత్తి పదునుతో వికసించింది. విస్తరించింది. నిత్య అభద్రతల మధ్య నిరంతర జీవనపోరాటాలలో నిమగ్నమైన ప్రజలనే ఆమె శాశ్వత చిరునామాగా చేసింది.

మహాశ్వతాదేవి బెంగాలీ రచయిత అయినా శరత్ చంద్రుని వలే తెలుగువాళ్ళకు అత్యంత ఆత్మీయ రచయిత. ఆమె రచనలు రాకాసి కోర, ఒక తల్లి, బషాయిటుడు, ఎవరిదీ అడవి, ఝాన్సీ మొదలైన నవలలు, ద్రౌవది వంటి కథలు, అనువాదాలు 1980ల నుండే తెలుగు వాళ్లకు అందుబాటులోకి వస్తూ వున్నాయి. ఆ రచనల సాహిత్య వస్తు వ్యక్తీకరణలు తెలుగు వాళ్ల సామాజిక జీవితానుభవానికి వ్యాఖ్యానాలు అవుతూ సహానుభూతికి కారణమవుతూ సమస్యల పట్ల సరి అయిన అవగాహనను కలిగిస్తున్నాయి. రాకాసికోర నవల స్వాతంత్ర్యానంతర భారతదేశంలో కూడా వెట్టి, అక్రమ వసూళ్లు, కట్టుబానిసత్వం మొదలైన పద్ధతులలో శ్రమదోపిడి, లైంగిక దోపిడి యథేచ్ఛగా సాగుతున్న వైనాన్ని చిత్రించింది. గాంధేయవాదాన్ని అపహాస్యానికి గురి చేసే భూస్వాముల దోపిడీపీడనలు, వాటికి కొమ్ముకాసే ప్రభుత్వ అధికార వ్యవస్థ పని తీరును చిత్రించిన ఈ నవలలో తెలంగాణ నైజాం కాలపు భూస్వామ్య దోపిడీ పీడనల దగ్గర నుండి స్వాతంత్ర్యానంతర జగిత్యాల సిరిసిల్లాల దోపిడి అణచివేతల వరకు కొనసాగిన తన దుఃఖ చరిత్రనే చదువుకొన్నది. ఒక తల్లి నవల జగిత్యాల జైత్ర యాత్ర తరువాత తెలంగాణాలో తల్లుల కడుపుకోత యాతనలను, తీరని దుఃఖాన్ని

తలపుకు తెచ్చి మనుషులందరినీ ఒక సామూహిక దుఃఖంలో భాగం చేస్తుంది. జల్, జంగల్, జమీన్ పై హక్కు కోసం ఆదివాసీ పెట్టిన పొలికేక ఎవరిదీ అడవి నవల. అయితే బిర్సాముండా తిరుగుబాటు జీవితంతో అల్లూరి సీతారామ రాజు జీవితాన్ని, కొమురంభీం జీవితాన్ని పోల్చుకొని స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం విశ్వ మాన వాత్మ పడుతున్న ఆరాటాన్ని తెలుసుకొనటానికి ఒక ప్రేరణ అయింది. పోరాటాలు అనివార్యమైన చోట వాటిని అణచివేసే అధికార హింసను ఎప్పటికప్పుడు అపహాస్యం చేస్తూ రూపొందే ప్రజాయుద్ధ పంథాలను, వ్యూహాలను గొప్ప గౌరవంతో చిత్రించిన బషాయిటుడు లను మట్టుపెట్ట లేని పోలీసు అధికార నిస్సహాయ క్రోధం వాళ్ళకు సంబంధించిన స్త్రీల మీద అత్యంత పాశవికమైన లైంగిక దాడిగా మారినప్పుడు ఆ స్త్రీలు ఇక పోయేదేమీ లేదని తెలిసి తమ శరీరాన్నే ధిక్కార ఆయుధంగా గురిచూస్తే అదెంత భీభత్సావాహంగా ఉంటుందో ద్రౌపది కథలో చూపింది శ్వేతాదేవి. 'ఎంతకాలం ఆకలి, దరిద్రం, ధనవంతుల భూస్వాముల బహిరంగ దోపిడీ, ప్రభుత్వ యంత్రంగాల పీడన ఉంటాయో అంతకాలం నేను అవే విషయాలు రాస్తుంటాను'- అంటారామె. సమకాలీన సంక్లిష్ట జీవన పోరాట సందర్భాలకు స్పందించి రాయక పోతే వాళ్ళసలు రచయితలు ఎలా అవుతారన్నది ఆమె ప్రశ్న.

వ్యవసాయ కూలీల కనీసవేతన చట్టాన్ని చేయటంలో, అమలు పరచటంలో ప్రభుత్వాల అలసత్వాన్ని, నిర్లక్ష్యాన్ని కేంద్రంగా చేసి రాసిన బషాయిటుడు నవల ఒక వైపు సమకాలీన ప్రభుత్వ విధానాలపైనా, పని తీరు పైనా తీవ్రమైన అభిశంస. మరొక వైపు విప్లవ అనివార్యతను నొక్కి చెప్పింది. నక్సల్బరీతో తాను పూర్తిగా ఏకీభవించక పోయినా నక్సల్బరి దారికి సమాన న్యాయం గమ్యంగా ఉంది కనుక ఆమేరకు దానిని ఆమోదించింది. కనుకనే పార్టీ నిర్మాణంతో నిమిత్తం లేకుండా ఒక మిస్టిక్ వాతావరణంలో అద్భుత శిల్పాభిరామంగా బషాయిటుడు నవలరాసింది మహాశ్వేతాదేవి.

'నా రచనలన్నింటిలో నేను కింది స్థాయి దృష్టి కోణాన్ని పరిచయం చేసే ప్రయత్నం చేసాను'- అంటుంది మహాశ్వేతాదేవి. అందువల్లనే జంతువుల చర్మం వలవటం, శవాలను పాతిపెట్టటం వంటి భిన్న జీవన వృత్తులలో వున్న అట్టడుగు కులాలవారి జీవన సంవేదనలకు విత్తనాలు, మంత్రగత్తె వంటి కథలలో ఆమె స్వరం ఇచ్చింది. పీడితులలోకెల్ల పీడితులైన స్త్రీల జీవిత పార్శ్వాలు అనేకం ఆమె సాహిత్యంలో కనబడతాయి. పేద, దళిత వర్గ స్త్రీ ఆర్థిక లైంగిక సమస్యల నుండి ఉన్నత వర్గ స్త్రీల జీవితంలోని ఒంటరి తనాన్ని, బోలుతనాన్ని ఊపిరి ఆడనియ్యని వాతావరణాన్ని, కనిపించని హింసను, ఆత్మగౌరవ హననాన్ని చూపించటంవరకు మహాశ్వేతాదేవి సాహిత్యం స్త్రీల జీవితంలోని వైవిధ్యాన్ని, వైరుధ్యాన్ని ఏకకాలంలో ప్రదర్శించ గలిగింది. నక్సల్బరీ మార్గంలో నడచి మరణించిన పిల్లల గురించిన దుఃఖం తల్లులుగా స్త్రీలందరిదీ ఒకటే అయినా వర్గాన్ని బట్టి ఆ మరణాల ప్రభావాలు, పరిణామాలు ఆ తల్లులను విడదీస్తాయని ఒక తల్లి కథాక్రమంలోని రూపించిన తీరు ఆమె నిశిత దృష్టిని పట్టిస్తుంది.

మహాశ్వేతాదేవి చరిత్రను, పురాణేతిహాస గాథలను తన కథల సందర్భాలను వ్యాఖ్యానించటానికి ఉపయోగించుకొన్న తీరు ఆసక్తికరంగా ఉంటుంది. బాధితుల పట్ల బాధ్యతను, జీవితంపట్ల ప్రేమను, పోరాటాల పట్ల గౌరవాన్ని పెంచే సాహిత్యం మహాశ్వేతాదేవిది. అందువల్లనే 2016 జులై 28న మరణించేనాటికి తొంభయ్యవ పడిలో ఉన్నా ఆమె నిత్యచలన శీలత వలన నవయవ్వని. సమధర్మ సమాజ ఆకాంక్ష పరిపూర్ణం అయ్యేవరకు ఆమె బషాయిటుడు లాగా పునరుజ్జీవిస్తూనే ఉంటుంది. ●

## చదవదగ్గ పుస్తకం

# సాహిత్య బాటసారి శారద




తమిళనాడు పుదుక్కొట్టై నుండి ఆంధ్రా పారిస్ తెనాలికి వచ్చి బతుకు తెరువు కోసం హోటల్ కార్మికుడిగా చేరి, తెలుగుభాష మీది అభిమానంతో తెలుగును నేర్చుకుని తెలుగులో 'శారద' పేరుతో గొప్ప కథలు, నవలలు రాసిన ఎస్.నటరాజన్ జీవితంలోని అంతరంగ విషాదాల్ని ఆవిష్కరించిన గొప్ప రచన ఆలూరి భుజంగరావు 1985లో వెలువరించిన 'సాహిత్య బాటసారి-శారద-స్మృతి శకలాలు' గ్రంథం - వెంటాడే అనారోగ్యం-హోటల్ ఉద్యోగం పోయినప్పుడు బస్టాండ్‌లో గారెలు అమ్ముకుంటు చదువుకోడానికీ దీపంలో కిరసనాయిల్, రాయడానికి తెల్ల కాగితాలు కొనలేని కటిక పేదరికం అనుభవిస్తూ కూడా శారద తెలుగు సాహిత్యంలో తన రచనలు ద్వారా వెలుగు నింపాడు. 'శవంవిలువ' వంటి కథలు, 'మంచీ-చెడు' వంటి నవలలు శారదను గొప్ప రచయితగా నిలిపాయి. 'ప్రజావాణి' రాత పత్రిక నిర్వహణ, ఆంధ్ర అభ్యుదయ రచయిత సంఘంలో పాత్ర, రచయితలు తమ రచనలకు సరైన పారితోషికం పొందడం హక్కు అని నినదించిన సాహిత్య కార్మికుడు శారద. ఈ పుస్తకంలో నుండి తెలుగు స్వతంత్రకు *1949*లో శారద రాసిన ఉత్తరం. ఈ పుస్తకం ఇటీవల 30 ఏళ్ల తర్వాత పునర్ముద్రణ పొంది అందుబాటులో ఉంది. *(మీరు చదివిన మంచిపుస్తకం, ప్రక్రియ ఏదైనా సరే సంక్షిప్తంగా రాసి కవిసంధ్యకు పంపండి - సంపాదకుడు)*

### నాదైన సమస్యలు

నాకు అనిపిస్తుంది అప్పుడప్పుడు, ఈ చాకిరీచేస్తూ ఇట్లా ఆలోచనలుచేస్తే తొరగా చచ్చిపోతానని, కానీ హోటల్ చాకిరీ తప్పదు. చాకిరీకి తగినంత ఫలితమూ దక్కదు. పోనీ ఈ కథలు వ్రాయటం మానేద్దామా అనుకుంటాను. అదీ సాధ్యం కావటం లేదు. తెలుగు మాతృభాష కాకపోటంవల్ల ఎంతో చదివితే గాని, రచనావ్యాసంగం సవ్యంగా సాగదు. అట్లా చదివేందుకు పుస్తకాలుకొనే ఓపికలేదు. ఏ పుణ్యాత్ముడన్నా ఇస్తాడనుకుందాం. కోరిక గుర్రం కొమ్ములుగా ఉంది. ఇటీవల హోటల్ పని వాళ్ళకి తెనాలిలో ఎనిమిదిగంటల పని వచ్చిందన్నారు. ఏదారిన వచ్చిందో తెలియదుగానీ, నాతో సహా నూటికి తొంభై అయిదు మందిమీ పది పన్నెండు గంటల ఎద్దు చాకిరీ చేస్తూనే వున్నాం. ఈ లక్షణంలో చదువెక్కడ, రాత ఎక్కడ? ప్రభుత్వం శాసనాలు చెయ్యటం కనిపిస్తుందిగానీ, అవి అమలుజరగటం కనిపించదు. పేరుకు లేబర్ ఆఫీసువుంది. ఓ లేబర్ ఆఫీసరూ ఉన్నాడు.

హోటల్ సర్వరుకి చదువెందుకూ అనే పెద్దమనుషులు చాలమంది ఎదురుపడ్డారు నాకు. సరైన గుడ్డలు నేను పుట్టింతర్వాత తొడిగి ఎరగను. ఈ హోటల్ పనికి గ్యారంటీ ఏమీలేదు. ఇప్పటికి పాతికసార్లకి పైగా ఈ ఉద్యోగం ఊడిపోవటం, రోజుల తరబడి పస్తులుండటం జరిగింది. ఇక ముందు కూడా నా జీవితం ఇలానే ఉండబోతుందనడంలో సంశయమే లేనప్పుడు మిగిలి ఉన్న జీవితకాలం ఎలా గడవబోతుందా అని తగని భయమేస్తోంది. స్వతంత్రం వొచ్చాక ఇట్లా ఉండదనుకున్నాను. కనీసం నా జీవిత ప్రయాణం వెనకటికన్నా నూటికి ఇరవై పాళ్ళన్నా పెరుగుతుందనుకున్నాను. పత్రికలవారు కథలు వ్రాస్తే ఇచ్చే డబ్బులు నా మూర్ఛలరోగాన్ని నయం చేసుకోడాని కన్నా సరిపోతయ్యేమో అని సంతోషించాను. అదీ వట్టిదై పోయింది. ఈ పద్ధతిలో నేను స్వతంత్ర భారత పౌరుణ్ణని భావించ లేకపోవటంతో తప్పేమీ లేదనుకుంటాను.

"తెలుగు స్వతంత్ర" - శుక్రవారం, ఫిబ్రవరి -18,1949. ఎస్. నటరాజన్ 'శారద'

యానాం కవితోత్సవ సందర్భంగా..

# యానాంలో చిలక్కొయ్య కోసం కవి పండితుల సమావేశం

అచ్చుకాని చివరి చేరాత



**1994లో యానాంలో జరిగిన శిఖామణి చిలక్కొయ్య ఆవిష్కరణ సభకు హాజరైన చేరా దాని గురించి చేరాతల్లో రాయగా, దానిని అచ్చువేయడానికి అప్పటి ఆదివారం ఆంధ్రజ్యోతి సంపాదకులు త్రిపురనేని శ్రీనివాస్ నిరాకరించారు. సంపాదకులు నండూరి రామ్మోహన్ రావుగారు చెప్పినా వినలేదు. దానితో చేరా తన చేరాతలను ఆపివేసారు. ఆ రకంగా ఇది చివరి చేరాత. ఆ ముగ్గురూ ఇప్పుడులేరు. వారికి కవిసంధ్య సాహిత్యాంజలి. - సం.**

అన్ని దారులూ రోమ్ నగరం వైపుకే పోతాయి అనే అర్థంవచ్చే ఇంగ్లీషునానుడి ఒకటుంది. రోమ్ నాగరికత అత్యున్నత దశలో ఉండగా ఈ నానుడి యూరప్‌లో పుట్టి ఉంటుంది. ఆల్ రోడ్స్ లీడ్ టు రోమ్ అనేది ఆ నానుడి. 1994 ఫిబ్రవరి 20వ తేదీ ఆదివారంనాడు ఆంధ్రదేశంలోని అన్ని దారులూ యానాం వైపే వెళ్తున్నట్లుగా అనిపించింది. తెల్లవారుజామున మూడున్నర గంటలకు 'శిఖామణి' అనే పేరుతో కవిగా పేరు తెచ్చుకున్న కర్రి సంజీవరావుకూ కృష్ణవేణికీ పెళ్లి ముహూర్తం ఏర్పాటయింది. ఎంతోమంది ఆ ముహూర్తానికి పెళ్లి చేసుకొని ఉంటారు. ఇది విశేషంకాదు.. అయినా అన్ని దారులూ ఆరోజు యానాంకే ఎందుకు పోవాలి?

'శిఖామణి' మంత్రికాదు, పెద్దకులంలో కాదుగదా మధ్య కులంలోనూ పుట్టలేదు. పెద్ద ఉద్యోగంలోనూలేడు. తెలుగులో పిహెచ్.డి. చేశాడు గాని ఈ రోజుల్లో డాక్టరేటు డిగ్రీని అంత పెద్దచదువుగా పరిగణిస్తున్నారనుకోను. భూస్వామి కాదు, పెట్టుబడిదారూ కాదు. బడాబడా పారిశ్రామికవేత్తా కాదు. తెలుగు విశ్వవిద్యాలయం వారి రాజమండ్రి సాహిత్యపీఠంలో ఒక సామాన్యమైన లెక్చరరు. అతనికి ఉపన్యాసకుడు (ఆరేటర్)గా అంత పేరున్నట్టులేదు. పండితుడుగా ఏమంత గుర్తింపు లేదు. అయితే కవిగా చాలా పెద్ద పేరుంది. ఏక్షణాన ఆయన గురువు అత్తలూరి నరసింహారావు ఆయన్ని డిస్కవర్ చేశారో అప్పటి నుంచీ కవిగా అద్భుతమైన గుర్తింపు వచ్చింది. 'ప్రైజు ఫైటర్'గా కూడా ప్రసిద్ధి వచ్చింది. అవార్డులు పొందిన వారంతా గొప్ప కవులు కానక్కర్లేదు. అవార్డులు రానివాళ్లంతా పనికిమాలిన వాళ్లూకాదు. కాని వీటితో నిమిత్తం లేకుండానే 'శిఖామణి' ఉత్తమ కవిగా గుర్తింపు పొందాడు. 'శిఖామణి' మొదటి సంపుటం 'మువ్వల చేతికర్ర' నుంచి అభిమాన ఆధునిక కవయ్యాడు.

'శిఖామణి' చేసిన చమత్కారం ఏమిటంటే తన పెళ్లి సందర్భంగా తన లేటెస్ట్ కవితాసంపుటి 'చిలక్కొయ్య' ఆవిష్కరణ పెట్టుకున్నాడు. ఆంధ్రదేశంలో తానెరిగిన (చాలామందినే ఎరుగును) కవి పండితులనందరినీ పెళ్లికి అనకుండా, ఆ సందర్భంగా జరిగే పుస్తకావిష్కరణకు రమ్మన్నాడు. వచ్చినవాళ్లు ఆ వెంటనే జరిగే పెళ్లికి ఉండకుండా వెళ్లరుకదా! ఆషామాషీగాకాక ఆదరంగా, ఆప్యాయంగా ఆహ్వానించాడు. సాహిత్య సహృదయులు రసార్ద్ర హృదయులు మాత్రమే కాక ప్రేమార్ద్ర హృదయులు కనక ఏమన్నా అవకాశం ఉన్నా,- లేకపోయినా కల్పించుకొని మరీవెళ్లారు. రాజమండ్రి నుంచి తె.వి.వి. సాహిత్యపీఠమే తరలివెళ్లింది. పీఠాధిపతి ఆచార్య సి.రమణయ్య, కొత్తగోదావరి ఫేమ్ ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, పుష్కలంగా వచ్చిపడుతున్న పురస్కారాలను అందుకోటానికి రెండు చేతులూ చాలని వర్తమాన కవి ఎండ్లూరి సుధాకర్. ప్రాచీన సాహిత్యాన్ని పుడిసిటపట్టిన అగస్త్యుడు నాగార్జునశ్రీ, సాహిత్యపీఠం గ్రంథాలయ అభివృద్ధికోసం ఒక సందర్భంలో అప్పటి భాషా పీఠాధ్యక్షుడితో (అంటే

నాతోనే) ఘర్షణ పడటానికి సందేహించని గ్రంథాలయాధికారిణి తారాబాయి (ఆమెకు తనవృత్తిపై అంతటి ప్రేమ), తె.వి.వి. ఉపాధ్యక్షులు ఆచార్య పేర్వారం జగన్నాథంగారితో సహా తరలివెళ్లారు. వాళ్లతోపాటు "మీ గడపముందుకే ఉన్నత విద్యవస్తున్నదహో' అంటూ అంబేద్కరు సార్వత్రికాచార్యుడు కేతు విశ్వనాథరెడ్డి సకుటుంబంగా వెళ్ళాడు. తానే కవి అయికూడా పురస్కారాలను ఆశించకుండా తానే పురస్కారాలను అందిస్తున్న దాత జి.బి.వి., గరికపాటి పురస్కార ప్రదాతకూడా రాజమండ్రి నుంచి వచ్చాడు. తులనాత్మక సాహిత్య పరిశోధకురాలు మృణాళిని, లెక్చరర్ సుజాతలు వచ్చారు. హైదరాబాదునుంచి శివకవి శివసేనతో సహా వచ్చాడు. సభాధ్యక్షత వహించటానికి చిత్రదీపాల వంతెన గోపి వచ్చారు. ప్రసంగించటానికి ఆరని అంతర్జ్వాల, గోదావరి ప్రతిబింబం, మినీ కవితా సిద్ధాంత ప్రవక్త అద్దేపల్లి వచ్చాడు. సభాస్థలిలో మౌనంగా నడయాడే కుండీలో మర్రిచెట్టులాగా కనిపించాడు విన్నకోట రవిశంకర్, ఆవిష్కరణ సభలకు బెదిరి, బెంబేలు పడి, బేజారెత్తి బాబోయ్ ఆవిష్కరణ సభలని బజారునపడ్డ చేరాకూడా తన ఫోబియాలనుంచి తేరుకొని తన నిత్యాకర్షణ విశాఖ మీదుగా యానాంకి చేరుకోకా తప్పలేదు, వేదిక ఎక్కకా తప్పలేదు. మానవమాత్రులకు రాగబంధాలు తప్పవనుకుంటాను. శిఖామణి విసిరిన ప్రేమజాలం (వలపువల) అట్లాంటిది.

యానాంలో ఎక్సైజ్ డ్యూటీలు తక్కువట! ఆంధ్ర ముఖ్యమంత్రులు రెవెన్యూ పెంచుకోటంకోసం ఒకటి రెండు వస్తువులపై ఎప్పుడో దృష్టి సారించారు. ఆ దృష్టిదోషం యానాంలో తగలలేదు. అందుకు తృపించిన ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు దైవాన్ని అనుష్టుప్పులో అభినందించారు.



**1994లో 'చిలక్కొయ్య'ను ఆవిష్కరిస్తున్న పేర్వారం జగన్నాథం. శిఖామణి, అద్దేపల్లి, చేరా, గోపి, శివారెడ్డి, కొత్తపల్లి, బేతవోలు.**

యానానందమయం దేవం / నిర్మ లోద్ధుటకాకృతిమ్ / ఆధారం కావ్య విద్యానాం / వైనతేయముపాస్మహే.

నాలుగో పాదానికి పాఠాంతరం: వైనుతోయముపాస్మహే, "ఎవ్వరేమన్న చింత నా కేల" అంటూ చితీ చింతను చల్లార్చుకోటాని కేమో అన్నట్టుగా రహస్తంత్రి మీటుకుంటూ ఈ సారి సంస్కృతంలో పునరపి (తెలుగులో, ఇంకా, ఇంకా) అని పాడుకుంటూ వేగుంట మోహన్ ప్రసాదు వచ్చాడు. తానీమధ్యన నేర్చిన కవితానిర్మాణ రహస్యాలతో చిలక్కొయ్యను సింగారించిన సీతారాం, ఖమ్మం కవిత్రయమధ్యముడు ప్రసేన్‌తో కలిసి దిగాడు. వాళ్లతోపాటు తిరుగుతూ బహుత్ ఖూబ్ యాకూబ్ కనిపించాడు. కన్నడ కస్తూరి వాసనలు గుబాళిస్తూ బెంగుళూరు నుంచి తంగిరాలాచార్యుడు వచ్చాడు. ఇట్లా ఎందరెందరో నేనెరిగిన వాళ్లు, ఎరగని వాళ్లూ కవులూ రచయితలూ కనువిందుగా, విన పడేందుగా ఛలోక్తులు విసురుకుంటూ, చిరునవ్వులు చిలకరిస్తూ సభాస్థలిని విహరిస్తుంటే నిర్వాహకులు సాయంకాలం నాలుగ్గంటలకు మొదలుపెట్టాల్సిన సభ విషయం మరిచి పోయినట్లున్నారు. హఠాత్తుగా గుర్తొచ్చిందో ఏమో ఏడు గంటలకు హడావుడిగా ప్రారంభించారు. దండలూ, పరిచయాలు, వగైరాలు షరామామూలే. ఈ సభ ఆలస్యం కావటంవల్ల తరవాత ఆవంత్స సోమసుందర్‌గారి అధ్యక్షతన జరగాల్సిన కవిసమ్మేళనం రాత్రి తొమ్మిది గంటలకు ప్రారంభం అయి పాశ్చాత్య పద్ధతిలో తేదీ మార్చుకొని ఒంటిగంటవరకూ జరిగింది. అధ్యక్షులవారి

ఓపికను దారుణంగా పరీక్షించింది. ప్రసిద్ధ కవులతో పాటు యానాం కవులు కూడా గణనీయసంఖ్యలో కవితా పఠనం చేశారు.

అప్పుడెప్పుడో బెజవాడ గోపాల్‌రెడ్డి గారు మద్రాసు ప్రభుత్వంలో మంత్రిగా ఉన్నప్పుడు 1937లో జరిగిన ఆయన పెళ్లికి అట్లాగే కవిపండితులు చాలామంది వెళ్లారు. ఆయనకు కావ్యాక్షతలు చల్లిన వారిలో శివశంకర శాస్త్రి, విశ్వనాధ సత్యనారాయణ, అడివి బాపిరాజు, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి ఉన్నారట! ఆ సందర్భంగా చదివిన శ్రీశ్రీ మార్కు గేయం చూడండి (కె.వి. రమణారెడ్డి, శ్రీశ్రీ సాహిత్యం ఒకటి. 1970)

విభాతవేళా శుభానిలంలో / పికాంగనా శ్రావ్యకూజితంలో / అమాత్యమణి నీ వివాహమని ఈ / సమస్త లోకం పలికింది. / వసుంధరా హర్షణ సుందరాస్యం / వసంత హాసం నిరిసింది / దిశాంత దివిష న్నిశాంతములహ్హ / దృశాంతి గానం కురిసింది. / అమాత్యమణి నీ వివాహమని ఈ / సమస్తలోకం చాటింది.

అర్థ శతాబ్దం పై. చిలుకు తరవాత జరిగిన అన్నిప్రాంతాలనుంచి కవులను రచయితలను ఆకర్షించిన సాహిత్యకుల అపూరూప సమావేశంగా అభివర్ణించారు.

శిఖామణిని అమితంగా ప్రేమించే దాట్ల దేవదానంరాజు గారు షడ్రసోపేతంగా త్రివిధ జలపుష్పసమన్వితంగా విందు ఏర్పాటు చేశారు. శిఖామణిని పుత్ర వాత్సల్యంతో పెంచిన కందర్ప వెంకట నరసమ్మగారు తమ పుత్రోత్సాహాన్ని సభాముఖంగా ప్రకటిస్తుంటే శ్రోతలకళ్లు చెమ్మగిల్లినాయి. శిఖామణి ఆర్ద్ర హృదయుడు, కవితార్ద్ర హృదయుడూ కావటానికి ఉన్న నేపథ్యం లీలా మాత్రంగా గోచరించింది.

యానాం రావలసిన వాళ్లలో సి.నా.రె. పనుల వత్తిడితో ఆగి పోయారు. చెట్టు ఇస్మాయిల్‌గారిని అంతకు ముందురోజే కె.సదాశివరావుగారు విశాఖపట్నానికి కిడ్నాప్ చేసుకుపోయారట. తూనీగ స్మైల్ కూడా రావల్సినవాడే మరి. ఇట్లా దారితప్పిన బాటసారులుకూడా కొందరు లేకపోలేదు.

ఇంతటి సమావేశానికి సందర్భమైన చిలక్కొయ్యను గురించి కొద్దిగా అయినా చెప్పుకోవాలి. 'మువ్వల చేతికర్ర'తో కవిగా రంగ ప్రవేశం చేసిన తరువాత రాసిన పరిణత కవిత్వం చిలక్కొయ్యలో ఉంది. ఈ పరిణత కవిత్వాన్ని తన్ను డిస్కవర్ చేసిన అత్తలూరికి అంకితమియ్యటం అందరూ హర్షించారు. అత్తలూరికి నచ్చక పోయినా పాపం ఆయన కది తప్పలేదు.

'మువ్వల చేతికర్ర' లో కవిత్వపు మెరుపులున్నాయి. చిలక్కొయ్యలో అంతా మెరిసే కవిత్వమే. విపుల వ్యాఖ్యానం అవసరం లేని శిఖామణి కవిత్వం అందరూ స్వయంగా చదివి అనుభవించగలరు గనక వ్యాఖ్యాన ప్రలోభాన్ని అణచివేస్తున్నాను.

ఎన్నో భావాలను వ్యక్తం చెయ్యగల కాళ్ల ముఖ చిత్రంతో ముచ్చటైన కాయితంమీద ఆఫ్‌సెట్‌లో అచ్చయిన చిలక్కొయ్య తొంభై పేజీలతో ఇరవై రూపాయలకే దొరుకుతుంది. కవిత్వం కొని చదివేవారికి, అందుబాటులో ఉండే ధరే, కొనలేని వారికి (కొనదల్చుకోనివారికి) కవులు పాపం కాపీలు అందిస్తూనే వుంటారుగా!

ఇంత అపూర్వ కవి పండితుల సమావేశాన్ని యానాంలో ఏర్పాటు చేసి తన ఊరికి మరో చరిత్రనందించిన శిఖామణిని యానాం శాశ్వతంగా గుర్తుంచుకుంటుంది. కవి పండితలోకం చిరకాలం స్మరిస్తుంది.

*('మనచేరా' చేరా అభినందన సంచిక 2003 నుండి)*

నివాళి

# దళితుల జీవన సారం: దేవపుత్ర సాహిత్యం



(1951-2016)

ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, 94400222117

రాయలసీమ నుంచి కల్పనా సాహిత్య రచయితలలో దేవపుత్ర మూడవ తరం రచయిత. ఆయన 1977 నుంచి నేటి దాకా 100కి పైగా కథానికలు, నాలుగు నవలలు రచించారు. అన్నీ సమకాలీన సామాజిక వాస్తవికతను మార్క్సియ, దళిత బహుజన దృక్పథం నుంచి రాసినవే. 1977 అక్టోబరులో 'మానవత్వం' కథతో మొదలైన దేవపుత్ర సాహిత్య జీవితం నింపాదిగా, నిలకడగా నాలుగు దశాబ్దాలు కొనసాగింది.

'అద్దంలో చందమామ' నవల బూర్జువా పాలకుల భూసంస్కరణలు దళితుల జీవితాలతో చెలగాటమాడిన తీరును ఆవిష్కరించింది. అధికారం పోయినా ఆధిపత్యం పోని రెడ్డి, కరణాల దళారీ వ్యవస్థను ఆవిష్కరించింది. 'పంచమం' తెలుగు దళిత నవలా సాహిత్యానికి రాయలసీమ అందించిన గొప్ప కానుక. సమాజం అవకాశం కల్పిస్తే దళితులు కూడా తమ ప్రతిభను చాటుకోగలరని, దళితులు ప్రేమ హృదయులని ఆ నవలలో చాటి చెప్పారు దేవపుత్ర. 'కక్షశిల' రాయలసీమలోని ముఠాకక్షలు ఆధిపత్య స్థాయి దాటి అధికార స్థాయికి చేరుకొని బలహీనవర్గాల ప్రజలను బలిగొంటున్న వాస్తవాన్ని విశ్వసనీయంగా ఆవిష్కరించిన నవల. 'చీకటి పూలు' బాల నేరస్థులను సంస్కరించి ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దవలసిన జువెనైల్ పాఠశాలలు అక్కడ ఉద్యోగుల అవినీతి వల్ల అసలు లక్ష్యం నీరుగారిపోతున్న వైనాన్ని చాటుతుంది. ఇలాంటి వస్తువు మీద ఇదొక్కటే నవల వచ్చిందేమో. దేవపుత్ర ఆ శాఖలో పనిచేసిన అనుభవంతో రాసిన 'చీకటి పూలు'.

దేవపుత్ర కథలలో దళితుల జీవన వేదన, కరువు, ఫ్యాక్షనిజం, సమాజంలో ఇంకా మిగిలి ఉన్న మంచి, లంచగొండితనం వంటి వర్తమాన భారతీయ సమాజంలోని అనేక వాస్తవికతలు వస్తువులయ్యాయి. మంచి చెడు రెండూ కలగలసి ఉండడమే సాహిత్యంలో వాస్తవిక పద్ధతి అన్న కట్టమంచి రామలింగారెడ్డి సిద్ధాంతానికి అనుగుణంగా ఉంటాయి దేవపుత్ర కథలు.

'సమిధలు', 'ఆయుధం', 'ఊడలమర్రి', 'విలోమం' వంటివి దేవపుత్ర రచించిన గొప్ప దళిత కథలు. అగ్రకుల సంపన్నుల రాజకీయ సరదాలలో దళితులు పడి అవసరానికి మించి ప్రభు భక్తిని ప్రకటించి ప్రాణాలు కోల్పోయే దలితుల అజ్ఞానాన్ని 'ఆయుధం' ఆవిష్కరించింది. దళితులకు పంచాయతీ ఎన్నికలలో రిజర్వేషన్ అమలయిన తొలి రోజుల్లో కొత్తగా సర్పంచులయిన భూస్వాముల దగ్గర దళిత కూలీల పాట్లను 'ఊడలమర్రి' ఆవిష్కరించగా, దళిత విద్యావంతులకు రాజ్యాంగం కల్పించిన రిజర్వేషన్లను చూసి, దళితులను ద్వేషిస్తూనే, అగ్రకులాల వాళ్ళు పెళ్ళి సంబంధాలకు ఎలా సిద్ధమౌతారో ప్రదర్శించింది 'విలోమం'.

రిజర్వేషన్‌లో ఉద్యోగం పొందిన దళిత అమ్మాయిని పెళ్ళాడదానికి అగ్రకులం అబ్బాయిని చిత్రించిన దేవపుత్ర (విలోమం) 'తోక తెగిన ఎలుక' కథలో నారాయణరావు అనే బ్రాహ్మణుడు దళిత

అమ్మాయిని పెళ్ళాడి ఆమె అలవాట్లను ఏమాత్రం అభ్యంతర పెట్టని తీరును కూడా చిత్రించారు. సమాజాన్ని సాపేక్షంగా పరిశీలించడంలో విశ్లేషించడంలో చేయితిరిగిన రచయిత దేవపుత్ర.

'మన్నుదిన్న మనిషి'లో మట్టికి రైతుకు ఉండే పేగుబంధాన్ని ఆర్ద్రంగా చిత్రించిన దేవపుత్ర, 'ముంపు' కథలో లేని నష్టాన్ని చూపించి ప్రజాధనాన్ని కొల్లగొట్టే గ్రామీణుల్ని కూడా చిత్రించారు. మన సమాజ నాణెంలోని బొమ్మాబొరుసూ రెండూ కలిసిన రచయిత దేవపుత్ర.




దేవపుత్ర స్వచ్ఛమైన లౌకిక-సెక్యులర్-వాది. లౌక్యవాది కాదు. ఆయన ఆదర్శం సెక్యులర్ సమాజం. 'కుల మతాలు గీచుకున్న గీతలు జొచ్చి పంజరాన కట్టువడను నేను' అన్న జాషువా మాటను జీవితంలో ఆచరించిన రచయిత దేవపుత్ర.

దేవపుత్ర తొలి కథ 'మానవత్వం' చదివితే పాఠకులు చలించిపోతారు. దిక్కులేని గర్భవతి ప్రసవిస్తుంటే ఏ స్త్రీ కూడా దగ్గరకు రాకుంటే, ఒక ముసలాయన కొడవలి తీసుకుని ప్రసవం చేయడానికి వెళ్ళే ఈ కథ మానవత్వానికి గొప్ప నిర్వచనం. గోర్కీ రాసిన 'మానవత్వం' కథ చదవకుండానే ఈ కథ రాశారు దేవపుత్ర. 1947 ఆగస్టులో దేవవిభజన నాటి మానవ సంబంధాలను దేవపుత్ర 'అవిభాజ్యం' కథలో ఇటీవల రాయటం విశేషం.

దేవపుత్ర హాస్య కథలు రాయటంలో కొంత సాధన చేసిన 'వంకర టింకర ఓ', 'పరిశోధన', 'మంత్రి పదవి' మొదలైన కథలు రాశారు. ఈయన కథలు 'ఆరు గ్లాసులు', 'ఏకాకి నౌక చప్పుడు', 'వంకర టింకర ఓ', 'బందీ', 'చివరి మనుషులు' సంపుటాలుగా వచ్చాయి. అన్నీ కలిసి రెండు సంపుటాలుగా ఇటీవలే ప్రచురించారు వత్సల గారు. ఆయన నవలలూ, కథలూ విశ్వవిద్యాలయాలలో పరిశోధనాంశాలూ, పాఠ్యాంశాలు అయ్యాయి. ఆయనకు పురస్కారాలు వచ్చాయి. 'పంచమం' దేవపుత్ర మాస్టర్ పీస్.

దేవపుత్ర రచన ప్రారంభించే నాటికి మార్క్సిజం ఆయనకు తాత్విక సిద్ధాంతమైంది. ఆ తర్వాత అంబేద్కరిజం పరిచయమై ఆయన రెండింటిని సమన్వయం చేసుకున్నారు. మన సమాజాన్ని, మానవీయమూ చేయడమే దేవపుత్ర రచనా లక్ష్యం. తనను తానే కాపీకొట్టుకొనే దౌర్భాగ్యానికి పాల్పడని కొద్దిమంది రచయితలలో దేవపుత్ర ఒకరు. 'పునరుక్తి దోషంబు పొంతబోక' అన్న పింగళి సూరన సూక్తికి మంచి ఉదాహరణ దేవపుత్ర. ఆయన ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం కార్యవర్గ సభ్యులు. ఆయన హఠాన్మరణానికి అశ్రు నివాళి.

డా॥ సి. మృణాళిని కవితపై స్పందన

# శాంతం శరణం గచ్ఛామి

ప్రొఫెసర్ మాదిరాజు రంగారావు,040-23398899

కవి సంధ్య ఆగస్టు-సెప్టెంబర్ సంచిక-3లో ప్రకటితమైన డా॥ సి. మృణాళిని కవిత "శాంతం శరణం గచ్ఛామి" మానసికమైన శాంతి లక్ష్యంగా ఉంది. వ్యక్తి అనుభూతి ఆధారంగా తాత్త్వికమైన ప్రకాశ రేఖలతో సాధారణీకృతమైంది, సార్వజనీనమూ అయింది. ఈ కవితలో మనిషిలోని మానసికమైన విక్రియల పొంగుల్ని ఒక్కొక్కటి నెగేట్ చేస్తూ చివరకు పాజిటివ్‌గా జీవితానికి అవసరమనుకున్నది ఆవిష్కృతమైనది. ఇదొక క్రమంలో సాగింది. ఇది చిన్న కవిత. ఇంచుమించు ముప్పై పంక్తులు కలిగింది. ఉన్నంతలో సూటిగా సులభంగా నిరాడంబరమైన అభివ్యక్తి విధాన్ని పొందింది.

ఈ కవితలో విలక్షణత - (1) విషయానికి సంబంధించిన విభాగాలతో భావ రూపాల నిర్మాణం; (2) తాత్త్విక స్పర్శతో జీవన వాస్తవం - అవసరమైన నిజ స్థితి; (3) వ్యక్తి స్థాయిలో అనుభూతి గుణం నుండి సాధారణీకరణానికి చేరిన ముగింపు; (4) ఆరు విక్రియల మానసిక ప్రకారాలకు సంబంధించిన భావ రూపాలుతో కవితా రూపాన్ని పొందింది. ఈ నాలుగు అంశాల సాహిత్య విమర్శలో పుష్టిని చేకూర్చేవిగా భావిస్తాను. ఇక మనోవైజ్ఞానిక క్షేత్రంలో ప్రసక్తమయ్యే (1) వేదన (2) రోదన (3) అసూయ (4) కోపం (5) భయం (6) ద్వేషం అందరిలో అంతో ఇంతో చోటు చేసుకునేవే.

ఈ కవిత విషయంలో ఈ ఆరు మనో విక్రయలు చివరకు శాంతంతో కలిసి వివేచనకు గురి చేస్తాయి. ఒక దానిని అంది పుచ్చుకొని మరొకటి ముందుకు సాగడం జరిగింది. ఒక పరంపరా (కంటిన్యువస్) రూపాన్ని పొందడమూ నిర్మాణ విధానాన్ని తలపిస్తుంది. (1) వేదనకు 'విసుగేసి' ఏడుపు, (2) దీనికి కన్నీళ్ళతో - అసూయ; (3) దీనికి ఆగ్రహంతో కోపం; (4) దీని భయంతో వణకు; (5) ఇది నలిగిపోయి ద్వేషం; (6) దీనికి దడ-దహించే ఈహ మొదలడం - చివరకు చూపుల చల్లని జల్లుతో 'శాంత' స్థితి చేరుకోవడం జరిగింది. ఇదీ ఇందులోని భావ పరంపరా క్రమం. ఈ భావ స్థితుల్ని కవితలో శబ్దాన్ని ఆశ్రయించి భావ రూపాల్ని అవతరింపజేయడం దీనిలో ప్రత్యేకత.

ఈ క్రమంలో (1) గుండె తలుపు తెరిచే "తాళం" దొరక్క పోవడం వేదనకు "ఏడుపు" వచ్చింది. (2) తర్వాత వేదనకు కన్నీళ్ళు! కళ్ళలో అడుగు పెట్టాలనుకుంటే రెప్పలు తెరవబడకపోవడం; (3) అసూయకు మనసులో ప్రవేశానికి "నిషేధం" అడ్డురావడం; (4) కోపానికి నాలుకను చేర లేకపోవడం - పెదవుల వద్ద ఆగిపోవడం, మౌనం వల్ల కావచ్చు (ఇది అనుమీయమాన మవుతూంది); (5) భయంలో వణికించాలనీ కాళ్ళను తడబడ జేయాలనీ అనుకోవడం; (6) దీనికి భిన్నంగా కాళ్ళ క్రింద నలిగిపోవడం; (7) నిలువెల్ల దహించాలనుకోవడం చివరకు చల్లని చూపుల జల్లుతో ఆర్ద్రమై శాంతానికి అవకాశం లభించింది. ఈ భావ ప్రపంచంలో వేదన-విసుగు, ఏడుపు-కన్నీళ్ళు, అసూయ-ఆగ్రహం, వణకు-ద్వేషం, దహనానికి నాశనానికి దారి తీసే ప్రభావ రూపాలు మనస్తత్వ పరమైనవి. ఇవి భావరూపాల్లో సులభమైన అభివ్యక్తి విధంలో జాగ్రత్తగా హేండిల్ చేయడం జరిగింది.

దేనినీ "దగ్గరకు రానీయలేదు", మరి "నన్ను ఏలా రానిచ్చారు?" అని శాంతి ప్రశ్నిస్తుంది. "నీవు నా దగ్గరికి రాలేదు", నేను నిన్ను "వెతికి" ఇన్నాళ్ళకు పట్టుకున్నాను, అని సమాధానం. ఇది కవి నిర్ణయం. ముగింపు ఇందులో వ్యక్తి పాత్రకు మానసికమైన బలం చేకూరడమే కాక చివరగా మనిషికి తప్పని "శాంతం" అవసరాన్ని తలపిస్తుంది.

బాబ్ డిలాన్‌కు నోబెల్ పురస్కారం సందర్భంగా

# పాటల పల్లకిలో సాహిత్య నోబెల్

పరిచయం - అనువాదం: **రామతీర్థ**, 9849200385



**2**016లో సాహిత్య నోబెల్ ఒక కొత్త రాగం అందుకున్నది. అది పాటలు రాయడం, పాటలు పాడడం, వాటి ద్వారా సమాజంతో నిత్యం అనుబంధితమై ఉండడం అన్న అంశాలకు, అమెరికన్ సంగీత సంప్రదాయాలకు ఏకోన్ముఖమైన అయిదు దశాబ్దాల సేవకు గాను, పాలక వ్యవస్థా వ్యతిరేక స్వరంగా ప్రజా బాహుళ్యంలో పేరు, గుర్తింపు, అభిమానం గల బాబ్ డిలాన్‌కు సాహిత్య నోబెల్ ప్రకటించి అందరినీ విస్మయానికి గురి చేసింది. దీని విస్మయ కారకత ఎలా ఉన్నా 1960–1980ల మధ్య నాటి తీవ్ర శీతల యుద్ధ వాతావరణంలో అలాగే ఇంకా పూర్తిగా అమెరికా రాజ్యాంగాన్ని ఆమోదించని, దక్షిణ ప్రాంత అమెరికా లోని వర్ణ దురహంకార ధోరణుల పట్ల తన నిరసన ప్రజల తరపున నమోదు చేసిన వాడిగా బాబ్ డిలాన్, పౌర హక్కుల్లో శాంతి చాలా ముఖ్యమైనదని! ఆ జీవన శాంతికి భంగం కలిగించే శక్తుల పట్ల నిత్యం జాగరూకతతో ఉండాలని చెప్తూ తన గేయ కథలను రాసి, పాడి, అక్కడి సమాజపు చైతన్య స్వరంగా ఎదిగాడు.

ఆ పాటలు ఇతరులపై యుద్ధాన్ని, ప్రపంచంపై తమ ఆధిపత్యాన్ని, తమకు దేవుడిచ్చిన హక్కుగా అమెరికా పాలక వర్గాలు, ఆయుధ వ్యాపారులూ భావించడం వల్ల ఇరవై మూడేళ్ళకే తన పాటలతో ప్రతిఘటన తెలిపిన జన సమానత్వ ఆచరణ శీలి డిలాన్. ఇప్పుడు వీస్తున్న గాలి అని మనం ఇంకో సందర్భంలో అనడానికి ముందరే, ఏవి గాలిలో వీస్తున్నాయో, ప్రతిభాన్వితంగా మరో గీతంలో (బ్లోయింగ్ ఇన్ ద విండ్) సూచన చేశారు. రోజులు మారాయి, కాలం మారింది, "తొలినాటి సంద్రాలు, తుహిన గిరి శిఖరాలు కూలిపోతున్నాయిలే నా రాజ", అని మన పురిపండా అన్నట్టే, కాలం మారడం ఖాయం (టైమ్స్ ఆర్ ఛేంజింగ్) అనగలిగాడు కొన్ని దశాబ్దాల తర్వాత.

మన వివిధ కాలాల కవులు కట్టమంచి రామలింగారెడ్డి, గురజాడ, శ్రీశ్రీ, ఆరుద్ర,

సోమసుందర్, కుందుర్తి, శివసాగర్ వలె సమాజ దౌష్ట్యాలపై, మధ్యతరగతి ఊగిసలాటలపై గేయ కథలు, అగ్ర రాజ్యంలో పౌరుడై రచించి వాటిని పాటలుగా పాడాడు. "పాటంటే శివమెత్తిన నయాగరా, పాటంటే శివ లోకపు నగారా" అని కొనియాడాల్సిన కాలపు ప్రతిభావంతులైన ఎందరో అమెరికన్ జన సంగీతకర్తలలో జాన్ లెన్నన్, మైకేల్ జాక్సన్, బాబ్ మెర్ల్వీ, టీనా టర్నర్, లియొనెల్ రిచీ, బ్రూస్ స్ప్రింగ్ స్టీన్, తానూ ఒకడిగా ఆ రంగంలో ఉన్నతమైన ఎత్తులకు చేరుకున్నాడు. తన పాటలను జన ప్రయోజన రక్షా కవచంగా మలిచిన ఈ ప్రజాపక్ష కళాకారుడు పూర్తిగా సాహిత్య రంగపు రచనా పద్ధతులకు భిన్నమైన రచనా, ఆలాపన, ప్రదర్శన మాధ్యమాలను, తన అర్ధ దశాబ్ద పాలక వ్యతిరేక నిరసనలో భాగం చేసినందుకు గాను, ఈసారి నోబెల్, కొంత వివాదానికి తెర తీస్తూ కూడా ఈ గౌరవాన్ని ఆయనకు అందచేసింది. బహుశా ఇది బాబ్ డిలాన్ పట్ల ఎటువంటి విమర్శా కాకుండా, ఎన్నికల సంవత్సరంలో, ఒక రాజకీయ నోబెల్‌గా, డెమోక్రటిక్ రాజకీయాలను బలపరిచే చర్యగా కూడా భావించే అవకాశాలు ఉన్నాయి. ఆ దిశగా ఎవరూ మాట్లాడకపోవడం ప్రస్తుత దశ.

"వలయ విచలద్విహంగాలలో, విలయ సాగర తరంగాలలో, యుద్ధ గుంజన్మృదంగాలలో కవీ నీ పాటల్" అన్నాడు శ్రీశ్రీ, అది సరిగా సరిపోయే మన కాలపు సంచలనం బాబ్ డిలాన్. ఆయన వ్యక్తిత్వపు ఐంద్రజాలికతను ఈ బహుమతి మరింత పెంచింది అనేది నిజం. ఆ పాటలు చదవండి, తదుపరి వీలైతే వాటిని వినే ప్రయత్నం చేయండి.

## వీస్తోంది జవాబు

ఎన్ని దారులమ్మట నడవాలి మనిషి
మీరతన్ని మనిషని పిలవబోయే ముందర?
ఎన్ని సంద్రాలు తేలాడి రావాలి తెల్ల
పావురాయి
ఇసుకలో నిద్రకొరిగే ముందర?
అవునింకా ఎన్నిసార్లు ఎగరాలి ఫిరంగి గుళ్ళు
అవి శాశ్వత నిషేధానికి గురయ్యేలోపల?
జవాబు, మిత్రమా గాలిలో వీస్తోంది
గాలిలో వీస్తోంది జవాబు

అవునింకా ఎన్నేళ్ళుండాలి కొండ
కడలి దారి కొట్టుకుపోయే ముందర?
అవునింకా ఎన్నేళ్లు కడగండ్ల పాలవాలి జనాలు
వారు విముక్తమవడానికి ముందర?
అవునింకా ఎన్నిసార్లు తల తిప్పేసుకుంటాడు
మనిషి
తానేమీ చూడనట్టుగా ప్రవర్తిస్తూ?
జవాబు, మిత్రమా గాలిలో వీస్తోంది
గాలిలో వీస్తోంది జవాబు

అవునింకా ఎన్నిసార్లు తలెత్తి చూడాలి మనిషి
తను ఆకాశాన్ని చూడబోయే ముందర?
అవునింకా ఎన్ని చెవులు కావాలో మనిషికి
తాను ఇతరుల రోదనలు వినే ముందర?
అవునింకా ఎన్ని చావులైతే తెలిసొస్తుంది తనకి
ఎందరెందరో ప్రజలు మరణించారని?
జవాబు, మిత్రమా గాలిలో వీస్తోంది
గాలిలో వీస్తోంది జవాబు

## కాలం మారుతోంది ఖాయం

ఎటు నీ సంచారమైన కలిసుండు జనాలతో
ఒప్పుకో మెడ దాకా నీరు చేరి పెరుగుతోందనీ
ఒప్పుకో ఈత నేర్వకపోయావా మునగడం తప్పదనీ
నీ కాలం నీకు కాపాడుకోదగిన విలువైనదైతే
ఈదాడి బయటపడు లేదా మునిగేవు రాయిలా
ఎందుకంటే కాలం మారుతోంది ఖాయం.

రచయితలారా రండి విమర్శకులారా రండి
కలాలతో కాల జ్ఞానాలు పంచు గొప్పవారు
మీరు
తొందర పడి తెలపకండి తిరుగుతోంది
చక్రమింకా
చెప్పలేం అదాగినప్పుడెవరి పేరు చెప్తుందో
ఇప్పుడు ఓడిన వారలు రేపు గెలుపు వీరులు
ఎందుకంటే కాలం మారుతోంది ఖాయం.

రండి శాసన సభ్యులార, ఎం.పి. బాబులారా
వింటూ ఆ పిలుపులు
దారికడ్డు నిలవకండి, హాల్‌లో కిక్కిరిసిపోకండి
ఎవరిపుడు గాయపడితే వారాగిపోవాల్సిందే
పైన పోరు చెలరేగుతోంది
త్వరలో మీ గోడలు, కిటికీలు అల్లల్లాడిస్తుంది
ఎందుకంటే కాలం మారుతోంది ఖాయం.

రండి దేశమంత నిండిన అమ్మనాన్నలూ
ఏది మీకర్థం కాదో దాన్ని ఈసడించకండి
మీ కొడుకులు కూతుళ్ళు, వినలేదు మీ
మాటని
మీ పాత దారులు ముసలివౌతున్నాయి
చేయందించపోయారా తొలగిపోండి
కొత్తదారుల
ఎందుకంటే కాలం మారుతోంది ఖాయం

ఎవరెటో గీత గీయబడింది శాపం నిలబడింది
ఇప్పుడు నెమ్మదిగా ఉన్నవారు తదుపరి
ఊపందుకోవాలి
ఇప్పుడు వర్తమానమేదో తదుపరి గతమందు
నిలవాలి
పాత రీతి రివాజులిపుడు వెలిసిపోతున్నాయి
వేగంగా
ఎందుకంటే కాలం మారుతోంది ఖాయం.

## దైవం దాని పక్షాన ఉన్నాడు

చరిత్ర పుస్తకాలు చెప్తాయి ఈ విషయం
ఎంత చక్కగా చెప్తాయంటే
గుర్రాల రౌతులు దూసుకెళ్లారు
ఇండియన్ల గుంపులు చనిపోయారు
ఆహా దేశం ఇంకా ఏర్పడుతున్నది
దైవం దాని పక్షాన ఉన్నాడు

కుర్రాళ్ళు, మొదటి ప్రపంచ యుద్ధం
వచ్చింది, వెళ్ళింది
ఎందుకు పోరాడామో నాకు
ఇప్పటికీ తెలిసి రాలేదు
కానీ ఆమోదించాను నేను
కించిత్ గర్వంతో
ఎందుకంటే, దైవం మన పక్షం ఉన్నప్పుడు
మనం చనిపోయిన వాళ్ళను తల్చుకోము

రెండో ప్రపంచ యుద్ధం
ముగిసినప్పుడు
మేం జర్మన్లను క్షమించాము
తర్వాత మేం దోస్తులయ్యాము
వారు పెను బానలలో
ఆరు మిలియన్ల మందిని కాల్చి చంపినా
ఇప్పుడు జర్మన్ల పక్షాన సైతం
దైవం ఉన్నాడు.

ముఖాముఖి

# నా కవిత్వ నేపథ్యం ఉద్యమస్ఫూర్తే



ఆచార్య ఎస్వీ. సత్యనారాయణ

ఉపాధ్యక్షులు, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్

ఇంటర్వ్యూ : డా॥ చింతపట్ల సుదర్శన్, 9299809212

**ప్రశ్న: మీ సాహిత్య నేపథ్యం, ప్రవేశం గురించి చెప్పండి?**

**జవాబు:** మాది హైదరాబాద్ పాతనగరం, Down Trodden Family. నాన్న విఠల్‌రావ్‌కు మేం పదిమంది సంతానం. బాపు శతక పద్యాలు అలవోకగా పాడేవాడు. అది నాలోపల 'Spark'కి కారణం అనుకుంటా. ఇక నన్ను 'Ignite' చేసింది హైదరాబాద్ పాతనగర సాహిత్య ఉద్యమమే. ఉర్దూ ప్రభావం వల్ల తెలుగుకి ఏమాత్రం ప్రాచుర్యం లేని కాలంలో, పాతనగరంలోని సారస్వత అకాడమీ, భారత్ గుణవర్ధక సంస్థల్లో ఇంగ్లీషు, ఉర్దూ కార్యక్రమాలే విరివిగా జరుగుతూ ఉన్న కాలంలో వచ్చిందీ ఉద్యమం. తెలుగు సాహిత్య చరిత్రలో ఈ ఉద్యమం రికార్డ్ అవ్వాలి. 1969 తెలంగాణ ఉద్యమంలో ప్రభాత భేరీలో ప్రతి ఉదయం పాటలు పాడే యువకులం కలిసి వెలువరించిన 'నవ్యసాహితి' లిఖిత పత్రికతో ఆరంభమయింది నా సాహితీ ప్రయాణం. తర్వాత 'ఉషస్సు' 'వేదిక' లిఖిత పత్రికలు, హైదరాబాద్ పాతనగరం రచయితల సంఘం నిర్వహించిన వివిధ సాహిత్య కార్యక్రమాలు నన్ను అక్షరజీవిగా సెటిల్ చేశాయి. ఆ తర్వాత అభ్యుదయ రచయితల సంఘంలో నా రిలేషన్, లైఫ్ లాంగ్ అయ్యింది.

**ప్రశ్న: కీ.శే. ఆవంత్స సోమసుందర్ జీవితం + కవిత్వం = ఉద్యమం అంటే ఎస్వీ కవిత్వం అన్నారు. ఆ కవితా సంపుటి గురించి?**

**జవాబు:** 2005లో 'జీవితం ఒక ఉద్యమం' కవితా సంపుటి వచ్చింది. ఇది నా ఇతర కవితా సంపుటులకంటే భిన్నమైనది. ఒక మాటలో చెప్పాలంటే *'It's a gist of my Life'*. ఉద్యమం నా జీవితంలో ఒక భాగం. నా కవిత్వ నేపథ్యం ఉద్యమ స్ఫూర్తే. నాకు అలజడి వేదం. ఆందోళన జీవన నాదం. నా ఫిజికల్ జర్నీ, నా పొయటిక్ జర్నీ రెండూ ప్రతిబింబించే కవితా సంపుటి అనవచ్చు. అయితే ఇది వ్యక్తిగతమైనది కాదు. నా వైయక్తిక అంతర్వేదనలన్నీ సార్వజనీనంగా మార్చబడ్డాయి. ఆవంత్స నన్నెప్పుడూ *'A Soldier with Pen'* అని భావించేవాడు.

**ప్రశ్న: 'తెలుగు ఉద్యమ గీతాలు' సిద్ధాంత గ్రంథంలో ఎస్వీ కాంట్రిబ్యూషన్?**

**జవాబు:** ఉద్యమం అంటే ఏమిటి అని స్పష్టంగా నిర్వచించుకుని, ఉద్యమ చరిత్ర నేపథ్యాన్ని వివరించి

ఉద్యమ ప్రభావంతో వచ్చిన గీతాలను విశ్లేషించాను. జాతీయోద్యమం, ఆంధ్రోద్యమం, తెలంగాణ సాయుధ పోరాటం, వామపక్ష ఉద్యమాలు, దళిత ఉద్యమాలను అధ్యయనం చేశాను. ఉద్యమాల పొలిటికల్ బ్యాక్‌గ్రౌండ్‌తో పాటు ప్రధాన ఘట్టాలను వివరించాను. వామపక్ష ఉద్యమాలలో కమ్యూనిస్టు ఉద్యమం చీలిన తర్వాత వచ్చిన ట్రెండ్స్‌ని, విప్లవ సాహిత్య ఉద్యమ వికాసాన్ని, దిగంబర కవిత్వం, విరసంలో చీలికలు, దళిత ఉద్యమం మొదలైన వాటిని కూడా స్పృశించాను. తొలి స్వాతంత్ర్య గీతి, తొలికార్మిక గీతి, తొలి ఎర్రజండా గీతికలను నిర్ధారించాను.

**ప్రశ్న:** **'సత్యానుశీలన' వ్యాస సంపుటి ప్రత్యేకత ఏమిటి?**

**జవాబు:** మల్టిపుల్ సబ్జెక్ట్ మీద వ్రాసిన వ్యాసాలు అవి. అభ్యుదయ సాహిత్య ఉద్యమంతో ప్రత్యక్ష సంబంధం ఉన్న తుమ్మల వెంకట్రామయ్య, సుద్దాల హనుమంతు, వేముల పల్లి శ్రీకృష్ణ, రాంభట్ల కృష్ణమూర్తి, రాజ బహద్దూర్ గౌడ్‌లపై వ్యాసాలున్నాయి. అలాగే అభ్యుదయ ఉద్యమంతో సంబంధం ఉన్న భారతీయ రచయితలయిన కశ్మీరీ కవి రహ్మాన్ రాహీ, ఉత్తర్ ప్రదేశ్‌కి చెందిన కైఫీ ఆజ్మీ, ఒరిస్సా కవి సీతాకాంత్ మహాపాత్ర, అస్సామీ రచయిత్రి ఇందిరా గోస్వామి వంటి వారితో పాటు శ్రీశ్రీ, వట్టికోట ఆళ్వారుస్వామి, కాళోజీ, చాసోలపై వ్యాసాలు ఉన్నాయి. ఉత్తమ కథల కథా శిల్పాలు విశ్లేషణలో గురజాడ 'దిద్దుబాటు' చాసో 'శిల్పం' 'శైలి' గురించి వట్టికోట జైలులోపల 'పరిసరాలు' కథల్ని పరిచయం చేశాను.

సామాజిక దార్శనికతకు ఉదాహరణ అయిన కొడవటిగంటి కుటుంబరావు నవల 'పంచకల్యాణి', దళిత జీవన పరిణామాన్ని సూచించే జి. కళ్యాణరావు 'అంటరాని వసంతం' నవలలపై కూడా వ్యాసాల్ని కలిపి వేశాను. వ్యాస సంపుటులలో ఇంత డైవర్సిటీ ఉన్నవి తక్కువగా ఉంటాయనవచ్చు.

**ప్రశ్న:** **స్వతంత్ర రచనలతో పాటు అనేక పుస్తకాలకు సంపాదకత్వం వహించడం జరిగింది కదా. మీ సంపాదకత్వంలో వచ్చిన గ్రంథాల గురించి?**

**జవాబు:** స్వతంత్ర రచన కన్నా సంపాదకత్వం వహించడం కష్టమైన పనే. ఎంపిక మీద వచ్చే ప్రశ్నలు ఎన్నో. కొత్తగా అంశాల మీద వ్యాసాలు, రచనలు రాయించడం కంటే ఒక అంశాన్ని నిర్ణయించుకుని ఎవరెవరు ఏ అంశం మీద రాశారో వాటిని సేకరించి వాటిని కాలానుక్రమంగా విషయానుసారంగా చేర్చడాన్ని నేను ప్రిఫర్ చేశాను. జాషువా సాహితీ ప్రస్థాన వ్యాసాల్లో జాషువా సృజనకు మూలాలు, ఆయన సాహిత్యానికి మూలమైన సామాజిక, ఆర్థిక, తాత్విక విషయాల మీద వ్యాసాలు ఇందులో చేర్చాను. 'స్త్రీవాద వివాదాలు'లో జ్వాలాముఖి, చేరా, కాత్యాయని, ఎస్వీ, కొండేపూడి నిర్మల వంటి వారి చర్చోపచర్చలు వాదవివాదాలు ఉన్నాయి. 'దళిత వాద వివాదాలు'లో సంప్రదాయ వాదం, పరిణామ వాదం, మౌలిక వాదం అనే మూడు రీతులపై వ్యాసాలున్నాయి.

ప్రశ్న: **జీవిత గమనంలో** At this point of Time **తెలుగు విశ్వవిద్యాయలం వైస్ ఛాన్సలర్‌గా మీ విజన్?**

**జవాబు:** రెండు రాష్ట్రాల్లో ఉన్న ఏకైక భాషా విశ్వవిద్యాలయం పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం. తెలుగు భాషాభివృద్ధికి అంతర్జాతీయంగా కూడా సేవలు అందిస్తున్నది. అనేక నూతన సంప్రదాయ కోర్సులను రెగ్యులర్‌గానే కాకుండా దూరవిద్య విధానంలో కూడా బోధిస్తున్నది. ప్రాచీన సాహిత్యం, ఆధునిక సాహిత్యం, జానపద సాహిత్యం ఈ మూడింటికీ తెలుగు విశ్వవిద్యాలయం సమానమైన ప్రాధాన్యత ఇస్తుంది. ప్రజాకళారూపాలకు సముచిత స్థానం కల్పించడానికి ప్రజా కళలకు అకడమిక్ గౌరవం కల్పించాలనే ఆలోచన ఉంది. తెలుగు యూనివర్సిటీ వీసీగా అందరికీ ఉపయోగపడేలా మూడేళ్ళ విజన్‌లో చేయాలనుకుంటున్న పనుల్లో తెలంగాణ చరిత్ర రచన, తెలంగాణ సాహిత్య రచన, తెలంగాణ పదకోశ నిర్మాణంతో పాటు తెలంగాణలో ఇప్పటివరకు ఉన్న జిల్లాలు కొత్తగా ఏర్పడబోయే జిల్లాల సర్వస్వాలను రూపొందించాలన్న సంకల్పం ఉంది.

డిసెంబర్ 2న జరిపే వ్యవస్థాపక దినోత్సవంతోపాటు ప్రతి మూడు నెలలకు ఒక కార్యక్రమాన్ని నిర్వహిస్తాం. ముఖ్యంగా వలయాకారంలో ఉన్న తెలుగు యూనివర్సిటీ మ్యూజియంని వందలాదిగా ఉన్న పెయింటిగ్స్‌తో సర్వాంగ సుందరంగా తీర్చి దర్శనీయ ప్రదేశంగా అభివృద్ధి చేస్తాం. ఇందుకు పర్యాటక శాఖ సహకారం తీసుకుంటాం.

ప్రశ్న: **వ్యక్తి విజయానికి కుటుంబం సపోర్ట్ ఎంతో అవసరం కదా. మీ కుటుంబం గురించి?**

**జవాబు:** నా శ్రీమతి కందిమళ్ళ భారతి స్వాతంత్ర సమర యోధులు, సుప్రసిద్ధ చరిత్రకారులు శ్రీ కందిమళ్ళ ప్రతాపరెడ్డి గారి కూతురు. ఓ వైపు నా ప్రోగ్రెస్‌కి సహకరిస్తూనే గ్రంథాలయ శాస్త్రంలో మూడు స్వర్ణపతకాలు సాధించింది. ప్రస్తుతం ఉస్మానియా గ్రంథాలయ శాస్త్ర విభాగంలో అధ్యాపకురాలు. పెద్దమ్మాయి సృజన ఆస్ట్రేలియాలో నేత్ర వైద్యంలో డాక్టరేట్ పొంది పోస్ట్ డాక్టరల్ పరిశోధన కొనసాగిస్తున్నది. అల్లుడు చీకోటి శివ ఆస్ట్రేలియాలో బ్యాంక్ మేనేజర్. చిన్నమ్మాయి శ్రుతి అక్కడే చేస్తున్న బయో మెడికల్ ఇంజనీరింగు పిహెచ్‌డీ పరిశోధన పూర్తి కావస్తున్నది. ఇప్పుడు మాది డాక్టరేట్ల కుటుంబం.

ప్రశ్న: **తెలుగు యూనివర్సిటీ వి.సి. కావడం పట్ల మీ స్పందన?**

**జవాబు:** మా అన్న కీ.శే. నర్సింగ్‌రావ్ నేను ఐఎఎస్ కావాలని కలలు కనేవారు. ఒకరకంగా అన్నయ్య అనుకున్న పొజీషన్ సాధించాననుకుంటా. కూలిన గోడల ఇంటినుంచి వచ్చిన నేను అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం ప్రధాన కార్యదర్శినయ్యాను. పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం వీసీనీ అయ్యాను. ●

సంస్కృతి

# ధారావారి నాట్యావధానం - నా అనుభవాలు


1933 -2016

ధారా సత్యనారాయణ శర్మ, 98852 50549

రంగస్థల చరిత్రలో నాట్యావధానం ఒక విశుద్ధనూత్న ఆవిష్కరణ. అభినయ కళారూపానికి అవధానం జోడించటమే నాట్యావధానం. ప్రక్రియ మొత్తంలో సద్యస్ఫూర్తి ప్రధానపాత్ర వహిస్తుంది. అభినయం, వాచకం, ఆహార్యం అన్నీ కూడా అప్పటికప్పుడు సమకూర్చుకుని, అంటే ఎలాంటి ముందస్తు ప్రిపరేషన్ లేకుండా పాత్రను అభినయించటం. ఈ నాట్యావధాన ప్రయోగ సృష్టికర్త మా అన్నగారు డా॥ ధారా రామనాథ శాస్త్రి గారు 6-8-2016న ఒంగోలులో తన 84వ ఏట పరమపదించుట కళాభిమానులకు తీరని మనస్తాపం కలిగించింది.

డా॥ ధారా రామనాథ శాస్త్రి గారు ఈ ప్రక్రియను సృష్టించి 60 సం॥లు దాటింది. ఆయన మద్రాసులో విద్యార్థిగా వున్న కాలంలో తన మానసిక ఫలకంలో మెరసిన ఒక భావశకలం కాలక్రమేణ ఒక గొప్ప కళాస్వరూపంగా రూపుదిద్దుకొన్నది. 60 సంవత్సరాలుగా నిరాటంకంగా రాష్ట్రంలోనూ, ఇతర రాష్ట్రాలలోనూ, విదేశాలలోనూ ప్రదర్శనలు ఇచ్చారు. ధారావారి సహోదరునిగా నేను కూడా అనేక అవధానాలలో పాల్గొని అనేక పాత్రలను అభినయించి ఆత్మానందాన్ని పొందాను. రసస్ఫూర్తి కల్గిన ఈ కళారూపం ప్రేక్షకులను పులకరింతలతో కూడిన ఒక సమ్మోహనానికి లోనుచేస్తుంది. అవధాన ప్రక్రియలో లాగానే సభికుల నుండి విజ్ఞులు సమస్యలనివ్వటం, వాటిని దృశ్యాత్మకంగా సంభాషలతో రక్తికట్టించడం దీనిలో ఒక నవ్యత్వం. దీనిలో నటుడు ప్రయోక్తగా, కవిగా రూపాంతరం చెందుతాడు. డా॥ సి. నారాయణ రెడ్డి గారు ఈ నాట్యావధాన ప్రక్రియను గురించి ఒక సందర్భంలో ఇలా చెప్పారు "లక్ష్య లక్షణ సృష్టికి విధాతలై నాట్యావధాన కళను పాతికేళ్ళుగా అఖిలభారత స్థాయిలో ప్రదర్శిస్తున్న శాస్త్రి గారి ప్రతిభ అప్రతిమానం. రూపం, రాగం, శబ్దం, భావం - చతుర్ముఖంగా భాసించిన రామనాథ శాస్త్రి గారి ప్రజ్ఞా పారమ్యం అనితర సాధ్యం. సాహిత్య నాట్య యోగ విద్యా చేతసులైన శాస్త్రి గారి ఉత్తమ సంస్కారానికి అభినందనలు". విశ్వనాథ, బాలమురళి, భానుమతి, అక్కినేని, ఎన్.టి.ఆర్., సినారె, హిందీ కవి దినకర్, దాశరథి, గుమ్మడి, శివశంకరస్వామి, జమ్మలమడక, మధునాపంతుల, తుమ్మల, రాళ్లపల్లి, మిక్కిలినేని, నరసరాజు, పురాణం, కరుణశ్రీ, పి.బి. శ్రీనివాస్ వంటి కళారంగ ప్రముఖుల నుండి శాస్త్రిగారు ప్రశంసలందుకున్నారు. ఎన్నో సన్మానాలు, పురస్కారాలు లభించాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గత 2015 ఉగాది నాడు 'కళారత్న' బిరుదుతో శాస్త్రి గారిని సత్కరించింది.

ఆరు సంవత్సరాల క్రితం మరణించిన మా రెండవ అన్నగారు ధారా రాధాకృష్ణ శాస్త్రి గారు రెండవ నాట్యావధాని. ఇక నేను మూడవ నాట్యావధానిని. శాస్త్రి గారి కుమారులు వశిష్ట, అల్లుడు లీలాకృష్ణ కూడా ఈ నాట్యావధాన ప్రక్రియలో భాగస్వాములే! కుటుంబాన్నంతటినీ

నాట్యావధానానికే అంకితం చేసిన ధన్యజీవి మా అన్నగారు. నేను దాదాపు 50 సంవత్సరాల నుండి మా అన్నగారితో ప్రదర్శనలు ఇస్తున్నాను. నా తొలి ప్రదర్శన 1965లో కలకత్తాలో యివ్వటం జరిగింది. చివరి ప్రదర్శన అన్నగారితో పాటు హైదరాబాద్‌లో 2015 సంవత్సరంలో త్యాగరాయ గానసభలో అన్నగారికి నోరి నరసింహశాస్త్రి గారి సాహితీ పురస్కారం ప్రదానం చేసే సందర్భంలో చిన్నవేషం వేయటం జరిగింది. అదే అన్నగారితో చివరి ప్రదర్శన. నాట్యావధాన ప్రదర్శకునిగా ఎన్నో అనుభవాలను, అనుభూతులను ప్రోది చేసుకున్నాను. వాటిలో ఒకటి మీ ముందుంచటం ద్వారా అన్నగారికి అంజలి ఘటిస్తాను.

1965లో కలకత్తా ఆంధ్ర మహాసభ వారి ఆహ్వానం మేరకు ఒక ప్రదర్శన ఇచ్చాం. నాట్యావధాన ప్రదర్శనకు ఉద్యుక్తుడనై గజ్జెకట్టి, ఎంతో ఉద్విగ్నతకు లోనైన క్షణం అది. ప్రేక్షకులనుండి ఒకరు సన్నివేశం సూచించారు. అదేమిటంటే వివాహం చేసుకున్న యువకుడు శోభనం నాటి రాత్రి తన భార్య మూగదనీ, తనను మోసం చేసారని తెలుసుకుని, ఉదయం మామ గారిని ప్రశ్నించే సన్నివేశం. మామగారి పాత్రను నేను, అల్లుడి పాత్రను మా అన్నగారు అభినయించాము. మామగారి పాత్రోన్మీలన కష్టసాధ్యమైంది కనుక, నిస్సహాయ స్థితికి కరుణరసాన్ని జోడించి పాత్రను ఆవిష్కరించే ప్రయత్నం చేసాను. ఇంతలో ప్రేక్షకుల మధ్యలో ఒక స్త్రీ ఏడ్వటం కనిపించింది. వాకబుచేస్తే అవధానంలో ప్రదర్శించిన సన్నివేశమే వారింట జరిగిందని. అప్పుడర్థమైంది కళ, దాని స్వరూపం ప్రజలకు ఎంత దగ్గరగా వాస్తవంగా ప్రతిబింబిస్తుందో అని.

> కైలాసగిరి అవలీలగ పెకలించు
> రావణ బ్రహ్మ శౌర్యప్రశస్తి
> కౌరవసైన్యంబు గాంచి, బిత్తరపోయి
> తత్తర పడెడు ఉత్తరుని బెదరు
> విల్లెక్కు పెట్టి శోభిల్లు అల్లూరి సీ
> తారామరాజు గంభీర గర్జ
> వట్టి ప్రగల్భాలపుట్ట గిరీశము
> మేరమీరిన మాటకారితనము
>
> ఎప్పుడెవ్వారికే భావమిష్టమగునొ
> అప్పుడవ్వారి కాభావమవధరించి
> అవతరించి, నటించి, నాట్యాంగణముల
> రక్తి కట్టించు మేటి! ధరా కిరీటి!
>
> – 'కరుణశ్రీ' జంధ్యాల పాపయ్యశాస్త్రి
>
> (1988లో విజయవాడలో ధారావారికి జరిగిన కనకాభిషేక సత్కార సభలో సమర్పించిన పద్యం)

ఇలాంటి సన్నివేశాలు వివిధ పాత్రల ద్వారా అనేక చోట్ల ప్రదర్శించాము. చారిత్రక, సాంఘిక, పౌరాణిక పాత్రలలో పరకాయ ప్రవేశం చేసి మనసులో చెలరేగే భావ పరంపరా వాసనలు ప్రక్షాళన చేసుకోవటం జరిగింది. జగమంతా రంగస్థలం. అలానే మనం సృజించుకొన్న రంగస్థలం అతిరమ్యస్థలం. రసరమ్య భావాలకు శాశ్వతత్వం కల్పించటమే ఈ నాట్యావధాన ప్రక్రియ లక్ష్యం. మా అన్నగారు డా॥ ధారా రామనాథ శాస్త్రి గారి నేతృత్వంలో ఈ నాట్యావధానంలో నేనూ భాగం కావటం నా పూర్వజన్మ సుకృతం! మా అన్నగారికి నా స్మృత్యంజలి! ●

*యానాం కవితోత్సవంలో శీలావీర్రాజుగారి చిత్రకళా ప్రదర్శన సందర్భంగా*



# పల్లెజీవన ప్రతిబింబాలు శీలా వీర్రాజుగారి చిత్రాలు

వెంటపల్లి సత్యనారాయణ, *9491378313*

కుంచె ఆధారంగా భవితను నిర్మించేవాళ్ళు చిత్రకారులైతే కలం ఆధారంగా చరిత్రను సృష్టించేవాళ్ళు కవులౌతారు. విభిన్నమైన ఈ రెండు కళా ప్రక్రియలను సమర్థవంతంగా నిర్వహించగల వ్యక్తులలో అలనాటి అడవి బాపిరాజుగారి తర్వాత మరలా ఉభయ తెలుగు రాష్ట్రాలలో కవిత్వం, చిత్రలేఖనం రెండింటా సమస్థాయిలో ప్రసిద్ధి గాంచిన వ్యక్తులలో శీలా వీర్రాజుగారు ప్రథమ స్థానంలో ఉంటారని చెప్పవచ్చు.

దాదాపు పదిహేనేళ్ళ క్రితమనుకుంటాను- సరిగా గుర్తు లేదు- మొన్నటి మన సమైక్య తెలుగురాష్ట్ర అధికారిక మాసపత్రిక "ఆంధ్రప్రదేశ్"లో తొలిసారిగా చూశాను ఒక చిత్రం. దాని పేరు "ఏటికెదురు", దానిలో ఐదుగురు మగాళ్ళు ప్రవహించే ఏటికెదురుగా ఇసుక, సిమెంట్, ఇనుము తదితర సామాన్లతో వున్న పడవను భారంగా లాగుకుంటూ వస్తున్న దృశ్యం అది.

శీలా వీర్రాజుగారు కళల కాణాచి ఐన రాజమహేంద్రిలో కళావారసత్వం ఏమాత్రం లేని ఓ మధ్యతరగతి కుటుంబంలో జన్మించినా వూరికి నీటి అంచుగా వున్న జీవనది గోదావరి దానిలో తూగుటుయ్యాలలాగ కదిలే పడవలు, రాజహంసల్లా సాగిపోయే లాంచీలు, నదికి ఆవలివొడ్డున ఉభయ సంధ్యలలో ఆకాశంలో పరుచుకునే రంగులు బహుశా తనకు తెలియకుండానే తనలో రసదృష్టిని కలిగించివుండొచ్చని ఆయన చెప్తారు.

వీర్రాజుగారి చిత్రాలు ఆధునిక శైలి, లేదా సంప్రదాయశైలి ఏ శైలిలో వేసినా సామాన్యుడి అవగాహనా పరిధికి లోబడి ఉండాలనేది వీర్రాజుగారి అభిప్రాయం. 'ప్రజా జీవనరీతులకు అద్దంపట్టడానికీ, నేటి ఆధునిక సమాజంలో కనుమరుగౌతున్న సామాజిక కార్యకలాపాలను ప్రజల కళ్ళెదుట నిలపడానికీ నేను ప్రయత్నం చేస్తూవుంటాను. నా చిత్రాలకు ప్రధాన ఇతివృత్తం ఇదే' అంటారు వీర్రాజుగారు. అందుకే దాదాపు ఆరు దశాబ్దాల చిత్రకళా గమనంలో వారి కుంచె నుండి జాలువారిన ప్రతీచిత్రం సమాజానికి, సంస్కృతీ సంప్రదాయాలకి, సామాన్యుడి జీవన విధానానికి అద్దంపట్టేవిధంగా వుంటాయి. రంగుల్లో సప్త వర్ణాల్లా వీరి చిత్రాలను ప్రధానంగా ఏడు భాగాలుగా విభజించవచ్చు అవి- సాంప్రదాయ చిత్రాలు, శ్రమైకజీవనాన్ని ప్రతిబింబించే చిత్రాలు, మనోదర్పణ చిత్రాలు, పౌరాణిక చిత్రాలు, ప్రకృతి చిత్రాలు, నిశ్చల చిత్రాలు, రేఖాచిత్రాలు.

ఇంకా పుస్తక ముఖచిత్రాలనుకూడా పరిగణలనోకి తీసుకున్నట్లయితే ఎనిమిద విభాగం కూడా ఆయన చిత్రాల్లో చేర్చవచ్చు. కారణం- ఆయన 1960ల నాటి ప్రఖ్యాత "కళ" పత్రికతోపాటు వెయ్యికిపైగా వివిధ ప్రముఖుల సాహితీగ్రంథాలకు ముఖపత్రాలను వేశారు.

సామూహిక సంవిధానంలో వేసిన వీరి చిత్రాలలో "పేరంటం" తలంటు స్నానం, కబుర్లు, తదితర చిత్రాల్లోని భిన్న వయస్సుగల మహిళా మూర్తుల చిత్రాల్లో అచ్చమైన స్వచ్ఛమైన గ్రామీణ మహిళలు మనకు కనిపించడంతోపాటు; "నాగులచవితి" అన్న చిత్రంలో మంచి దృష్టిక్రమాన్ని మనం చూస్తాము. బోరుబావి అన్న చిత్రంలో నీటికోసం నేటి మహిళల పాట్లు మనకు కనిపిస్తాయి.

ఒకప్పుడు మన తెలుగువారి ఇళ్ళల్లో సాంప్రదాయకంగా ఆడుకునే క్రీడలు "వామన గుంటలు" అన్న చిత్రం ద్వారా గుర్తు చేస్తే; ముచ్చట్లు, తల్లీ బిడ్డ, తారంగంతారంగం వంటి తదితర చిత్రాల్లో పిల్లల పట్ల అమ్మ లాలన ఎలా వుంటుందో చూపిస్తారు.

ఇక శ్రమైకజీవన సౌందర్యాన్ని ప్రతిబింబించే చిత్రాలలో నర్సరీలలో పనిచేసే కూలీలు, కమ్మరి కొలిమిలలో పనిచేసే కార్మికులు, పంటపొలాల్లో పనిచేసే పనివాళ్ళు, ఇంకా మంగలి, కుమ్మరి, నేతకార్మికులు, పశువుల కాపరులు, చర్మకారులు, భవన నిర్మాణ కూలీలు, మత్స్యకారులు, వ్యవసాయ క్షేత్రాలలో పండించిన పంటలను అమ్ముకునేందుకు పట్నంలో సంతకేగుతున్న రైతులు- ఇలా శ్రామికవర్గానికి చెందిన సకల వృత్తులవారు వీరి చిత్రాలలో మనకు కనిపిస్తారు.

ప్రఖ్యాత కళావిమర్శకుడు డాక్టర్ సంజీవ్‌దేవ్ అంటాడు మనిషి రెండురకాల పరిస్థితులలో జీవిస్తాడని. వీటిలో ఒకటి- ఏకాంతం, రెండు- జనాంతం. జనాంతంలో అంతర్ముఖులౌతారు. అలాంటి భిన్న విభిన్న భావాలకు ప్రతిరూపాలే వీర్రాజుగారు చిత్రించిన "గత స్మృతులు, ఎదురుచూపు, నిరాశ, ఆశలేని భవిత, యోచనాలోచన, దుఖిత దీనబాంధవి, చితికిన రైతు, వలపు తలుపులు, సుఖనిద్ర, మధురస్మృతులు" లాంటి చిత్రాలు.

1973లో జలవర్ణాల్లో వేసిన ఆయన సెల్ఫ్ పోర్ట్రెట్, నర్తకి, "ముదుసలి", బిచ్చగాడు తదితర చిత్రాలన్నీ మూర్తి చిత్రణ పరిధిలోకి వస్తాయి. 1959లో జలవర్ణాల్లో వేసిన రాజమండ్రిలోని 'నీటి పంపింగ్ నిర్మాణం', వర్ష ప్రకృతి, పుష్పవిలాపం, వర్ణమయ ప్రకృతి, కొండవాగు, వర్షనగరి తదితరమైన ఎన్నో ప్రకృతి చిత్రాలతోపాటు కొన్ని నిశ్చల చిత్రాలను కూడా వీరు వేశారు. 1975లో ప్రపంచ తొలి తెలుగు మహాసభల సందర్భంగా వీరు వేసిన వీరశైవ ప్రవక్త "శ్రీపతి పండితుడు", శకుంతల, రాధాకృష్ణులు లాంటి పౌరాణిక చిత్రాలు కూడా వీరి కుంచెనుండి రూపుదిద్దుకున్నాయి.

వీర్రాజుగారి చిత్రకళాగమనాన్ని పరిశీలించినట్లయితే ఒక విచిత్రమైన వైఖరి మనకు కనబడుతుంది. ఆరంభదశలో వీరు వేసిన కొన్నిచిత్రాలు చాలా ఆధునికంగానూ, నేటి ఆధునికకాలంలో వేసిన చిత్రాలు చాలా పాతకాలం నాటివిగాను కనిపించడం మనం గమనిస్తాము.

1959లో వేసిన కష్టేఫలి, 1960లో వేసిన "వరినాట్లు", 1969లో చిత్రించిన "రంగులరాగాలు", 1995లో వేసిన "అలసిన వేళ", "వర్షనగరి", తదితర చిత్రాలలో ఆధునిక పోకడలలోపాటు రంగులపై ఆయనకు గల సాధికారతను మనం గమనిస్తాము. ఇటీవల ఒక సిరీస్‌గా వేస్తున్న ఆయన చిత్రాలైన మమకారం, కేశాలంకరణ, వంటచెరకు, శ్రమజీవులు, బతుకుతెరువు, చేనేత కుటుంబం, చెరువుకాడ, సువ్వీసువ్వీ, చలిమంట, మేదరి జీవితం, చెమ్మచెక్క, ఒప్పులకుప్ప, వేటపడవలు ఇంకా రాలేదు, పల్లెపడుచు సింగారం, తిరగలితోపిండి, దంపుళ్ళు, సంతనుండి, నిరీక్షణ, తదితర చిత్రాలన్నీ చూసినప్పుడు కనుమరుగైపోతున్న ఒప్పటి మన సామాజిక కార్యకలాపాలు, ప్రజా జీవన రీతులు మన కళ్ళెదుట ప్రత్యక్షమౌతాయి.

వీర్రాజుగారు చిత్రకళలో ఆధునిక పోకడలను ఆస్వాదిస్తారు, అభిలషిస్తారు. అవసరమైన సందర్భాలలో ఆచరణలో చూపిస్తారు. అయితే ఆధునికత పేరుతో చేసే వెర్రివెర్రి ధోరణులను హర్షించనంటారు. పోస్ట్ మోడరన్ పేరుతో సామాన్యుడి అవగాహనాపరిధికి అందనిది ఏదీ తనకు సమ్మతంకానిదిగా చెప్తారు. ***(శీలా వీర్రాజుగారి 'కుంచెముద్రలు' గ్రంథం నుండి)***

కవుల కథ



# దళిత గోదావరి

దాట్ల దేవదానం రాజు, 94404 105987

తెలుగు సాహిత్యంలో శంకరమంచి-అమరావతి కథలు, నామిని-మిట్టూరోడి కథలు, ఖదీర్‌బాబు -దర్గామిట్ట కథలు, వంశీ-పసలపూడి కథలు, నక్కా విజయరామరాజు-భట్టిప్రోలు కథలు వరుసలో ఇటీవల 'యానాం కథలు' వచ్చి చేరాయి. వాటి సృష్టికర్త ప్రముఖ కవి, కథకుడు దాట్ల దేవదానం రాజు. ఎప్పుడో పాతికేళ్ల క్రితం శివారెడ్డి కవి బృందం యానాం సందర్శించినప్పుడు జరిగిన ఒక ఘటనను కథాగా మలిచారు దేవదానంరాజు. గోదావరి కథల పరంపరలో వెలువడిన మంచి కథ ఇది. యానాం కవితోత్సవ సందర్భంగా కవిసంధ్య పాఠకుల కోసం ప్రత్యేకం. - సంపాదకులు

రోహిణీ కార్తె. ఎండ పెట్రేగి పోతుంది. అట్లాంటి సమయంలో తీరని దాహంతో... అలమటిస్తున్న కవులేం చేస్తారు? సేద తీరే మార్గాలు వెతుక్కుంటారు. చల్లబడే దిక్కుల కోసం కలియ దిరుగుతారు. నీడల చుట్టూ అల్లుకుపోతారు. వారంతా పదిమంది కవులు శివారెడ్డితో కలిపి, లుంగీ, తలపాగాగా చుట్టి... బండి వాడిని పక్కన కూచోబెట్టుకుని. అదొక వసందైన ముచ్చట, కవుల బండి గోదావరి కేసీ పరుగులు తీసింది.

మిట్టమధ్యాహ్నం.. యానాం ఫెర్రీ రోడ్డు. సందడి లేదు. నిర్మానుష్యం. చిటపటలాడుతున్న ఎండ. వేళకాని వేళ ఈ సమయంలో జలవిహారం కోరిక కడువిడ్డూరం. అల్లదివో గ్రీష్మ గోదావరి పరవళ్లు తొక్కుతోంది. పడవ సిద్ధం. వొక్కొక్కరూ ఎక్కారు. గోదావరి మధ్యలో ఇసుకమేటల లంక. చుట్టూ నీరు. గమ్మత్తైన అనుభవం కోసం ఎదురుచూపు. చండ్ర నిప్పులు చెరుగుతూ ఆకాశంలో వొంటరి సూర్యుడు. నీటి మేఘాల్ని చీల్లుకుంటూ.. పడవ కదిలింది. కవులేం చేస్తారు? గంగవెర్రులెత్తుతారు. వీళ్లదే అదే బాపతు. సంభాషణలు ముగింపు పలకకుండానే.. లంక వచ్చేసింది. దిగారు. సరంజామా వొక చోటకు చేర్చారు. హాయిగా ఆనందించే వెన్నెల సమయమా ఇది...?

మబ్బు తెరలు అడ్డు రాకుండా సూర్యుడు చూస్తున్నాడు. ఇసుకనేల. కూర్చోవడానికి గోనె సంచులు కింద పరిచారు. ఆతృతతగా గొంతులోకి జారుతున్న ద్రవం దేహాన్ని చల్లబరిచే పని మొదలు పెట్టింది. కాసింత స్థిమిత పడ్డారు. ఉపశమనం. సరిగ్గా ఇప్పుడే.. సృజనకారులు తెరచిన పుస్తకాలవుతారు.

అంత ఎండలోనూ శాలువా కప్పుకున్న శివారెడ్డి రైలుబండి పాట అందుకున్నారు. అందరూ చప్పట్లు. మద్దూరి నగేష్ బాబు చిత్రమైన గొంతు జీరతో పల్లెవాటు పదాలతో పాడిన పాట మనసుల్ని మరింత చల్లబరిచింది. వాతావరణం నిశబ్దంగా మారిపోయింది.

గుంపులో కవికాని వాడు వొకడున్నాడు. అతను మౌనంగా బిక్కుబిక్కుమంటూ చూస్తున్నాడు. గూడ పంచె.. చిరిగిన బనీను. పెరిగిన గడ్డం. ముంజేతికి తెల్లబారిన కాశీ తాడు. తెల్లని దువ్వని చింపిరి జుట్టు. చేతులు కట్టుకుని మూలగా మాజేటి సుబ్రమణ్యం. వాడి చూపులతో గోదావరిని చూస్తున్నాడు. కవి గుంపులోకి ఎలా చొరబడ్డాడో తెలీదు. శివారెడ్డి దృష్టి అతని మీద పడింది. అంతే కందిరీగ తుట్టె రేగింది.

మీకేమైనా పద్యాలొచ్చా...? విని వొంటబట్టించుకున్నయి ఏమన్నా ఉంటే చెప్పండి.

"వచ్చు గానండీ.. తమ బోంట్లు వింటే కిసుక్కున నవ్వేస్తారు. వేమన పద్యాలు, బ్రహ్మం గారి తత్వాలు బుర్రలో తిరుగుతూనే ఉంటాయి. ఏదో కాలక్షేపం కోసం".

"చెప్పు తాతా..?" అంటూ ముచ్చట పడ్డారు కుర్ర కవులు. సుబ్రమణ్యం ఎత్తుకున్నాడు ముందుగా వేమన పద్యాలు.

చెవులు రిక్కించి విన్నారు. వొక్కో పద్యం విని అదిరిపోయారు. "అద్భుతం..." అంటూ సంబరపడ్డారు. శివారెడ్డి చప్పట్లతో ఉత్సాహపరుస్తున్నారు. వారెవ్వా అంటున్నారు.

గోపి గారికి అందని పద్యాలులా ఉన్నాయి. "ఏదీ మళ్లీ చెప్పండి". బీరు కేసుల అట్టపెట్టె... కాగితం చింపి దాని మీద రాయడానికి ఉపక్రమిస్తూ సీతారాం చిన్న పిల్లాడై జాగ్రత్తగా నాలుగైదు పద్యాలు రాసుకున్నాడు. "మా వోడే మా బంధువే..." మెరుపు కళ్లతో శిఖామణి అన్నాడు.

"మీరు కాసిన్ని ఈ చుక్కలతో గొంతు తడుపుకొని మరికొన్ని పద్యాలు లాగిస్తే తరిస్తాం. ఇన్నాళ్లూ ఎక్కడ దాగి ఉన్నావయ్యా మహానుభావా...?"

చేతులు జోడించి చిరునవ్వు చిందించాడు యాకూబ్. సున్నితంగా తిరస్కరించాడు సుబ్రమణ్యం. ఎంత బతిమాలినా సీసా తాకలేదు. సుబ్రమణ్యం కేసి సంబరంగా చూస్తున్నాడు అఫ్సర్.



1992లో యానాం పర్యటించిన శివారెడ్డి కవి బృందం. 'దళిత గోదావరి' కథకు ప్రత్యక్ష సాక్షులు ఈ ఘటన చూసే అఫ్సర్ "యానాం వేమన ఏమనె" కవిత రాసాడు.

"వీర బ్రహ్మంగారి తత్వాలు కూడా అందుకోండి. సుబ్రమణ్యం గారూ..." నిషా ముసుగు లేకుండా ఎండ భరిస్తున్న ఏకైక వ్యక్తి దర్భశయనం అడిగాడు. సుబ్రమణ్యం ఇక బతిమాలించుకోలేదు.

"ఏ కులమని నను వివరం బడిగితే ఏమని చెప్పుదు లోకులకు. పలు గాకులకు. చెప్పలేదంటనకపోయేరు. నరులారా గురుని చేరి మొక్కితే బతక నేర్చేరు."

మంద్ర స్థాయిలో మొదలెట్టి ధారళంగా పాటలు తర్వాత పాటలు అందుకున్నాడు. మనిషి జీవితంలోని దశల్ని, పుట్టుకనుంచి మరణం దాకా చెప్పేవన్నీ ఆలపించాడు.

కవి మిత్రులు సంతృప్తి పడలేదు. సుబ్రమణ్యాన్ని వదలలేదు. బతిమాలి, బతిమాలి పాడించుకున్నారు. మద్దూరి తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. సుబ్రమణ్యం కేసి తీక్షణంగా చూస్తున్నాడు. ఆ చూపులు తగిలినట్లున్నాయి.

సుబ్రమణ్యం అసహనంగా కదిలాడు. సుబ్రమణ్యం ఆకాశం కేసి చూశాడు. చుట్టూ ఉన్న గోదావరిని చూశాడు. ఉస్సూరని నిట్టూర్చాడు. వారందరి మనసుల్లో సుబ్రమణ్యం.. సుబ్రమణ్యం.

"ఏమయ్యా సుబ్రమణ్యం, నిన్నీపళంగా ఇక్కడ వదిలేసి చక్కగా పడవెక్కి ఉడాయిస్తే... ఏం చేస్తావోయ్..." గమ్మత్తుగా శివారెడ్డి అడిగాడు.

"నాకేటి భయం, నాకేటి భయం. నీటిమీద నడుచుకుంటూ వచ్చేత్తా."

"విన్నారా...? అంతకంటే కవిత్వం ఏమిటి..? నిర్మలంగా మైదానంలా గోదావరి ఉందని చెప్పక చెపుతున్నాడు. తలచుకుంటే మార్గం దొరుకుతుందని అంటున్నాడు. శభాష్ సుబ్రమణ్యం. అన్నాడు శివారెడ్డి.

కోపగించుకోకండీ. మరండీ... మరండీ... నన్నేమైనా అనేయమంటారా..? నాకు తోచింది మాట్లాడేయమంటారా..?" ముందుగా అనుమతి కోరాడు సుబ్రమణ్యం.

"శుభ్రంగా అనవయ్యా... ఈ వేళ నీకేం అడ్డు లేదు." అన్నాడు శివారెడ్డి.

మాటలు కూడదీసుకోవడానికి అన్నట్టు కాసేపు ఆగాడు సుబ్రమణ్యం. "అందరి రక్తం ఎర్రగానే ఉంటుంది గందా. అందరూ అమ్మానాన్నల సంతోషంలోంచే.. రెండుకాళ్ల మధ్య గుండానే కెవ్వుమని ఏడ్చుకుంటూ పుట్టాం గందా. ఇన్నాళ్లూ రాత్తుండారు. మా కట్టాలు కన్నీళ్లు మీకు ఆపడ్డాయా.. అయ్యలారా. వొకే దారి గుండా వచ్చాం సరే. మరి మా ఆకు ఎందుకు ఎడం అయింది బాబయ్యా...?" అన్నాడు. ఆ ప్రశ్న విన్న గోదావరి ఒక్కసారిగా పోటెత్తింది. గోదావరి దళిత గోదావరి అయ్యింది.

కవుల జేబుల్లోని కలాలు దడదడలాడాయి. నిశ్చేష్టులయి తమ అనుభవాల్ని తవ్వుకుంటున్నారు. తాము అధ్యయనం చేసిన అంశాలు గుర్తుకొచ్చాయి.

కవులేం చేస్తారు..? కవులేం చేస్తారు.

దిక్కులు పిక్కటిల్లేట్టు గుండె బద్ధలై.. వెలువడిన ఈ ప్రశ్నకు సమాధానం ఏది..? ●

## మంచి పద్యం



డా॥ వరుగు భాస్కర్ రెడ్డి
94401 27967

క. చదువని వాడజ్ఞుండగు
జదివిన సదసద్వివేక చతురత గలుగున్
జదువగ వలయును జనులకు
జదివించెద నార్యులొద్ద జదువుము తండ్రి!

సహజకవి బమ్మెర పోతన రచించిన శ్రీమత్ ఆంధ్రమహాభాగవతం సప్తమ స్కంధంలోని 130వ పద్యమిది. రాక్షసరాజైన హిరణ్యకశిపుని చేత పోతన పలికించిన అద్భుత పద్యరత్నం. హిరణ్యకశిపుడు పరమశివభక్తుడు. కొడుకు ప్రహ్లాదుడు వైష్ణవభక్త శిఖామణి. ప్రహ్లాదుని విష్ణుభక్తి మానమని, కులదైవం శివుని పూజించమని అనేక పర్యాయాలు చెప్పాడు. అయినా ప్రహ్లాదునిలో మార్పు రాలేదు. గురువుల దగ్గర చదువు చెప్పిస్తే ప్రహ్లాదునిలో కొంత మార్పు రావచ్చని భావించిన హిరణ్యకశిపుడు అతన్ని చదివించాలని నిశ్చయించాడు. గురువుల వద్దకు చదువుకు పంపుతూ "ప్రహ్లాదకుమారా! చదవని వాడు అజ్ఞాని అవుతాడు. చదువుకుంటే సదసద్వివేకచతురత కలుగుతుంది. జనులంతా చదువుకుని తీరాలి. నిన్ను పండితుల వద్ద చదివిస్తాను. చదువుకో నాయనా" అని భావం. ఇందులో 'చదివిన సదసద్వివేక చతురత గలుగున్' అన్నవాక్యం సంస్కృతంలోని ఎన్నో మహనీయ ఋషివాక్యాలకు దీటైంది. ఏది సత్యమో-అసత్యమో/ ఏది మంచో-చెడో / ఏది జ్ఞానమో- అజ్ఞానమో / ఏది చీకటి-వెలుగో తెలుసుకునే వివేకం వస్తుంది. వివేకంతో పాటు చతురతా వస్తుంది. వివేకం వేరు చాతుర్యం వేరు. చతురత అంటే నేర్పు. నైపుణ్యం. ఇక్కడ మనం వివేకాన్ని శాస్త్రంగానూ, చాతుర్యాన్ని నైపుణ్యంగానూ చెప్పుకోవచ్చు. ●

డిసెంబర్ 6 అంబేడ్కర్ వర్ధంతి సందర్భంగా..



# జయ జయ అంబేడ్కరా!

**శిఖామణి**, *9848202526*

నవ భారత రాజ్యాంగ నిర్మాత, దళితుల హక్కుల ప్రదాత, భారతదేశ ప్రథమ న్యాయశాఖామాత్యులు డా॥ బి.ఆర్. అంబేడ్కర్ దేశంలోని అనేక రాష్ట్రాలను ప్రభావితం చేసినట్టుగానే ఆంధ్రదేశాన్నీ ప్రభావితం చేశారు. అందుకు అంబేడ్కర్ ఆంధ్రదేశ పర్యటన విశేషంగా దోహదం చేసింది. నందనార్ హరిశ్చంద్రుడు పట్టువదలని పూనికతో అంబేడ్కర్ 1942 సెప్టెంబర్ 28న ఆంధ్రప్రదేశ్ పర్యటనలో భాగంగా అనకాపల్లిలో అడుగుపెట్టారు. అప్పటికి ఆంధ్రదేశంలో దళిత నాయకులుగా ఉన్న ఈలి వాడపల్లి, పాము రామ్మూర్తి, కుసుమ ధర్మన్న, బొజ్జా అప్పలస్వామి వంటి వారు ఆ పర్యటనలో పాల్గొన్నారు. ఆ నలభయ్యో దశకంలో అంబేడ్కర్‌ను కనులారా చూసిన ఆ దళిత ప్రజలు నిజంగా అదృష్టవంతులు!

అయితే, అంబేడ్కర్ మరణించిన దశాబ్దాలకు గానీ ఆయన జీవితం, రచనలు చదివే అవకాశం తెలుగు దళితులకు దక్కలేదు. 1968లో మొదటి సారి యెండ్లూరి చిన్నయ్య రాసిన డా॥ అంబేడ్కర్ జీవిత చరిత్ర గ్రంథ రూపంలో వచ్చింది. అది దళితులకు ఆరాధ్య గ్రంథం అయింది. ఆ కాలంలోనే అంబేడ్కర్ రచించిన 'ఇన్హిలేషన్ ఆఫ్ క్యాస్ట్' గ్రంథానికి యెండ్లూరి చిన్నయ్య, బోయి భీమన్నల అనువాదాలు వచ్చాయి. ఆ తర్వాత అంబేడ్కర్ జీవిత చరిత్రను గ్రంథస్తం చేసిన వారిలో బి. విజయభారతి, అమూల్య శ్రీ, పి. అబ్బాయి. ఉదయకీర్తి వంటి వారున్నారు. అయితే, తెలుగునాట మొదటిసారిగా అంబేడ్కర్‌ను సాహిత్యంలో ప్రస్తావించిన ఘనత మహాకవి గుర్రం జాషువాకే దక్కుతుంది. 1947లో వెలువరించిన ఆయన కావ్యం గబ్బిలంలో రెండవ భాగంలో

*కల దంబేత్కరు నా సహోదరుడు మాకై యష్టకష్టాలకుం*
*బలియై, సీమకువోయి క్రమ్మరిన విద్వాంసుడు వైస్రాయి మే*
*ల్కొలవందుంగలదొడ్డవాఁడతఁడు నీకున్స్వాగతంబిచ్చి పూ*
*వుల పూజల్ పొనరించెనేయతని మెప్పుల్ నీజయారంభముల్*

అనే పద్యంలో గబ్బిలాన్ని అంబేడ్కర్ దీవెనలు అందుకోమంటారు. అంబేడ్కర్ చనిపోయినప్పుడు కూడా జాషువా 'నిర్యాణము' పేరుతో భారతి పత్రికలో కావ్య ఖండికను ప్రకటించారు. అప్పటి నుండి తెలుగు సాహిత్యంలో అంబేడ్కర్ శాశ్వత స్థానం సంపాదించుకున్నాడు. పద్యకావ్యాలు, శతకాలు, గేయాలు, వచన కవితలు, నాటకాలు, బుర్రకథలు, హరికథలు ఒకటేమిటి అన్ని ప్రక్రియల్లోనూ అంబేడ్కర్ ఆవిష్కరించబడ్డాడు. బోయి భీమన్న 'నమస్సుల్, డాక్టరంబేద్కరా!' మకుటంతో రాసిన అంబేడ్కర్ సుప్రభాతం, రాపాక ఏకాంబరం 'అంబేడ్కరో! సమరసింహా' చోడగిరి చంద్రరావు 'భీమరాయ శతకం', ముఖ్యంగా దళిత ఉపాధ్యాయవర్గాల నుండి వచ్చిన కవులు మల్లవరపు జాను, మల్లవరపు వెంకటరావు, బుంగా ఆడమ్‌బాబు, రాచమల్లు దేవయ్య, తోటకూర జార్జి, పలిమెల సుదర్శనరావు, గుర్రం ధర్మోజి, నక్కా అమ్మయ్య వంటి వారు అంబేడ్కర్‌కు పద్య నీరాజనాలు పలికారు.

ఇక గేయ సాహిత్యంలో భీమన్న రాసిన “జయ జయ జయ అంబేద్కర! జయ దళిత జనస్వర! జయమానవ మందారా! జయభారత భాస్కరా!” దళితుల జాతీయ గీతంగా ప్రసిద్ధికెక్కింది. చోడగిరి చంద్రరావు “డాక్టరో నీ నాయకత్వము లోకమంతయు మేలికొలిపెను”, “బాబా లేవా! లేవే లేవా” గేయాలు ఆంధ్రదేశాన్ని ఉద్రూతలూగించాయి. అరుణ్ శౌరి, రంగనాయకమ్మ వంటి వారు అంబేద్కర్ పై విషం చిమ్మడానికి ప్రయత్నించినప్పుడు దళిత సాహిత్యం నిప్పుల నాలుకలతో భగ్గున పైకి లేచింది. ప్రజాయుద్ధ నౌక గద్దర్ “అరె! అరుణశౌరిగో! నీకు ఆకలి బాధేం తెలుసు/ దోపిడీ కొడకో నీ రూపం తెలిసిపోయె / బ్రాహ్మనిజంలో విషం తప్ప నిజం లేదు/ అంబేద్కర్ ఎక్కడని లెక్కదీసి అడుగుతావా/ దిక్కులేని గుండెల్లో దీపమై వెలుగుతుండు” అని అంబేద్కర్ స్థానాన్ని గుర్తు చేశాడు. కవి, వాగ్గేయకారుడు గోరటి వెంకన్న “వైతాళికా! ఈ యుగము నీదిరా! బౌద్ధలికా! ఈ జగము నీదిరా!” అని వైతాళిక గీతాన్ని ఆలాపిస్తె, మరో పాటల మట్టి బిడ్డ జయరాజు “జాగోరే జాగో అంబేద్కర్/ జగజ్జన నేత అంబేద్కర్/ మా బల్లో టీచర్ అంబేద్కర్/ మా బతుకు ఫ్యూచర్ అంబేద్కర్” అని తమ బతుకు ఆశగా వర్ణిస్తాడు. దళిత కళామండలి స్థాపించి దశాబ్దాలుగా దళిత చైతన్యాన్ని రగిలిస్తున్న మాష్టార్జీ “అందుకో దండాలు బాబా అంబేద్కురా! అంబరాన ఉన్నట్టి సుక్కలు పొడవంగో గేయం ఆల్‌టైమ్ రికార్డు. పావన ప్రసాద్ దేశానికి రక్షణ కవచం/ అంబేద్కర్ తత్వం కాదా అని ప్రశ్నిస్తే, బోయి భీమన్న పాటలలో అంబేద్కరు పేరుతో ప్రత్యేకంగా ఒక గ్రంథాన్నే ప్రచురించారు.

దళిత సామాజిక సాహిత్యోద్యమాలలో భాగంగా ఎందరో కవులు వేలాది గేయాలను ఆలపించారు. శ్రమశ్రీ, భీమసేన, రాంచందర్, శుక్తి, భీమసేన, లెల్లె సురేశ్, సవేరా వంటి కవులు పదుల సంఖ్యలో అంబేద్కర్‌కు గేయ హారతి పట్టారు. వచన కవిత్వంలో అంబేద్కరిజాన్ని టాగ్ లైన్ చేసిన ఘనత మద్దూరి నగేష్ బాబుకు దక్కుతుంది. నగేష్ బాబు, ఖాజా సంపాదకత్వంలో వెలువడిన ‘విడి ఆకాశం’ కవితా సంకలనానికి ‘అంబేద్కరిస్టు ప్రేమ కవిత్వం’ అని పేరు పెట్టారు. ‘ఇంతలోనే నిన్నూ, నీ ఆకాశాన్నీ/ చిటికెన వేలితో కూలదోసిన ఆ మహానుభావుడు కనిపిస్తే, భుజాల మీద ఊరేగిస్తాను’ అని అన్యాపదేశంగా అంబేద్కర్‌ను ఆవాహన చేస్తాడు నగేష్ బాబు. ‘అతడు జాతిబువ్వ, అతడు వెలుగుతొవ్వ, అతడు పాలబువ్వ, అతడు నిప్పురవ్వ’ అని అంబేద్కర్ ఏమిటో గోరుముద్దల ద్వారా తెలియజేస్తాడు ఎండ్లూరి సుధాకర్. అంబేద్కరిస్టు కవిత్వాన్ని ముందుకు తీసుకెళ్తున్న మరొక కవి నేతల ప్రతాప్ కుమార్. ‘మహాత్ములూ వద్దు/ మావోలూ వద్దు / అంబేద్కరయ్యే మాకు ముద్దు’ అనీ, ‘అన్నంగిన్నెలో ఎప్పుడూ ఆ విగ్రహమమే కనబడుతుంది. అనీ అంటాడు అంబేద్కర్‌ను దళితుల అన్నంగిన్నెతో పోలుస్తూ.

అంబేద్కర్ విగ్రహాల మీద చెప్పుల దండలు వేయడం, విగ్రహాల్ని ధ్వంసం చేసే సంఘటనలపై దళిత కవులు తీవ్రంగా స్పందించారు. డా॥ ఖాజా అంబేద్కర్ మెడలో దండ వేయడం అంబేద్కర్‌ను అవమానించడం కాదు, చెప్పులను గౌరవించడం అని తిప్పి కొడతారు. కలేకూరి ప్రసాద్ “నీ పురుటి నొప్పులతో రాజ్యాంగాన్ని కాదు / తరాల స్వప్నాల్ని ప్రసవించావు/ నువ్వు మాకు తండ్రివా! తల్లివా’ అని అంబేద్కర్‌లో అమ్మతనాన్ని దర్శిస్తాడు. ‘నీ మెళ్లో చెప్పులేసే / చొట్టనాయాల్ని / నీ చూపుడు వేలికే

ఉరేస్తాం' అని దళితాగ్రహం ప్రకటిస్తాడు డా॥ గూటం స్వామి. అంబేడ్కర్ విగ్రహాన్ని చూస్తుంటే - రేపటి మహాసంగ్రామాన్ని కనులారా చూస్తున్నట్టే ఉందని సీహెచ్. రాం భావిస్తాడు. 'నువ్వే లేకపోతే/ జందెమేసుకున్న విశ్వవిద్యాలయాలు/ మాకింత చోటిస్తూ వణికిచచ్చేవి కావు" అని అగ్రహారాలుగా మారిన విశ్వవిద్యాలయాలను దళితులకు అందుబాటులోకి తెచ్చిన వైనాన్ని వివరిస్తాడు తుల్లిమిల్లి విల్సన్ సుధాకర్. డా॥ జి.వి. రత్నాకర్ 'తరాల/ యుగాల తలరాతల్ని / దండేనికి వేలాడేసిన పెద్దాయనగా' అంబేడ్కర్‌ను సంభావిస్తాడు. డా॥ బన్న అయిలయ్య నిప్పుకణికల్ని వెదజల్లుతూ 'వెల్తురు చిత్రపటం వెనక/ నిలువెత్తు ఆత్మగౌరవంలా/ నిలబడ్డ బాబాసాహెబ్" మూర్తిమత్వాన్ని దర్శింపచేస్తాడు.

అంబేడ్కర్‌ని వొదిలేసి కులనిర్మూలనకు పూనుకున్న సోకాల్డ్ ప్రగతివాదులకు 'అంబేడ్కర్‌ను మినహాయించి/అస్పృశ్యతను రూపుమాపడం/ ఎంతహాయి' అని పైడి తెరేష్ బాబు చురకలు అంటిస్తాడు. అంబేడ్కర్ జీవిత చరిత్రను కావ్యంగా మలచిన విరియాల లక్ష్మీపతి 'నేడు ప్రతి కూడలి మధ్యా అతడే / అవే మాటలు మౌనంగా/ జనసందేశమిస్తూ' అని అంబేడ్కర్ విగ్రహమే ఒక సందేశంగా అభివర్ణిస్తారు.

వీటితో పాటు అంబేడ్కర్ భావజాలంపై అనేక గ్రంథాలు వెలువడ్డాయి. ముఖ్యంగా డాక్టర్ కత్తి పద్మారావు అంబేడ్కర్ ఆలోచనా విధానాన్ని బుద్ధుడు, మార్క్స్ వంటి ప్రపంచ మేధావుల భావజాలంతో పోల్చి తులనాత్మకంగా విశ్లేషణలు చేశారు. దళిత సమస్య పరిష్కారానికి 'బుద్ధుడు చాలడు, అంబేడ్కర్ చాలడు, మార్క్స్ కావాలి' అని రంగనాయకమ్మ కక్కిన విషానికి విరుగుడుగా 'నరుడో భాస్కరుడో' అయిన శివసాగర్ 'సత్య' మూర్తియై 'అంబేడ్కర్ సూర్యుడు' గ్రంథంలో మధ్యందిన మార్తాండునిలా చెలరేగిపోయాడు. అంబేడ్కర్ పీపుల్స్ ఎడ్యుకేషన్ ట్రస్టు గత రెండు దశాబ్దాలకు పైగా అంబేడ్కర్ వర్ధంతి అయిన డిసెంబర్ 6న స్మారకోపన్యాసాలు ఏర్పాటు చేసి, వాటిని గ్రంథరూపంలో తెస్తోంది. ఇటీవల హైదరబాద్ బుక్ ట్రస్టు, నేషనల్ బుక్ ట్రస్టు వంటి సంస్థలు అంబేడ్కర్ భావజాలాన్ని అనువాదాల రూపంలో తెలుగులో అందించడం అభినందనీయం. అంబేడ్కర్ జీవిత చరిత్రను తెలుగులో చలనచిత్రంగా రూపొందించిన డాక్టర్ పద్మావతి దళితులకు గొప్ప ఉపకారం చేశారు. ఆ సినిమాకు డాక్టర్ సి. నారాయణ రెడ్డి అంబేడ్కర్ జీవితాన్ని ఉద్యమాన్ని ప్రతిఫలించే భావస్ఫోరకమైన గీతాల్ని అందించారు. పరిషత్తుల పోటీల ఊబిలోంచి బయటపడి, అంబేడ్కర్, జ్యోతిబా పూలే, సావిత్రీబాయి పూలే, ఝల్కారిబాయి వంటి ఇతివృత్తాలను స్వీకరించడం తెలుగు నాటకరంగ ఉన్నతిని తెలియజేస్తుంది. సౌదా అరుణల 'జాతిపిత అంబేడ్కర్', డాక్టర్ పాటిబండ్ల ఆనందరావు 'రాజగృహప్రవేశం' నాటకాలు రంగస్థలం మీద అటు ప్రయోగానికీ, ఇటు ప్రయోజనానికీ పెద్ద పీట వేశాయి. ఈ వ్యాసకర్త గతంలో సేకరించి సంకలించిన 500పుటల అంబేడ్కర్ పద్య, గేయ, వచన కవితా సంపుటి అముద్రితంగా ఉండిపోయింది. ఒక్కో ప్రక్రియలో ఇలాంటి ఒక్కో బృహత్తర సంపుటి రావలసిన అవసరం ఉంది. దళితకవులు, రచయితలు, మేధావులు, సంస్థలు ఆ దిశగా ప్రయత్నిస్తే భారతీయ సాహిత్యంలో తెలుగు సాహిత్యంపై అంబేడ్కర్ ప్రభావం, ఆయనకు అర్పించిన అక్షరనివాళి ఎంతగొప్పదో ప్రపంచానికి తెలుస్తుంది. జై భీమ్. ●

ప్రత్యేక కథనం

# తెలుగు కవిత్వం : యానాం



*బొల్లోజు బాబా, 98493 20443*

సాహిత్యపరంగా ఘనతవహించిన ఇంజరం, పిఠాపురం, రాజమండ్రి, కోనసీమ వంటి ప్రాంతాలనడుమ ఉన్న యానాం సహజంగానే ఆ వాసనలను పుణికిపుచ్చుకొంది. తెలుగు సాహిత్యానికి వన్నెతెచ్చిన సాహితీవేత్తలలో శ్రీ చెళ్ళపిళ్ల వెంకట శాస్త్రి ప్రముఖమైనవారు. వీరు పదేండ్ల వయసులో విద్యాభ్యాస నిమిత్తమై 'ఫ్రెంచి యానాం' వచ్చారు. 18 ఏండ్ల వయసులో ఉన్నప్పుడు యానాం వెంకటేశ్వర స్వామిపై వ్రాసిన శతకంలో వ్యాకరణ దోషాలున్నాయని స్థానిక పండితులు విమర్శించటంతో, పౌరుషం వచ్చి వారణాసి వెళ్ళి సంస్కృత వ్యాకరణాన్ని నేర్చుకొని వచ్చారట. తరువాత వీరు కాకినాడకు మకాం వెళ్లిపోయారు. యానాంలో పనిచేసిన విదేశస్థులలో సొన్నరెట్ మినహా ఎవరూ రచనా వ్యాసంగాన్ని నెరపినట్లు తెలియరాదు.

1908లో జన్మించిన గెల్లా శ్రీనివాసరావు మంచి కవి. తను వ్రాసిన కవితలను దేవులపల్లి కృష్ణశాస్త్రికి చూపినపుడు ఆయన వాటిని ఎంతగానో మెచ్చుకొని ప్రశంసించేవారట. 1932లో జన్మించిన బొల్లోజు బసవలింగం గారు చిన్నవయసులోనే వ్రాసిన "రాణి దుర్గావతి" అనే పద్యకావ్యం పలువురి పండితుల ప్రశంసలు పొందింది. తదుపరి వీరు అనేక నాటకాలు వ్రాసారు. శ్రీమతి పంతగడ శేషమ్మ గారు యాభై సంవత్సరాల క్రితమే టాగోర్ గీతాంజలి, ఫ్రూట్ గేదరింగ్ పుస్తకాలను తెలుగులోకి అనువదించిన గొప్ప ప్రతిభావంతురాలు. వీరి భర్త కీ.శే. పంతగడ బాలకృష్ణ రాసిన సాహిత్యవ్యాసాలు భారతి పత్రికలో వచ్చేవి.

ఫ్రెంచి యానాంలో పండితులకు, విద్వాంసులకు కొదవలేదు. ఇంద్రగంటి విశ్వపతి శాస్త్రి, సమతం కృష్ణయ్య, మహేంద్రవాడ వీర గణపతి శాస్త్రి, వంటెద్దు సుబ్బారాయుడు, శ్రీమతి కందర్ప వెంకట నరసమ్మ వంటి వారు గొప్ప పాండిత్య ప్రకర్షను ప్రదర్శించేవారు. టి. శ్రీరామచంద్రకీర్తి గారు "వెంకటేశ్వర శతకం" వ్రాసారు. యానానికి సమీపాన గల కరప గ్రామానికి చెందిన కోట్ర శ్యామల కామశాస్త్రి కూర్చిన "ఆంధ్ర వాచస్పత్యం" అనే బృహత్ నిఘంటునిర్మాణం ఆర్థిక కారణాల వల్ల మధ్యలో ఆగిపోయినపుడు 1940లలో యానాం ప్రజలు భూరి విరాళాలు ఇచ్చి ముందుకు నడిపించి తమ సాహిత్యాభిలాషను చాటుకొన్నారు.

ఇక ఆధునిక తెలుగు సాహిత్యరంగానికి యానాం కవులు అందించిన తోడ్పాటు తక్కువేమీ కాదు. శిఖామణి, దాట్ల దేవదానం రాజు, కె. విజయలక్ష్మి, పి.ఎల్.ఆర్. స్వామి, చెల్లి రాం, బొల్లోజు బాబా, ముమ్మిడిశ్రీ నాగవరప్రసాద్, పొనుగుమట్ల అశోక్ కుమార్ లాంటి యానాం కవులు చేస్తున్న కృషి తెలుగు కవిత్వచరిత్రలో కొన్ని పుటలను సొంతం చేసుకొన్నదనటంలో అతిశయోక్తి లేదు.

**శిఖామణి:** సమకాలీన తెలుగుకవులలో శిఖామణి మేరుసమానుడు. వీరి మొదటి కవితా సంపుటి "మువ్వల చేతికర్ర" 1987లో వెలువడింది. ఇది తెలుగుసాహితీ లోకంలో అప్పట్లో ఒక సంచలనం. అప్పటివరకూ వచ్చిన అనుభూతి కవిత్వాన్ని శిఖామణి కవిత్వం భూమార్గం పట్టించింది. సామాజిక వాస్తవికతను, వైయక్తిక అనుభూతుల నేపథ్యంలో కరుణ రసార్ద్రంగా ఆవిష్కరించటం శిఖామణి కవిత్వ విశిష్టత. ఉపమను ఇంత అందంగా, లోతుగా, విస్తృతంగా వాడుకొన్న మరొక ఆధునిక కవి కనిపించరు. శిఖామణి ఇంతవరకు చిలక్కొయ్య, కిర్రుచెప్పుల భాష, నల్లగేటు నందివర్ధనం చెట్టు, తవ్వకం, గిజిగాడు, పొద్దున్నే కవిగొంతు మొదలైన కవిత్వసంపుటులు వెలువరించారు. తన సాహిత్య గురువు కందర్ప వెంకకట నరసమ్మ గారు తనకు తెలియకుండా యానాం వదలివెళ్ళిపోయిన విషయం తెలుసుకుని 'యానాం సరస్వతి' కవిత, రీజెన్సీ కర్మాగారంలో విధ్వంసం జరిగినపుడు 'యానామా నా ఆరోప్రాణమా' వంటి కవితలు రాసారు. స్థానీయతను పట్టి యిచ్చే మురమళ్ల పడవలరేవు, పులస చేప స్వగతం వంటి కవితలు శిఖామణి మాత్రమే రాయగలరు అనిపించేంత ఆర్ద్రంగా ఉంటాయి.

దళిత సాహిత్యతత్వం, వివిధ, సమాంతర, తెలుగు-మరాఠీ దళిత కవిత్వం, వాగర్థ, సేతువు, స్మరణిక వంటి అనేక సాహిత్యవిమర్శనాగ్రంథాలను రచించారు. శిఖామణి కవిత్వాన్ని "సెలెక్టెడ్ పొయెమ్స్" పేరుతో వేగుంట మోహన ప్రసాద్ ఇంగ్లీషులోకి అనువదించారు. ఎంపిక చేసిన కవితలను హిందీలోకి "ఘంఘ్రూవాలి ఛడీ" పేరుతో డా. ఎం. రంగయ్యగారు, మళయాళంలోకి ఎల్.ఆర్. స్వామి గారు, కన్నడంలోకి వీరభద్రగౌడ్ గారు భాషాంతరీకరణ చేసారు. తెలుగులో మొదటిసారిగా 'అమ్మ' కవితలను సంకలనం చేసారు. 'అంబేద్కర్' శకం కవితల సంకలనం ముద్రణకు సిద్ధంచేసారు. దళిత కవిగా స్పందించాల్సిన సందర్భాలలో స్పందిస్తూనే, విశ్వమానవ కవిగా శిఖామణి తన కవిత్వం, విమర్శ, పీఠికలు, ఉపన్యాసాల ద్వారా తెలుగు కవిత్వాన్ని సుసంపన్నం చేస్తున్నారు. 2006లో యానాంలో శిఖామణి సాహితీ రజతోత్సవం ఘనంగా నిర్వహించారు. ఈ సందర్భంగా 'మువ్వల చేతికర్ర' ద్వితీయ ముద్రణ పొందింది. వీరు ఆంధ్రదేశంలో దాదాపు అన్ని సంస్థలనుండి పురస్కారాలను, సత్కారాలను పొందారు. వీటిలో - ఫ్రీవర్స్ ఫ్రంట్ అవార్డు, ఉమ్మడిశెట్ట సాహితీ పురస్కారం, తెలుగు విశ్వవిద్యాలయం సాహితీపురస్కారం, సినారె, నేదునూరి సాహిత్య పురస్కారాలు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ జాషువా పురస్కారం ప్రముఖమైనవి. ప్రస్తుతం యానాం కేంద్రంగా స్వీయసంపాదకత్వంలో "కవిసంధ్య" ద్వైమాసిక కవిత్వ పత్రికను నడుపుతున్నారు.

**దాట్ల దేవదానం రాజు:** 1997లో "వానరాని కాలం"తో కవిగా సాహితీలోకంలో ప్రవేశించి 2002లో "దాట్ల దేవదానం రాజు కథలు" పేరుతో కథల సంపుటి తీసుకొచ్చి తన కలానికి రెండువైపులా పదును అని నిరూపించుకొన్న కవి, రచయిత దాట్ల దేవదానం రాజు. ఇటు కవిత్వాన్ని అటు కథలను చక్కని శైలితో, లోతైన ఆలోచనలతో వెలువరిస్తూ నేడు ఆంధ్రదేశం గర్వించదగిన స్థాయికి చేరి తన యశస్సుతో యానానికి వన్నెతెచ్చిన నిత్య సాహిత్య కృషీవలుడు. యానాం సందర్శించే సాహితీ ప్రియులపాలిట చలివేంద్ర దేవదానంరాజు. నిర్మలమైన భావధార, చిక్కని అనుభూతి, ఇజాలతో సంబంధం లేని జీవన స్పర్శలు, తేటగా కనిపిస్తూనే లోతుగా తాకే వాక్యాలు దేవదానం రాజు కవిత్వ లక్షణాలు. యానాం సామాజిక, చారిత్రిక నేపథ్యంతో వ్రాసిన "యానాం కథలు", "కల్యాణపురం" కథాసంపుటుల ద్వారా దేవదానం రాజు తెలుగుసాహిత్యంలో యానానికి మంచి గుర్తింపు తెచ్చిపెట్టారు.

2013లో 'కథాయానాం' పేరుతో దేవదానంరాజు గౌతమీ నదిలో బోటులో నిర్వహించిన కథా సదస్సు విశేష మన్ననలను పొందింది.

గుండెతెరచాప, మట్టికాళ్ళు, ముద్రబల్ల, లోపలిదీపం, నదిచుట్టూ నేను, నాలుగోపాదం, పాతం పూర్తయ్యాక, దోసిలిలో నది వీరి ఇతర కవితాసంపుటాలు. నాలుగోపాదం తమిళం, కన్నడం, మలయాళం, ఫ్రెంచి భాషలలోకి అనువదింపబడి మంచి పేరుతెచ్చుకొంది. పుదుచ్చేరి ప్రభుత్వం నుంచి కళైమామణి, తెలుగురత్న పురస్కారాల్ని అందుకొన్నారు. దాట్ల దేవదానం రాజు సాహితీ సంస్థను స్థాపించి "దాట్ల సాహితీ పురస్కారాలు" పేరుతో సాహిత్య పురస్కారాలను ఏర్పాటు చేసి ప్రతి ఏటా ఒక ఉత్తమ కవికి, కథకునికి పురస్కారాలు అందిస్తున్నారు.

**శ్రీమతి కె. విజయలక్ష్మి:** చక్కని కవిత్వం, మేలైన అనువాదాలతో శ్రీమతి కె. విజయలక్ష్మి తెలుగు సాహిత్యాన్ని పరిమళింపచేస్తున్నారు. వీరు 2005లో "కదిలేమేఘం" పేరుతో కవితాసంపుటి తీసుకొచ్చారు. ప్రముఖ తమిళకవి అమృత గణేషన్ పుస్తకాన్ని "ఊయలలో సూర్యుడు"గా తెలుగులోకి అనువదించారు. విజయలక్ష్మి కవిత్వంలో సందేశాత్మక సామాజిక ప్రయోజనం అంతర్లీనంగా కనిపిస్తుంది. బలహీనవర్గాలపట్ల సహానుభూతి, సమాజపోకడలపై తనదైన వ్యాఖ్యానం, లోతైన వివేచనతో కూడిన హృదయసంస్కారం వీరికవిత్వ లక్షణాలుగా చెప్పుకోవచ్చు. స్త్రీవాదదృక్పథంతో ప్రత్యేకించి కవితలు వ్రాయకపోయినా వీరికవిత్వంలో స్త్రీవాదం స్వాభావికంగా పలుకుతుంది. వృత్తిపరంగా తెలుగు అధ్యాపకురాలు కావటంతో వీరి కవిత్వం చక్కని పదచిత్రాలు, ఉపమానాలు, భాషాగరిమ, భావప్రతిమలతో ఉంటూ అలరిస్తుంది. 'కరుణకుమార' కథల్లో దళిత జీవనచిత్రణ అంశంపై శిఖామణి పర్యవేక్షణలో పరిశోధన చేసి ఎం.ఫిల్. పట్టా పొందారు.

**పి.ఆర్.ఎల్. స్వామి:** పి.ఆర్.ఎల్. స్వామి 2005లో "పొత్తిళ్ళలోంచి" తొలి కవితాసంపుటి వెలువరించారు. తరువాత "కాయితం పడవ" పేరుతో హైకూల సంపుటి తీసుకొచ్చారు. "గుమ్మం తెర" "స్వామినీలు" అనే రెండు పుస్తకాలు ప్రస్తుతం ముద్రణలో ఉన్నాయి. ఎటువంటి సిద్ధాంతపోకడలకూ పోకుండా తనదైన శైలిలో సామాజికాంశాలను భావవ్యక్తీకరణ చేయటం స్వామి కవిత్వరీతి. పుదుచ్చేరి

ప్రభుత్వం నుంచి కళైమామణి, తెలుగురత్న పురస్కారాల్ని పొందారు. వచన కవితాధారణ స్వామి ప్రత్యేకత. వివిధ కవుల వందలాది కవితలను ధారణ చేసి భావయుక్తంగా ఆశువుగా చదువుతూ, శ్రోతలను మంత్రముగ్ధులను చేస్తారు. ఓలేటి పార్వతీశం గారి ప్రోత్సాహంతో దూరదర్శన్‌లో కూడా చాలాసార్లు ప్రదర్శనలు ఇచ్చారు. ఈ రంగంలో వీరు చూపించిన ప్రతిభకు గుర్తింపుగా "వచన కవితధారణా చక్రవర్తి" అన్న బిరుదును పొందారు. ఇతరుల కవితలను ధారణావధానాలు చేస్తూ, కలకాలం నిలిచిపోయే చక్కని మృదువైన కవిత్వం వ్రాస్తూ స్వామి తన అసమాన ప్రతిభతో తెలుగు సాహితీలోకంలో సుస్థిరమైన స్థానం సంపాదించుకొన్నారు.

**చెల్లి రాం:** సిహెచ్. రాం "కొయిటా అమ్మకు కన్నీటి ఉత్తరం" పేరుతో 2008లో కవితా సంకలనం తీసుకువచ్చారు. పదునైన అభివ్యక్తి, నిశితమైన పరిశీలన, వాక్యవాక్యానా కనిపించే దళిత దృక్పథం రాం కవిత్వానికి చక్కని గుర్తింపు తెచ్చాయి. అంబేద్కరిజాన్ని కవిత్వంలో ప్రతిభావంతంగా ప్రకటించే తెలుగు కవిత్వాన్ని ఎంచవలసి వచ్చినప్పుడు రాం కవిత్వాన్ని ఎవరూ విస్మరించలేరు. అనాది గాయాల సలపరింతలను పిక్కటిల్లే గొంతుకతో రాం కవిత్వం ఎలుగెత్తినా అంతర్లీనంగా కరుణనిండిన తడేదో గుండెను తడుముతూంటుంది. ఆ విలక్షణతే - ఒక్క పుస్తకం మాత్రమే తీసుకొచ్చినా రాం కవిత్వానికి తెలుగు సాహిత్యంలో గుర్తుంచుకునే స్థానాన్ని కల్పించింది. రాం తన కవిత్వ గానాన్ని మరిన్ని సంపుటాలుగా విస్తరింపచేస్తాడని ఆశిద్దాం.




**బొల్లోజు బాబా:** 2009లో "ఆకుపచ్చని తడిగీతం"గా తెలుగు సాహితీలోకంలోకి ప్రవేశించాడు బొల్లోజు బాబా. శిఖామణి సాంగత్య ప్రభావం తనపై ఉందనే బొల్లోజు బాబా - 2016లో "వెలుతురు తెర" పేరుతో స్వీయ కవితా సంపుటి, టాగోర్ స్ట్రే బర్డ్స్‌ను అనువదించి "స్వేచ్ఛా విహంగాలు"గా తీసుకు వచ్చాడు. వివిధ ప్రపంచ కవుల కవితానువాదాలు, కవిత్వ పరిచయాలు, విమర్శనా వ్యాసాలతో తనకంటూ ఒక గుర్తింపుని తెచ్చుకొంటున్నాడు.

**ముమ్మిడి చిన్నారి:** ముమ్మిడి శ్రీ వీరనాగ ప్రసాద్ (చిన్నారి) మంచి భావనా పటిమ కలిగిన కవి. అతని కవిత్వంలో అభివ్యక్తి సూటిగా, శైలి సరళంగా, పదచిత్రాలు నూతనంగా ఉంటాయి. స్వతహాగా చిత్రకారుడు కావటంతో ఇతని కవిత్వంలో భావచిత్రాలు అందంగా కొత్తవర్ణనల వర్ణాలతో అలరిస్తాయి. కవితకు అనూహ్యమైన ముగింపు నివ్వటం చిన్నారి కవిత్వలక్షణం. ఇతని డైరీలలో కొన్ని వందల హైకూలు ఉన్నాయి. పేరుగాంచిన ప్రముఖ హైకూ కవుల హైకూలకు ఏమాత్రమూ తీసిపోవవి. ఓ రెండు కవిత్వ సంపుటులకు సరిపడా చక్కని, చిక్కని కవితలున్నాయి. పొగ త్రాగటానికి వ్యతిరేకంగా వ్రాసిన అద్భుతమైన "హైకూ శతకం" ఇతని డైరీలో నిద్రిస్తుంది. ప్రతీ హైకూ "నో స్మోకింగ్ బోర్డు"కు

చక్కని ప్రత్యామ్నాయంగా వాడుకోదగ్గది. త్వరలో తన కవిత్వాన్ని చక్కని సంపుటిగా తీసుకువస్తాడని భావిద్దాం.

**పొనుగుమట్ల అశోక్ కుమార్:** అశోక్ కవిత్వంలో సామాజిక స్పృహ సహజధారలా ప్రవహిస్తుంది. లోకంలో కనిపించే అన్యాయాలు, రాజకీయ వికృత క్రీడలపై అశోక్ కుమార్ కలం నిప్పుల వర్షం కురిపిస్తుంది. లోతైన భావనలను గొప్ప పొదుపుతో అక్షరాలలోకి వొంపి అందిస్తాడు. అశోక్ కవిత్వం ఆవేశపరుస్తుంది. ఆలోచింపచేస్తుంది. ఒక సామాజిక మార్పుకు ప్రేరణగా నిలుస్తుంది. సామాజిక అనుభవాన్ని కవిత్వం చేయటంలో అశోక్ గొప్ప పరిణితి సాధించాడు. జిల్లాలో జరిగే పలువేదికలలో తన గళాన్ని, దృక్పథాన్ని బలంగా వినిపించే యానాం కవి అశోక్ కుమార్.

డా॥ వరుగు భాస్కర్ రెడ్డి సంజీవ్ దేవ్ సాహిత్యంపై డాక్టరేట్ చేసి యానాం ప్రభుత్వ డిగ్రీ కాలేజిలో తెలుగు అధ్యాపకులుగా పనిచేస్తున్నారు. కవిసంధ్య పత్రికకు వర్కింగ్ ఎడిటర్‌గా, మంచి పద్యం శీర్షిక నిర్వాహకుడుగా కవిసంధ్య సభలకు ప్రధాన కేంద్రంగా నిలుస్తున్నాడు. మధునాపంతుల సోదరులు, కొందూరి రామరాజు, నృశింహదేవ శ్రీనివాస శర్మ, మొహిబుల్లా ఖాన్, చెల్లపిళ్ల వెంకట శాస్త్రి, ఐ.ఎస్. గిరి తదితర ప్రభృతులు యానాంలో జరిగే సాహితీకార్యక్రమాలలో పాల్గొంటూ ఆయా సభలను దిగ్విజయం చేస్తున్నారు. శ్రీ పొనుగుమట్ల విష్ణుమూర్తిగారు "జనమిత్ర" పత్రిక సంపాదకుడిగా, రచయితగా, అనువాదకునిగా తెలుగుసాహిత్యానికి తమవైన సేవలు అందిస్తున్నారు. ఎనభైలలో కీ.శే. చింతకాయల బాలకృష్ణ "ఈ వేళ" పేరుతో ఒక పత్రిక నడిపారు. (ఈ వ్యాసకర్త మొదటి రచన అందులోనే ప్రచురింపబడింది). కీ.శే. చెల్లి కృష్ణమూర్తి గారి మనవడు చెల్లి సురేంద్రదేవ్ ఇప్పుడిప్పుడే చక్కని కవిగా పేరుతెచ్చుకొంటున్నాడు. యానాం నుంచి యువకవులు రావాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ప్రస్తుతం శిఖామణి, దాట్ల దేవదానం రాజు చేస్తున్న సాహిత్యకృషి, యానాంలో వీరు జరుపుతున్న జాతీయస్థాయి సభలు, కవిసంధ్య పత్రిక నేటి యువతరానికి ప్రేరణగా నిలిచి మరింతమంది యువకవులు తయారవుతారని ఆశిద్దాం.

**'యానాం చరిత్ర' పుస్తకాలు:** దాట్ల దేవదానంరాజు విస్తృతమైన అధ్యయనం చేసి "యానాం చరిత్ర" పేరుతో యానాం చారిత్రక, సామాజిక, రాజకీయ స్థితిగతులను గ్రంధస్థం చేసారు. ఆనాటి అనేక అరుదైన ఛాయాచిత్రాలు వీరీ పుస్తకంలో పొందుపరిచారు. బొల్లోజు బాబా "యానాం విమోచనోద్యమం", "ఫ్రెంచి పాలనలో యానాం" పుస్తకాల ద్వారా యానాం వలసపాలనా చరిత్రను వెలికితీసారు. శ్రీమతి కె. విజయలక్ష్మి "పుదుచ్చేరి ఒక చారిత్రిక విజ్ఞాన కరదీపిక" పేరుతో పుదుచ్చేరి, మాహె, కారైకాల్, యానాంల చరిత్రను సంక్షిప్తం గా పుస్తకరూపంలోకి తెచ్చారు. ఈ పుస్తకాలు యానాం చారిత్రిక ప్రాధాన్యతను, విశిష్టతను సమగ్రంగా అధ్యయనం చేయటానికి దోహద పడతాయి.

కవిసంధ్య

**జీవకవిత్వం జిందాబాద్!**

కవిసంధ్య పత్రిక అందుకోగానే అక్కున చేర్చుకున్న కవులకు, కవితా ప్రియులకు, సాహిత్యాభిమానులకు వినమ్రపూర్వక నమస్కారాలు! కవిసంధ్యకు ఇబ్బడి ముబ్బడిగా రచనలు పంపిన, పంపుతున్న కవులు, రచయితలు, విమర్శకులకు కృతజ్ఞతలు. కవిసంధ్యకు ఆర్థికంగా చేయూతనిస్తున్న వదాన్యులకు శత వందనాలు. తమ సుహృల్లేఖల ద్వారా కవిసంధ్యను ఆశీర్వదించి అభినందిస్తున్న పెద్దలకు, మిత్రులకు ధన్యవాదాలు. – సంపాదకవర్గం

## బొజ్జా తారకం గారికి నివాళి



(1939-2016)

**బొజ్జా తారకం ప్రముఖ పౌరహక్కుల నాయకుడు, న్యాయవాది, రచయిత, కవి. 1985 కారంచేడు దళితుల ఊచకోత నుండి, అంతకుముందు దళిత హక్కుల కోసం గొంతెత్తి నినదించిన వాడు. అంబేద్కర్ మీద వచ్చిన పద్య, గేయ, వచన కవితలను శిఖామణి సంకలించి సంపాదకత్వం వహించిన 'అంబేద్కర్ శకం' సంకలన గ్రంథానికి 2007లో తారకం 'జయభేరి' పేరున రాసిన పీఠిక ఇది. ఆయనకు నివాళిగా ఈ అముద్రిత పీఠికను కవిసంధ్య అందిస్తుంది.**

**- సంపాదకులు**

# జయభేరి

'అంబేద్కర్ శకం' పేరుతో ఒక దళిత కవితా సంకలనాన్ని తీసుకురావటం అభినందనీయమైన విషయం. ఇందులో పాటల్ని ఎక్కువగా చేర్చినట్టు కనబడుతున్నది. అది ఇంకా సంతోషించ దగినది.

ఏదో ప్రేరణ లేకుండా కవిత్వం రాదు. అలాగే ఏదో ఒక ఊపు, ఆవేశం రానిదే పాటా రాదు. కవి, తాను ఒక్కడే కూర్చుని తన మేధస్సుతో మెదిలిన ఏదో ఆలోచనకు అక్షర రూపం ఇస్తున్నాననుకుంటాడు. కాని అది కానేకాదు. అతని మెదడులో మెరిసిన మెరుపు, ఎందరివో ఆవేదనల బాధల మేఘాల కదలికల్లో, ఘర్షణల్లో వచ్చినవే.

అలాగే పాట కూడా. పాట పదిమందిదీ. మొదట్లో వచ్చిన పాటలన్నీ పదిమంది గొంతుకల్లో కదిలిన మాటలే. నడకలో అడుగు అడుగూ వేస్తూ కదులుతున్నట్టుగా పాట కూడా కదులుతుంది. ఒకరి తర్వాత ఒకరు అందిస్తారు. అందిపుచ్చుకుంటారు. ఏ కదలికలో అయినా లయ ఉంటుంది. లయ లేకపోతే ఏదీ ముందుకు సాగదు. ఎద్దులలాగే బండి అయినా, తెడ్లు నడిపే పడవ అయినా! ఒక పనిలో పదిమందీ కలిసి ఆడుకున్న మాటలే పాటలు. పాట పదిమందిదీ! రాసిన వాని దగ్గరే మిగిలిపోతే అది పాట కానేకాదు.

'అంబేద్కర్ శకం'లో చేరిన పాటలు ఇప్పటికీ ఎన్నోవేల గొంతుకల్లో మార్మోగుతున్నవే! గుండె గొంతుకలోనే కొట్లాడుతూ ఉండిపోయినవి కావు. గుండె గొంతులు చీల్చుకొని ఖణేలుమంటూ నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ వెళ్ళిపోయినవే! ఈ పాటలు నిశ్శబ్దాన్ని మాత్రమే చీల్చుకుంటూ వచ్చినట్టివి కావు. నిశ్శబ్దాన్ని, అసమానతను, అవమానాలను, దోపిడీనీ, దౌర్జన్యాన్ని చీల్చుకుంటూ సమతా మానవతా స్థాపనకు కోట్లాది గొంతుకల్లో మారుమ్రోగుతూ ఉన్నట్టివి. అందుకే వీటికి ఒక ప్రత్యేకత.

అంబేద్కర్‌పై కవిత రాసినా, పాటలు పాడినా అవి ఏదో సహస్ర నామ సంకీర్తనలాగానో, వెంకటేశ్వర సుప్రభాతం లాగానో ఉండవు. అంబేద్కర్ గురించి రాయటమంటే సమానత్వం గురించి రాయటం, మానవత్వం గురించి పాడటం! కవికి కలలో కనిపించి నాపై కవిత్వం రాయమని ఎవరో అడిగితే రాయటమో లేదా తనకేదో వ్యక్తిగత ప్రయోజనం కలిగించారు కాబట్టి రాయటమో కాదిది.

కోట్లాది జీవితాలలో కాంతిరేఖలు వెదజల్లిన ఒక మహాశక్తి గురించి రాయటం! ఒక విస్ఫోటకమైన ప్రేరణ గురించి రాయటం!

మనకు మిగిలిన కవిత్వమంతా మానవ ప్రయోజనాన్ని కాంక్షించి, ఆ పోరాటాలలో ప్రేరణ పొంది రాసిన కవిత్వమే! ఫ్యూడల్ వ్యవస్థకు బూర్జువా వ్యవస్థకు పెట్టుబడిదారి విధానానికి వ్యతిరేకంగా రాసిన కవిత్వమే సమాజాన్ని ప్రభావితం చేసింది, సమాజాన్ని మార్చటానికి సహకరించింది. ఇది ఒక ఎత్తు అయితే బానిసత్వంపై చేసిన తిరుగుబాట్లు, కుల వ్యవస్థ కూల్చటానికి చేసిన ప్రయత్నాల గురించి కవిత్వం చెప్పటం, పాట పాడటం మరొక ఎత్తు. సప్త సముద్రాల మధ్య ఎగసిపడుతున్న కెరటాలలా అటు నల్లవారూ, ఇటు తెల్లవారూ, ఇటు దళితులూ కోట్లాది గొంతుకలలో ఒకే స్వరం ఒకే లయతో నలుదిక్కులా మారుమ్రోగిస్తున్న పాటలు ఇవన్నీ. అందుకే ఇది ప్రత్యేకం. ఇది సాటిలేనిది. అటువంటి సాటిలేని మేటి సమతా వీరునికి అంజలి ఘటిస్తూ కదులుతున్న కోట్లాది మాటలలో మనకు వినిపిస్తున్నవి కొన్ని మాత్రమే! అలలను లెక్క పెట్టటం సాధ్యంకానట్టుగానే అంబేద్కర్ స్ఫూర్తితో లేచిన పోరాటాల ఆరాటాల వెల్లువను నిలువరించటమూ కష్టమే.

కవిత్వం రాజకీయాలకు అతీతం అనే మాట అబద్ధం. ప్రతి కవిత్వం వెనుకా, ప్రతి పాట వెనుకా రాజకీయం ఉంది. తాను ఎవరి వైపూ కాదని బుకాయించటానికి ప్రయత్నిస్తున్న కవి ఎవరైనా ఖచ్చితంగా దోపిడిదారులను సమర్థిస్తున్నట్టే! తానెవరివైపున నిలబడి ఉంటాడో చెప్పటం నిజాయితీ! మేము సమానత కోసం పోరాటం చేస్తున్న వారి వైపున నిలబడ్డాం, మానవత్వ స్థాపనకోసం ఉద్యమిస్తున్న వారివైపు నిలబడ్డాం అని చెప్పటం నిజాయితీ. ఈ సంకలనంలో ఉన్న వారంతా తామెటువైపున ఉన్నారో స్పష్టంగా చెప్పారు. జనంవైపు ఉన్నారు కాబట్టి జనంలో కలిసిపోయి జనం పాటలు పాడుతున్నారు.

ఇపుడు మనం వింటున్న పాటలు "మార్చింగ్ సాంగ్స్" లాంటివి. యుద్ధం కోసం సన్నద్ధం చేసేవి. ఇపుడు మనం చేస్తున్నది కవాతు మాత్రమే. సైనిక కవాతు యుద్ధం కాదు, యుద్ధంకోసం సన్నద్ధం. అసమానతకు, అవమానాలకు, అమానవీయత, అన్యాయాలకు వ్యతిరేకంగా చేయవలసిన యుద్ధానికి సన్నద్ధం. ఈ సన్నద్ధానికి ప్రోత్సాహకరమైనవి ఈ పాటలు, ఈ భేరీలు! అసలు యుద్ధం కోసం జనం వేరే ఆయుధాలు సమకూర్చుకుంటారు. పాటలైనా, భేరీలైనా, ఆయుధాలైనా అన్నీ జనం లోనుంచే వస్తాయి. అవే పదునైనవి. వాటిలో కొన్నింటిని ఏరుకుంటున్న ప్రయత్నమే ఈ సంకలనం! ప్రయత్నం అభినందనీయమే! ఈ బృహత్ సంకలనానికి సంపాదకులు శిఖామణి అభినందనీయులు.

**('అంబేద్కర్ శకం' 2017 ఏప్రిల్ 14న అంబేద్కర్ 126వ జయంతి సందర్భంగా ఆంధ్రప్రదేశ్ దళిత రచయితల సంఘం పక్షాన ముద్రించబడి, ఆవిష్కరించబడుతుంది.)**

**1 జులై 2007, హైదరాబాద్**

# హిందీ కవిత్వం - కేదార్ నాథ్ సింగ్



అనువాదం: గాలి నాసరరెడ్డి

కేదార్‌నాథ్ సింగ్ 1934లో ఉత్తరప్రదేశ్‌లో చకియా అనే గ్రామంలో జన్మించాడు. బెనారస్‌లో చదువుకున్నాడు. కళాశాలల్లో హిందీ అధ్యాపకుడిగా, ప్రిన్సిపాల్‌గా; గోరఖ్‌పూర్ విశ్వవిద్యాలయం (గోరఖ్‌పుర్)లో, జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం (కొత్త ఢిల్లీ)లో హిందీ ఆచార్యుడిగా పనిచేశాడు.

1952 ప్రాంతంలో కవిత్వం రాయడం ప్రారంభించిన కేదార్‌నాథ్ సింగ్ 1960లో అజ్ఞేయ సంపాదకత్వంలో వెలువడ్డ 'తీస్‌రా సప్తక్' సంకలనంలో చోటుచేసుకున్నాడు. అభీ బిల్‌కుల్ అభీ, యహా సే దేఖో, అకాల్ మే సారస్, సృష్టి పర్ పహరా మొదలైన కవితా సంపుటుల్నీ, కల్పనా ఔర్ ఛాయావాద్, మేరే సమయ్ కే శబ్ద్ వంటి విమర్శ గ్రంథాల్నీ వెలువరించాడు. 'ఆధునిక్ హిందీ కవితా మే బింబవిధాన్ కా వికాస్' అనేది ఆయన పిహెచ్.డి. సిద్ధాంత గ్రంథం.

కేదార్‌నాథ్ సింగ్ తెలుగు దళిత కవిత్వం గురించీ, జాషువా, అజంతాల గురించీ రాసిన వ్యాసాలు 'కబ్రిస్తాన్ మే పంచాయత్' అనే పుస్తకంలో కనిపిస్తాయి.

సాహిత్య అకాడమీ పురస్కారం (1989), జాషువా కవితా పురస్కారం (1997), జ్ఞానపీఠ పురస్కారం (2013) మొదలైన పలు పురస్కారాలు ఆయనకు లభించాయి.

కేదార్‌నాథ్ సింగ్ ఒక కవితలో ప్రపంచం చెయ్యిలాగా వెచ్చగా, అందంగా ఉండాలని ఆశించాడు. ఆయన కవిత్వం చెయ్యిలాగే వెచ్చగా, అందంగా ఉంటుంది.

### చలికి మరణించవు పదాలు

చలికి మరణించవు పదాలు
అవి తెగువలేమితో మరణిస్తాయి
తరచుగా వాతావరణంలోని తేమతో
మరణిస్తాయి.

ఒకసారి నాకు
ఎర్రని పక్షి వంటి పదం
తారసిలింది మా పల్లెటూరి నది
ఒడ్డున చిత్తడి నేలలో
దాన్ని ఇంటికి తీసుకొచ్చాను
కానీ గడప చెంతకు రాగానే
నాకేసి
ఒక వింత బెదురుచూపు చూసింది
తుది శ్వాస విడిచింది.

అప్పటి నుంచి నాకు పదాలంటే భయం
పట్టుకుంది
అవి తారసిలినపుడు తరచుగా
తప్పుకుపోయేవాణ్ని
ఏదైనా తళుకుబెళుకుల రంగురంగుల రోమశ
పదం
నా వైపు రావడం చూసినప్పుడు
తరచుగా కళ్లు మూసుకునేవాణ్ని

తర్వాత మెల్లమెల్లగా ఈ ఆటలో
నాకు సంతోషం కలగడం మొదలైంది

ఒకరోజు అకారణంగా
ఒక అందమైన పదాన్ని రాయితో కొట్టాను
ఎండువరిగడ్డిలో
అది పాములాగా దాగివున్నప్పుడు

ఇప్పుడు ఇన్నాళ్ల తర్వాత
నా భయం తగ్గిపోయింది
ఇప్పుడు పదాలు ఎదురైనప్పుడు
కుశల ప్రశ్నలు వేస్తున్నాను

ఇప్పుడు తెలుసుకున్నాను
అవి దాక్కునే ప్రదేశాల్నీ
వాటి రంగుల్నీ
తెలుసుకున్నాను


కేదార్‌నాథ్ సింగ్‌తో వి.కృష్ణ, ఖాదర్‌మోహియుద్దీన్, దాసి సుదర్శన్, శిఖామణి, ముప్వా శ్రీనివాస్, సత్రాజు

ఉదాహరణకి
అన్నిటికంటె సరళమైన పదాలు
బూడిదరంగులో, కాచురంగులో ఉంటాయనీ
అన్నిటి కంటె అపాయకరమైన పదాలు
లేతపసుపు రంగులో, గులాబీరంగులో
ఉంటాయనీ
తెలుసుకున్నాను.

మన దుర్భర దుఃఖకర క్షణాల కోసమని
మనం మిగుల్చుకునే పదాలు
తరచుగా
సమయం వచ్చినప్పుడు
అశ్లీలంగా కనిపిస్తాయి

ఇప్పుడు నేనేం చేయను
పనికి రాని
రంగు వెలిసిన
చెత్తలో పడేసిన పదాలే
కష్టకాలంలో
అన్నిటికంటె అందగా కనిపించాయి.

నిన్ననే జరిగిందిది -
చీకటిదారిలో
నన్ను హఠాత్తుగా చుట్టుముట్టాయి
అందంగా, ఆరోగ్యంగా ఉన్న ఆరేడు పదాలు
మెదడు పనిచేయక
చెమటలు పట్టి కాసేపు నిలబడిపోయాను
వాటి ముందు అవాక్కుగా
ఆపై పారిపోవడానికి
పాదమెత్తానో లేదో
ఎక్కడి నుంచో తెలీదు
రక్తసిక్తమైన చిన్న పదమొకటి
రొప్పుతూ వచ్చి
అంది
"పద, ఇంటికి తీసికెళ్తాను"

## విజ్ఞాన శాస్త్రమూ, నిద్రా

రైలు ఎక్కేటప్పుడు
విజ్ఞానశాస్త్రానికి కృతజ్ఞతలు చెబుతాను
శాస్త్రవేత్తలకు కూడా

విమానం దిగేటప్పుడు
బోలెడు కృతజ్ఞతలు చెబుతాను విజ్ఞానశాస్త్రానికి
కాసిన్ని భగవంతుడికి కూడా

అయితే పక్క మీదికి చేరినప్పుడు
వెలుతురులో నిద్రపట్టదు
లైటు తీసి
నిద్రపోతాను

విజ్ఞానశాస్త్రపు చీకట్లో
నిద్ర బాగా పడుతుంది.

# కవిత్వం..

## గుప్పెడు అక్షరాలు

- దేవరాజు మహారాజు

99086 33949

ఆలోచనల రంగు, అక్షరాలకంటుకుని
కవిత్వం, రంగుల మయం కావాలి !!

ఆలోచనలు మొలకెత్తి, అక్షరాలు పంటలు పండి
కవిత్వం, నలుగురికి కడుపునింపాలి !

ఆలోచనల సద్గుణం అక్షరాల ఓవెన్‌లో బేక్ అయి
కవిత్వం, ఒక సమతుల ఆహారం కావాలి !

ఆలోచనలు సున్నితమై, అక్షరాలు వెన్నముద్దలై
కవిత్వం, పాపాయి బోసి నవ్వులవ్వాలి !
ఆలోచనల రంగు, అక్షరాలకంటుకుని
కవిత్వం, రంగుల మయం కావాలి !!

ఆలోచనలు తీవ్రమై అక్షరాల ఊపిరితో
కవిత్వం, జనానికి ఉచ్ఛ్వాసనిశ్వాసాలవ్వాలి !

ఆలోచనలు వేడెక్కి అక్షరాల రాపిడితో
కవిత్వం, పోరాటాల బాటలవ్వాలి !

ఆలోచనలు బరువై, అక్షరాలు మృదువై
కవిత్వంలో, విశ్వప్రేమ పొంగి పొర్లాలి !

ఆలోచనల రంగు అక్షరాలకంటుకుని
కవిత్వం, రంగుల మయం కావాలి !!

ఆలోచనలు పాస్‌వర్డయి, అక్షరాల్లో లాగిన్ అయి
కవిత్వమే ఒక అంతర్జాలమవ్వాలి !
ఆలోచనల సాంకేతికల,
అక్షరాలటవర్లుగా పైకి లేచి

కవిత్వం, నేటి ఒక మానవత్వపు
మహానగరమవ్వాలి !

ఆలోచనల రంగు అక్షరాల కంటుకుని
కవిత్వం, రంగుల మయం కావాలి !!

## ఋతుపవన పద్యాలు

- ఆకెళ్ల రవిప్రకాష్

9490517777

ఎంత బాగా పాడినా కోయిల
ఎంతకీ చలించని మబ్బులు

మేఘాల కురుల్ని
గాలి మునివేళ్ళు సవరిస్తు

చంద్రుడికి
శలవలు ప్రకటించిన మబ్బులు

పేరున్న నగరాన్ని
పూర్తిగా కమ్మేసిన
పేరులేని మేఘాలు

అలల మీద మేఘాల
నెలవంక పడవలా తేలుతూ

వేలరెట్లు వర్షంలో
కొండలు అందంగా

వర్షం బయట ఏటవాలుగా
కాఫీ గదిలో పొగలుకక్కుతూ

పై కప్పు మీది
వర్షధ్వని వింటూ
నాతోబాటే నిద్రపోయిన
దుఃఖం కీచురాయి

మనసులోని దిగుళ్లనన్నీ
వర్షం కడిగేస్తే బాగుణ్ణు

నాతో తడవడానికి వర్షంలో
ఎవరు మిగిలారు? మిత్రులు

## అక్షరామృతధార

- డా॥ చందు సుబ్బారావు
94413 60083

కలంవృత్తి కళాకారుడు
అందమైన అక్షరాల సుందరశిల్పి
సాహితీసరస్వతి వీణావాదనలు విన్న
కవి.. భాస్వంతుడు - రవి - ధన్యజీవి!
సామ్యవాదం ఉచ్ఛ్వాసం
సారస్యం నిశ్వాసం
ఉదాత్తత ఊపిరి
సహృదయత ఆవేశం!
చుట్టూరా కమ్ముకున్న మానవతా
పరిమళం
బాధాపరితప్త గాథా సముచ్చయం
వినిపించిన హృదయ ఘోష..
రవళించిన కవన హొష!
నిరాశాహత నికృష్ట బ్రతుకుల పట్ల
నిరంతర సంతాపనానుభూతీ పరంపర
కరుణాసమగ్ర సముదీర్ణ పూర్ణమానవతా తుంపర
దురహంకార వికారస్వరూపాల పట్ల ధిక్కారం -
తిరుగుబాటు!
మతంపట్ల విముఖత - కులంపట్ల నిర్మోచన
సాంప్రదాయ గుణవీరుల స్వార్థంతో
సంగ్రామం
యధాతథ వాదులతో తెరిపిలేని వైరుధ్యం
వెనకచూపు పక్షులతో విడుపులేని పోరాటం!
అక్షరాలు ఆయుధాలు - కవిత్వమే కరవాలం
సాహిత్య సమరాంగణంలో సవ్యసాచి బీభత్సం
పిఠాపురం కోటవీధి రంగుమేడ ప్రాంగణం
తొమ్మిది దశాబ్దాల పాటు రగిలిన రణ రంగం!
ధూర్తులపై, అంధకార మూర్తులపై
ధనస్వామ్యకీర్తులపై, ప్రజాధనం భోక్తలపై
జనస్వామ్య విధ్వంసక పైశాచిక శక్తులపై
కలం గళం పోరాటం ప్రభువుల శిరసులపై
పరశురామ తాండవం
వైమర్శిక తీక్ష్ణ ధార
గతితర్కం శిక్షా స్మృతి
ఉసిగొల్పిన కవనద్యుతి !
స్వాతంత్ర్యం సమభావం
అభ్యుదయం సదాశయం
అక్షరలక్షాధికారి
అర్థశతాధిక కావ్యభాగ్య శ్రీమంతుడు !
శాతకర్ణులకు తండ్రి
కవి సోదరుల కగ్రజుండు
గురజాడకు విరిజాజులు
సమర్పించు పరమభక్త శిఖామణి!
శ్రీశ్రీ శతాబ్దిలో వికసించిన శిఖరాగ్రం
కృష్ణ శాస్త్రి ప్రియశిష్యుడు - కొత్తపల్లి
తనపుత్రుడు
పురిపండా, చాంగటీ, ఆరుద్రా, నా. బాబూ,
కుందుర్తీ, కవితిలకుడు, సినారే, శేషేంద్రా
కొడవలితో కుటుంబాన్ని ఎంచి
పెంచుకున్నవాడు!
మంచిని ప్రేమించినట్టి సహృదయుడు
వంచననెదిరించినట్టి సదాశయుడు
సుధామయుడు... ప్రభాకరుడు!
ఎండిన హృదయాలపైన వరుణదేవ
కృపాదృష్టి
పండిత పామరులపై వర్షించిన కుంభవృష్టి
సాంకేతిక శాస్త్ర దృష్టి - హేతువాద
జ్ఞానపుష్టి!
అవతారం చాలించిన ఆత్మీయుడు ప్రేమమూర్తి
గురువుగారు.. ఉత్తరాల ప్రేమహోరు.. ఇంకలేరు..
తిరిగిరారు.. తరలిపోయె-అడుగుజాడ విడిచిపోయె!
సూర్యరాయ రాజన్యుని పిఠాపురం బోసిపోయె!!

## సృష్టి

- అరణ్య కృష్ణ
98499 01078

ఒక మంచి శిల్పాన్ని చూసినప్పుడల్లా
ఏదో రక్త సంబంధం తోస్తుంది
భుజాల మీద చేతులేసుకొని
చెట్టపట్టాల్ కొట్టాలనిపిస్తుంది
నన్ను కూడా ఎవరో ఉలి తీసుకొని
నాలుగు దెబ్బలేస్తే
ఒక కదిలే శిల్పమైపోయానని సంబరమేస్తుంది.
నిజానికి మనుషులందరూ చలనశీల శిల్పాలే
అనంతానంత వైవిధ్యంతో ప్రతి మనిషీ
ప్రకృతి మలచిన శిల్పమే
ఒకరి ఇంద్రధనుసులా వంగిన ముక్కు మీద
జారిపోతుంటాను
మరొకరి దయగల కళ్ళల్లోకి దూకి చూపుల
జీవధారలో తడిసిపోతుంటాను
ఇంకొకరి మందహాసపు పెదవి వంపులో ఐక్యమై
పోతుంటాను
వేరొకరి చెమట పరిమళాల కౌగిలిలో మట్టి
బొమ్మనై పులకరిస్తాను
అసలు
మనుషుల్తో పంచుకోలేనిదేదో శిల్పి
తన బొమ్మలో చూసుకుంటాడేమో
సృష్టికర్త మర్చిపోయిన పనుల్ని
శిల్పి పూర్తి చేస్తాడేమో
తనని తాను చెక్కుకుంటూ శిల్పి
తన శిల్పంలోకి ప్రయాణిస్తాడు
కోల్పోయిన వాటిమీద ప్రేమే అతని కళకి ప్రాణం
పోస్తుంది
ప్రేమని, సౌందర్యాని ప్రేమించి భంగపడిన వాడే
మేలి ముసుగులో ప్రియురాలికి శిల్పంలో ప్రాణం
పోయగలడు
జీవితంలో గాయపడ్డవాడే
బానిస యోధుణ్ని చెక్కగలడు
తృణీకరించబడిన ప్రేమల్లా
భంగపడిన భావోద్వేగాల్లా
శిల్పి చేతిలో పాడైపోయిన
శిల్పాల్ని స్పర్శించినప్పుడు
నా మూలాలేవో హత్తుకొని ముద్దుపెట్టుకుంటాయి
ఆకృతి లేని ఉద్వేగాలకి ఇంత మట్టి కలిపి
దయలేని మనుషులకు ప్రత్యామ్నాయంగా
అక్కడో బొమ్మకి ప్రాణం
పోస్తున్నాడు శిల్పి రండి!
దూరంగా నుంచొని నిశ్శబ్దంగా
చప్పట్లు కొడదాం!

## కనుపాప సవ్వడి

- డా॥ కె. గీత

ఆకాశం వాన పుష్పాల సంబరాల్ని రాల్చుతూంది
అక్కడెక్కడో రెక్కలు సాచిన విహంగమ్మీద
నీ పాదాలు మోపిన సవ్వడి తెలిసే కాబోలు
చెట్లు చిగురింతల పులకరింతల్తో
మబ్బుల లేలేత కాంతి
పుంజాల్ని వెదజల్లుతున్నాయి
ఆకుల సందుల్లోంచి సంభ్రమాశ్చర్యాల ఆకాశాన్ని
పరిచయం చెయ్యడానికి కాబోలు
ఇన్నాళ్ళ దిగులు గుండె
ఇంకెప్పుడా అని చేతులు సాచి ప్రార్థిస్తూంది
ఒక్క క్షణం నిన్ను చూసి
దాటి వెళ్లే కనుపాప సవ్వడి చాటు
కన్నీరే గానీ మరేమీ కాదు
ఒక్కసారి దూరాంతరాల్లోంచి
దృష్టి సారించగలిగే

చిరు కోరికే గానీ మరేమీ కాదు
ఆకాశానివి నువ్వు
ధైర్యంగా తలెత్తి ఎలా చూడగలను నిన్ను?
కనిపించేవల్లా నీ పాదాలే
అడుగు మోపుతూ, ఆగుతూ
హృదయాంతరాళాన్ని
తలక్రిందులు చేస్తున్న నీ పాదాల సవ్వడే
ఎటు వత్తిగిలినా
స్పర్శేంద్రియాలన్నీ చెవులు రిక్కించుకుని
ఎదురు చూస్తున్న సవ్వడే
ఏ మూలనున్నావో
ఎక్కడ బయలుదేరుతావో ప్రపంచానికి తెలుసు
తడబాటు గుండెకెల్లా తెల్సు?
క్రీ గంట వాకిటనల్లుకున్న ఎదురు చూపు
ఒక్కటే పనిగా ద్వారాన్నంటిపెట్టుకుని ఉంది
ఏమీ తోచని బెంగటిల్లిన
ఒక బాధాన్విత గుండె
అవిశ్రాంతంగా ఆలోచనల ధారల్ని
అటూ ఇటూ అల్లుతూ ఉంది
అయినా -
ఏదో మూల పులకరింపజేస్తున్న
గొప్ప జ్ఞాపకం -
అణువణువునా విరబూస్తున్న
ఆశాన్విత క్షణం -
ఒక రోజు
వేల రెక్కలు సాచుకుని
ఈ వాకిట వాలే విహంగం
నీ పాద ముద్రలు రాల్చిన కాసింత ధూళి
నా జీవిత కాలపు స్వప్నాల మీద జల్లి
నన్ను నిద్రలేవదీస్తుంది
అవిశ్రాంతంగా ఆకాశం నించి
భూమ్మీద వరకూ నే పరుచుకున్న
స్వాగతపు కలల్ని సాకారం చేసి
నన్ను ఆలింగనం చేసుకుంటుంది.

## ప్రార్థన

- డా॥ ప్రసాదమూర్తి
8499866699

మొన్న ఆసుపత్రికి వెళ్ళాను
బెడ్ మీద వొత్తిగిల్లిన కెరటంలా మిత్రుడు నవ్వాడు
నా ముందే అతన్ని స్ట్రెచర్ మీ పడుకోబెట్టారు
గట్టు మీద నడుం వాల్చిన చెట్టు నీడలా వాడు
కళ్ళతో టాటా చెప్పాడు
అప్పుడు నేను వాడిలోకి చూడలేక అద్దాల్లోంచి
నగరాన్ని చుట్టుముట్టిన వర్షాన్ని చూశాను
కాసేపు అంతా మసకగా అనిపించింది.
ఏవో సముద్రాలు...పర్వతాలు... నక్షత్రాలు
అద్దాల మీదవాలిన వాన చుక్కల్లో కనిపించాయి
అతను ఆపరేషన్ థియేటర్ లోకి వెళుతూ
మళ్ళీ అమ్మ పొట్టలోకి వెళుతున్నాను అన్నాడు
మొహాలకీ తలలకీ మాస్క్ లూ
చేతులకు గ్లవ్స్ తొడుక్కుని
దేవుళ్ళూ దేవతలూ అటూ ఇటూ
నిశ్శబ్దంగా పరుగులు పెడుతున్నారు
వెయిటింగ్ రూమ్ కుర్చీల్లో కూలబడ్డ
ఆందోళన ఆత్రుత సంశయం. భయం ఆశ
నిట్టూర్పుల మునివేళ్ళతో
గోడల మీద ఏవో బొమ్మలు
వేసుకోవడం చూశాను
మర్నాడు ఆసుపత్రి లిఫ్ట్‌లో ఎవరెవరో
ఒకరినొకరు ఒరుసుకుంటూ ఒకరి ప్రార్థన ఒకరు
వింటున్నట్టు మౌనంగా నిలబడ్డారు
నిజంగానే మావాణ్ణి తల్లి బొజ్జ లోంచి జాగ్రత్తగా
తీసి

ఐసియూలో పరుండబెట్టారు
ఏవేవో గొట్టాల్లోంచి పాలు పట్టిస్తున్నారు కాబోలు
నా చెలికాడు చెమ్మగిల్లిన చూపులతో నన్ను
తడిమాడు
అప్పుడే పుట్టిన పాపాయిలా వాడు
అటూ ఇటూ ఆశ్చర్యంగా ఆనందంగా చూశాడు
గట్టిగా ఊపిరి పీల్చుకుంటూ నిమ్మళంగా
కళ్ళుతుడుచుకుంటూ
బయటపడ్డాను
నగరం మొత్తాన్ని కాసేపు పక్కకి జరిపి
సాగిలపడి మొక్కాను
అసుపత్రి కాదు అది దేవాలయమే.

(బాల్య స్నేహితుడు దుర్గరాజు కోసం)

## జీవనోపనిషత్తు

- యార్లగడ్డ రాఘవేంద్రరావు

9985411099

నాకెందుకో -
నేనొస్తున్నానంటూ
కాకితో ముందస్తు కబురు పంపించాలని ఉంది
చినుకు గిలిగింతకు చెరువు విచ్చుకున్నట్లు
చూపుల నిండా చేమంతుల్ని విప్పార్చాలని ఉ
ంది
వారగా వేసిన తలుపుల్ని కాస్త తోసుకువచ్చిన
నీరెండలా నవ్వే రోజును కానుకివ్వాలని ఉంది
చేతుల్లో, కొత్తగా అంటుకట్టిన
మల్లెమొక్కలా విరగబూయాలని ఉంది
జడివానల్ని, జారువెన్నెలల్ని
గుంపులుగుంపులుగా
పక్షుల్లా ఎగరేసి పంపించాలని ఉంది.
కడుపులో పసికందులా కితకితలు పెడుతూ
పిలవటానికి ముందే బదులై పలకాలని ఉంది
అపరిచితాన్నీ గుండె కొనకు ముడేసుకుని
వింతవింత లోకాలకు వంతెన
వేసుకోవాలని ఉంది
పిలుపుకెవరూ ఓ అనని చోట, పలుకుకెవరూ
ఊ అనని చోట పులకింతల్లోకి దారి
తప్పించాలని ఉంది
దగ్గరంత నమ్మకంగా దూరమంత నెనరుగా
పండగంత నిండుగా వాటేసుకోవాలని ఉంది
మడత మడతలో ఎండి అట్టకట్టిన
గత పరిమళాల గుసగుసల్లో
కూరుకుపోవాలని ఉంది
కవాటాలు దాటెవరెవరో వెళ్లిపోయాక ఆ
ఖాళీస్వరాల మీద
గుప్పెడు మిణుగురుల్ని మంత్రపుష్పాలుగా
విరజిమ్మాలని ఉంది
మిగులైపోయినప్పుడో, మిగలలేనప్పుడో
నేలనంటి నడిచే నదిలా రసగంగ
కావాలని ఉంది.

..................

అవును, ఇప్పుడు మనిషిగా
మిగలాలనుకున్నప్పుడల్లా
నన్నంతా ఎక్కడైనా మరింత భద్రంగా
దాచుకోవాలని ఉంది
అవును, ఇప్పుడు నాకెందుకో మళ్లీమళ్లీ
ఉత్తరమై రెక్కలార్చుకోవాలని ఉంది
గుండె గుండెకు నడుమ
పూడిక తీసుకోవాలని ఉంది

## తప్పిపోయాం

- ఆశారాజు
93923 02245

చిన్నప్పుడు
తోబుట్టువు లెక్కువగా వుండి
పిల్లలకు పాఠాలు చెప్పుకొని
మొండిగా చదువుకొన్నాను.

తల్లిదండ్రులకు బరువుకాకుండా
అక్కాచెల్లెళ్ల అవసరాల కోసం
అక్కడక్కడా వెదుక్కొని
అప్పుడప్పుడూ రాత్రుళ్లు పనిచేశాను.

డిగ్రీ కాగానే పెళ్లిచేసుకొని
కుటుంబం తరిమితే
ఎడారి దేశాలకు పరుగెత్తాను
సంపాదించింది చవిచూడకుండా
కలలుకనే పిల్లలకు పెట్టి
ప్రయోజకులను చేశాను

ఇంతదూరం ఓపిక పట్టి
కలిసి తిందామని కూర్చుంటే
ఒంటరిగా వదిలేసి
తలొకదిక్కు వెళ్లారు

చెంతలేని సంతానాన్ని
జ్ఞాపకాల్లో చూస్తూ నేనూ
కన్న పిల్లల్ని దీవిస్తూ
తల్లడిల్లే నా సహచరి
ఖాళీగదుల్లో తప్పిపోయాం

*(కదిలించిన మిత్రుడు 'నజీబ్' కోసం)*

## వయా మేఘాలంపూర్

- పాటిబండ్ల రజని
9948595886

తలపై గొడుగును తలక్రిందులు చేసి చూసినట్లు
ప్రతిబింబం కాకున్నా ప్రతిదీ తారుమారైనట్లు
చీరనలగకుండా శీర్షాసనమేసినట్లు
వయా మేఘాలంపూర్ -
ఆకాశ విహారానికెళ్ళాను.

కాళ్ళు నేలమీద ఆనడం లేదంటే -
మబ్బుల్లో తేలిపోతున్నట్లుండటమంటే -
ఇప్పటికి కదా తెలిసింది!

దోభీఘాట్లో దోబూచులాడుకున్నట్లు
ఏం మబ్బులు? ఏం మబ్బులు?
తస్సాదియ్యా!

కిటికీ గట్టిదై పోయింది గానీ -
ఎగిరి దూకితే ఎర్రమన్నవుతానని తెలిసినా
తెగించి దూకి తెగపొర్లమని
లోభపెట్టే దూది గుట్టల మబ్బులు!

రథాలూ, రైళ్ళూ - మినార్లూ, గోపురాలు -
మడుగులూ, మహళ్ళు - ఊర్లూ, ఉద్యానాలూ
అచ్చంగా మన నమూనాలన్నింటినీ -
ఈ మబ్బుల్లోంచే అచ్చొత్తుకున్నామేమో!

ఛ! ఛ! పాతపేర్లే పదే పదే రాయడం కాక
పాతికేళ్ళ కోసారైనా -
మబ్బు జనాభా లెక్కగట్టమని
రెక్కలు గట్టి పైకి పంపితే బాగుండు!

ఏనుగుతొండంవారు తపస్విగడ్డాల వారు,
పాలనురగలవారు - పంచదారరాశులవారనే
ఇంటిపేర్లుంటాయేమో!

క్షణమైనా కుదురుగా ఉండని
ఆకతాయి మబ్బుబ్బాయిలకి - పాఠాలు చెప్పమని
అంతర్లోక బదిలీ చేస్తే బావుండు!

తెల్లపలకలపై నీలి బలపాలతో
తారాక్షరాలు దిద్దించవచ్చు!

రిక్కల్ని పిక్కలుగా చేసి
లెక్కలూ ఎక్కాలూ నేర్పించచ్చు!

హూ!
ఈ పక్కనేనిలా మురిసి మూటెడవుతున్నా,
నన్నంటుకుంటే నల్లబడతామనేమో
అల్లంత దూరానే మళ్ళి పోతున్నాయి.
మరకమంచిదేనని మనలాగా నమ్మనందుకే
మచ్చలేకుండా మనగలుగుతున్నామన్నాయి.

పైకెగిరొచ్చినా పైరవీ వదలలేక
'విమానిని'ని విదేశీ భాషలో బేరమాడితే,
నిలువెత్తు ధనమిచ్చినా రంగురంగుల ద్రవాలేతప్ప -
విభూది పండంత మబ్బుండైనా కోసివ్వలేనంది!
రోజా ఆ దారినే వెళ్ళొస్తున్నా -
రోజా పువ్వంత తెలిమబ్బురేకైనా - ఎన్నడూ
తురుముకోలేకపోయానని వాపోయింది!

ఔరా!
కపటం పెరిగిన భూమికి కల్తీ నెయ్యి చాల్లెమ్మని
కన్నయ్య - వెన్నంతా ఆకాశానికే
ఎత్తుకొచ్చినట్లున్నాడు!
కన్నానినంతవేరా గున్న ఏనుగులంత
వెన్నతిన్నెలు !

యశోదమ్మ ఇంట - ఎంతలేసి గిన్నెలుంటాయో
కదా?
పరగణాకొకటి చొప్పున -
పాలసముద్రాలైతే చాలానే కనిపించాయి కానీ -
పసిడి కుండల తల్లి మాత్రం పత్తా లేదు !

బహుశా -
కాళ్ళొత్తకుండా వాళ్ళావిడను చెరగొడతానేమోనని,
పదవతారాలాయన పరదామబ్బుల మాటున
దాచేసి ఉంటాడు.

ఆహాహా!
తెలిగ్గా-తేటగా-తెల్లగా తిరిగే ఈ మబ్బు తల్లులే-
అందమైన తమ ఆకాశ పాన్పులు దిగి
నీలిరంగుతో నిలువెల్లా నీళ్ళాడి
మనల్ని తడిమి తడిమి - తడిపి తడిపి
ప్రాణం కుడిపి వెళతాయి కదా!
ఇవ్వడం తెలిసినందుకే ఇంత తెలుపేమో!
దాచుకోవడం తెలియనందుకే ఈ మెరుపేమో!

మానవులారా -
చచ్చాక ఏ దారుల్లో వెళతామో ఎవరికి తెలుసు?
అందుకే - బొందితోనే ఓసారైనా
అందాలు రాశిపోసిన ఆకాశంలో ఈది తీరాలి!

మళ్ళీ మళ్ళీ మబ్బుల్లో
మనసు శుభ్రం చేసుకునేందుకు
రాళ్ళు కొట్టైనా నాలుగు రాళ్ళు పోగేయాలి! ●

## ఒకే ఒక్క కవితా వాక్యం

- కోడూరి విజయకుమార్
83309 54074

జీవం లేని దేహానికి పట్టు వస్త్రాలు కప్పి
వీధుల్లో తిప్పిన ఊరేగింపులా కాదు
రక్త మాంసాలతో నవ నవలాడే అక్షరాలతో
జీవమున్న ఒకే ఒక్క కవితా వాక్యం కోసం
పరితపిస్తే
కొన్ని రాత్రులు అట్లా దగ్ధమై పోతున్నాయి

అక్షరాల కూర్పుదేముంది
సాధన చేసి సాధించిన కళ ఒకటి వుంది
కాబట్టి
తడిలేని కవితా వాక్యాలతో మోళీ చేసి
కనికట్టు చేయగలను కాసేపు
ఇంద్రజాలికుడి ప్రదర్శన ముగిసాక
ఒక్క చెమ్మగిల్లిన నయనాన్ని సైతం
హృదయంలో మిగల్చక
అబ్బురపరచిన మోళీ కళ్ళ ముందరే బూడిదలా
రాలిపోతుంది.

సచివాలయం దగ్గర ఉరి వేసుకున్న రైతు
విశ్వవిద్యాయాలలో నిర్జీవంగా వేలాడుతున్న
యువకులు
రాత్రి రోడ్డు మీద తోడేళ్ళు వెంటాడి చంపిన
కుందేళ్ళు
బడులకు వెళ్లక శ్రమలో కమిలే పసి చేతులు
సజీవ వాక్యాలై ఉక్కిరిబిక్కిరి చేస్తాయి

ఒక్కొక్క వాక్యాన్నే ఆవాహన చేసుకుంటూ
రాత్రంతా మేల్కొని వుంటాను
తెల్లవారేసరికి కూడా
చెమ్మ ఉన్న ఒక్క పద్యం కాలేక పోయిన
నా పొడి కళ్ళను తెల్ల కాగితంలో చూసుకుని
ఒక వెర్రి నవ్వు నవ్వుకుంటాను
మరి మీరు?

## అసలు చరిత్ర

- పల్లెపట్టు నాగరాజు
99894 00881

ఎప్పుడైనా...
ఆఖర్న నిలబడ్డవాడే మొదట గొంతువిప్పాలి.
అణచబడ్డ గొంతులు కంచు కంఠమై...
జేగంటలు మోగించాలి...
అగ్ని శకలాల నిజాల మీద నివురు తొలగి
నగ్నసత్యం న్యాయపీఠమధిరోహించాలి...
స్వేదం - పునాదులపై కులుకుతున్న
అంతస్తుల భవంతులు...
వాస్తవాన్ని విస్మరిస్తే...!?
పునాదుల్లోనే పూడ్చబడతాయనే
పచ్చినిజానికి పట్టం గట్టాలి...
వెనక్కి తోయబడ్డ చేతులు
వెనక్కి నెట్టబడ్డ పాదాలు
వెనక్కే... వెనక్కే... తొక్కబడుతున్న బడుగు
గడ్డిపోచలు
అణచబడ్డవాడి చరిత్రే అసలు చరిత్ర
ఎప్పుడైనా....

పద్య కవిత

## కవి

- కీ.శే. పానుగంటి లక్ష్మీనరసింహారావు

మల్లెపూవు దూటి మధుపంబుతోఁ బాడి
గంధవాహుతోడ గలసి వీచి
యబ్ధిలోన మునిగి యౌర్వవహ్నిని గ్రాఁగి
నీటిబుగ్గ యగుచు నింగిఁ బ్రాఁకి

తోఁక చుక్కతోడ ఢీకొని శ్రమఁజెంది
సాంధ్యరాగనదిని స్నానమాడి
తనువునిండ నింద్రధనుసు రంగులు పూసి
కైరవాప్తసుధను గైపుఁ జెంది

గోళగానరుతికి మేళవింపుగఁ బాడి
పాడి యాడి పాడి యాడి సోలి
భావనామహత్త్వపటిమను బ్రహ్మమై
పోవు కవికి గోటిమ్రొక్కు లిడుదు.

(సాక్షి వ్యాసాలు - 3వ భాగం నుండి)

## నూతన సనాతనం

- జగద్ధాత్రి
87122 93994

శ్మశాన విరాగ నిశీధిలో సైతం
అప్రమేయంగా సహజాతంతో
కదిలిన నవనాడుల ప్రకంపనం
జవ జీవాల జీవన నాదం
అనాదిగా వస్తున్నదే అయినా
అందిన ప్రతి సారీ ఒక కొత్త రూపు
ఎన్ని పదాలు, పదబంధాలు, ప్రబంధాల
సారమైనా
ప్రతి మారూ వినూత్న చలనం
తానే నేనై, నేనే తానైన
త్వమేవాహమా
తనూ నేనూ లేని అద్వైతమా
తనూ నేను ప్రేమల విశిష్టాద్వైతమా
సమాధానపడని మనసుకి
శాంతించని దేహానికీ నడుమ
ప్రతి క్షణం రగిలే వాంఛా జ్వలనమా
తీవ్ర స్ఖలనాల పిదప
తీయని కౌగిలిలో సేద తీరే
మనోదేహాల ఆత్మీయ చాలనం
కాలమున్నంత వరకూ
మనిషిని శాసించే
విశ్వజనీన శృంగార సామ్రాజ్యం
విజయులూ వీర మరణాలూ లేని
సరస సంగమ సంగ్రామం
అనూచానంగా మనోదేహాత్మలను
రంజింప జేసే మధుర మరణమిదే
రస సిద్ధి పొందిన
రసజ్ఞుల ప్రాప్త మోక్ష ఫలం
నిత్య నూతన సనాతనం నిరంతరం !!!

## నేను తల దాల్చుకున్నదే...

- సజ్జా వెంకటేశ్వర్లు
99511 69967

నేను తలదాల్చుకున్నదే
నాకు తల్లి ఒడి!

నా జనన ధృవీకరణాలు ఎక్కడా
నా వాళ్ళు జరిపిన ధాఖలాలు లేవు!

ఈ నగరానికి రాక మునుపు నేను
ఎన్నో దేశాలు తిరిగొచ్చాను!

వీధుల్లో కుక్కల్ని చూసినా
ఆకాశంలో పక్షుల్ని చూసినా
చెప్పలేనంతగా మానసిక ఒత్తిడి!

నేను తలదాల్చుకున్నదేగా
నాకు తల్లి ఒడి!

పొట్ట తిప్పలు చుట్టూ
జనారణ్యం లోంచి వచ్చే
చిట్టీ పొట్టి పిలుపులెన్నైనా
అన్నీ నా దేహ సౌందర్యాలే !

నాకు తల్లి ఒడి
నేను తలదాల్చుకున్నదేగా!

సూర్యోదయానికి ముందే
రెక్కలు కట్టుకు పోవటం
చంద్రోదయం తరువాతే గూడుచేరటం
ఒక తప్పని నిర్బంధ దినచర్య!
జీవితం అంటే లాంగ్ మార్చ్‌సాంగే !!
ఆహా ఏమినా జీవనం!!!

## India's Public Toilets

- వినోదిని
9440456087

కామంతో నీ శరీరం సెగలు చిమ్మడానికి
నువ్వు నా సొగసులు చూడాల్సిన అవసరం లేదు
మోహంతో నీ నరాలు మత్తుగా మేల్కొనడానికి

నా కళ్ళల్లో కైపు, వాలు చూపులు నిన్ను జివ్వున కోసెయ్యనక్కర లేదు
నువ్వు తీయగా గాయపడి కోరికగా స్రవించడానికి
నా చెరుకునవ్వుల రహదారుల మీద నుండి బాణం ఒక్కటి ప్రయాణించాల్సిన పనేలేదు
నీ మగతనం నిటారుగా నిలబడి నిగ నిగ లాడే కత్తి కావటానికి
నా బెత్తెడు మానం, జానెడు రొమ్ముల ఎత్తులు - లోతులు కొలతకు రానక్కరలేదు

నువ్వు ఉద్రేకపు రసిక సముద్రంలో ఊపిరాడక ఉక్కిరి బిక్కిరి కావడానికి
నేను రొమ్ములు తొడలు కనపడేట్టు గుడ్డలు తొడుక్కోనక్కరలేదు
అవమానంతో, కసితో నీ కామయుద్ధాన్ని సర్రున లాగి నన్ను కడతేర్చాలని నిశ్చయించటానికి
నాల్గు రోడ్ల కూడలిలో నీ ఈగోని నేను చెప్పుతో కొట్టనక్కర లేదు.

నన్ను ధర్మ సంరక్షణ జీబ్రా గీతల మధ్య నడిపించడానికి
నీ నిలువు నామాన్ని రెండుకాళ్ళ మధ్య మొనదేలిన త్రిశూలం చేయటానికి
నేనొక సమానత్వ ప్లకార్డు ప్రదర్శించి నీ మను మగ మహారాజత్వానికి ప్రశ్నను కానక్కరలేదు.

xxxxx

న్యూనతో - ఆత్మగౌరవమో, దీనమో - ధిక్కారమో
భయమో - ధైర్యమో, పనిముట్టో - పుస్తకమో
గుడిసో - మేడో, పసితనమో - పండుతనమో
అణచివేతో - హక్కో అవమానమో - అంబేద్కరత్వమో
నేను ఏదైనా కావొచ్చు...! ఏ స్థానంలో నైనా వుండొచ్చు...!
నువ్వు నన్ను పసిగడతావు !!
నా తల్లి వేరులోంచి గుప్పుమనే వాసనేదో

నువ్వు నన్ను గుర్తించేలా చేసుద్ది...
అది -
చచ్చిన గొడ్డు తోలు కిర్రుచెప్పులై నీ పాదాలకు అమరిన నా అమ్మమ్మ నైపుణ్యం అయ్యుండొచ్చు.

ఊరందరి దొడ్డికెత్తి నెత్తిన మోసిన నా తల్లి చేతుల వాసనై వుండొచ్చు
మీ ఇళ్లల్లో పాచిపని చేసి అంటుకూలీగా మారిన నా మేనత్త చాకిరీ అయ్యుండొచ్చు
మీ ధాన్యాగారాలు నింపడానికి మల మల మాడిన నా చిన్నమ్మ ఆకలై వుండొచ్చు
అంటరానిదానివంటూనే నువ్వు మూజూసిన నిండుకుండ నా అక్క అవమానమై వుండొచ్చు
ఏదైనా కావొచ్చు...
నువు నన్ను తొలి చూపులోనే గుర్తు పడతావ్...!

×××××

పెంటకుప్ప చూడగానే అప్పటికప్పుడు ఉమ్మి తెచ్చుకొని వూసినట్టు
బస్సాగితే, వొచ్చినా రాకపోయినా అందరూ దిగి వుచ్చులు పోసినట్టు
మా అశుద్ధ గుంటల్లో నాలుగు వీర్యపు చుక్కలు పోసి పోతారు మీరు...
పోతూ పోతూ తిరిగి చూసి పోట్లు పొడుస్తారు... రాడ్లు దించుతారు...
పేగులు లాగుతారు... ప్రాణాలు తీస్తారు...

ఈ దేశపు మనువారసులకి మావి ఆడ గుంటలు కానే కాదు
అక్షరాలా అంటరాని కులం గుంటలు

ఇది ఎక్కడ జరిగినా ఎప్పుడు జరిగినా ఒక సహజ సందర్భమే మీకు
ఈ దేశ సంస్కృతీ పరిరక్షణలో ఇదొక భాగం అనుకుంటారు మీరు
అందుకే -
నా కోసం ఒక క్యాండిల్ కూడా కరిగి వెచ్చటి కన్నీరు పెట్టుకోదు
అంటురోగాల దారంతో వీపు గోక్కునే మీడియా ఒక్క మాటని కూడా మౌర్నింగ్ గా ప్రకటించదు.
మడి వాద మహిళా మణులు చున్నీలు నడుముకి చుట్టి,
గొంతు నరాలు ఉబ్బించి హోరెత్తించే ఉద్యమ నినాదాల అల్లకల్లోల సునామీనీ సృష్టించరు.

×××××

We are never India's Daughters !
We are India's Public Toilets !!

## రహస్య స్థావరాలు... వ్యూహ గృహాలు

- రామా చంద్రమౌళి
93901 09993

హరప్పా... మొహంజోదారో... నైలు... నదుల తీరాలపై
తరతరాల మనుషుల చరణముద్రలు... శతాబ్దాలుగా
మనిషి సమూహమౌతూ... రాజ్యమౌతూ... అధికారమౌతూ
ప్రతి నాగరికతలోనూ జైలు గోడలూ... ఉరికొయ్యలే
తనసంతానం రక్తాక్షరాలతో లిఖించుకుంటూ
యుగయుగాలుగా నిర్మాణమౌతున్న మానవ చరిత్ర
పుటలనిండా... నేలమాళిగల, రహస్య స్థావరాల, వ్యూహ గృహాల
గబ్బిలాల వాసనే
గుర్రపు డెక్కల చప్పుళ్ళూ, రథ చక్రాల కర్కశధ్వనులూ
ఖడ్గ ప్రహారాల లోహ శబ్దాలూ తప్ప
గగన తలంపై పావురాల రెక్కల చప్పుడే వినబడదు
యుద్ధాలతో, కుతంత్రాలతో, రక్త తర్పణాలతో
అంతా హింస... వెచ్చగా ప్రవహించే నెత్తుటి మరకలు
ఎండిన జేవురు రంగు సాక్ష్యాలు
బాణాలూ, ఫిరంగులూ, తుపాకీ గుండ్లూ... ఏవైతేనేమి
ఎదుటి మనిషి గుండెలను చీల్చేందుకే గదా -
తనలోకి ప్రవాహమై చేరే యుద్ధరక్తాన్ని చూచి దుఃఖించే
నదులు సింధో, గంగో, సట్లెజో
జలాయుధంతో నగరాలకు నగరాలను కబళించి
మహోగ్రతతో 'పాతాన్ని' చెబుతూనే ఉన్నాయి అనాదిగా
ఐతే మనిషి ప్రధానంగా ఒక పశువు కదా
కళ్ళు మూసుకుని... ఎప్పుడూ దండయాత్రలనే స్వప్నిస్తాడు
స్త్రీనో, రాజ్యాన్నో, సంపదలనో... ఆక్రమించే వ్యూహంలోనే
జ్వాలలోకి దుమికే పురుగై
ఆత్మ హననమే దేశ చరిత్రలనిండా
మొండి గోడలో... రాతి శిథిల దుర్గాలో... ఫిరంగుల అవశేషాలో
ఏవైనా... గాలితో సంభాషిస్తూ
చరిత్రను నెమరేసుకుంటూ దుఃఖిస్తూనే ఉన్నాయి -
కాలాన్ని సాక్షిగా నిలబెట్టి సూర్యుడూ
జైలు ఊచల వెనుక గడ్డకట్టి నిలబడి చంద్రుడూ
అన్నీ గమనిస్తూ... మూగ పరిశీలకులుగా... దారానికి వ్రేలాడే కాగితపు జీవితాలై

చినుకులు చినుకులుగా
వసంత మేఘాలు కళ్ళు మూసుకున్న ముఖంపై వర్షిస్తున్నప్పుడు
ఒక నాగరికతై, ఒక చరిత్రై, ఒక సందిగ్ధ సమయమై
వర్ధిల్లుతూ వస్తున్న మనిషి
ద్రవిస్తూ,.... ఘనీభవిస్తూ... మళ్ళీ ద్రవిస్తూ... మళ్ళీ మళ్ళీ ఘనీభవిస్తూ
వాకిట్లో గుంజకు తలుగుతో కట్టేయబడ్డ ఆవును చూస్తూ
తనసంతానం ఒక 'బందీ' అని తెలుసుకుంటాడు... జ్ఞానంతో
చక్రం తిరుగుతూనే ఉంటుంది ఎవరికోసమూ ఆగకుండా
పదే పదే... మళ్ళీ మళ్ళీ
ఇంతకూ యుగయుగాల పర్యంత ఈ 'పురా మానవుడు' ఎవరు?

## అనువాద కవిత

### వీడ్కోలు

టాగూర్ Crescent Moon నుండి - **అనువాదం: డా॥ భార్గవి**

ఇది నేను వెళ్లి పోవాల్సిన సమయం. అమ్మా! నేను వెళుతున్నాను. ఒంటరి ఉదయం, చీకటి విడిపోతున్నపుడు నీ బిడ్డకోసం పక్కమీద చేతులు చాస్తావు. 'పాప అక్కడ లేదమ్మా' అని చెపుతాను నేను. అమ్మా నేను వెళుతున్నాను.

నేనొక మృదువయిన గాలి వీచికగా మారి నిన్ను తాకుతాను. నీటిలో చిన్న చిన్న అలలుగా మారి నీవు స్నానం చేసేటప్పుడు నిన్ను మళ్లీ మళ్ళీ ముద్దు పెట్టుకుంటాను.

తుఫాను రాత్రి, ఆకుల మీద వర్షం చప్పుడు చేసేటప్పుడు, పక్కమీద నుండి, నీవు నా గుసగుసల్ని వింటావు. నా నవ్వు నీ కిటికీలోంచి ప్రసరించే కాంతితోపాటు వెలుగుతుంది.

నీవు నీ పాప గురించి ఆలోచిస్తూ చాలా పొద్దు పోయేదాకా మేలుకుని వుంటే, నేను చుక్కల నించీ పాడతాను 'నిద్రపో అమ్మా, నిద్రపో' అని.

చెదిరిపోయే చంద్రకాంతులలో నీ ప్రక్క మీదకి దొంగతనంగా వచ్చి నీవు నిద్రపోయేటపుడు నీ హృదయానికి హత్తుకుని పడుకుంటాను.

నేనొక కలనయి, కనురెప్పల సందుల్లోంచి నీ నిద్ర లోతుల్లోకి జారతాను, నీవు మేలుకుని చుట్టూ చూసినపుడు, క్షణం మెరిసి మాయమయ్యే మిణుగురు పురుగులాగ, చీకట్లోకి జారిపోతాను. పండుగ పూజా సమయాల్లో, పక్కవాళ్ల పిల్లలు యింట్లో ఆడుకుంటూ వుంటారు.

అప్పుడు నేను పిల్లనగ్రోవి పాటలో కరిగి రోజంతా నీ హృదయంలో స్పందిస్తాను. ప్రియమైన పెద్దమ్మ పూజా సామగ్రితో వచ్చి అడుగుతుంది 'మన పాప ఎక్కడ చెల్లీ' అని. నీవు నెమ్మదిగా చెపుతావు 'అతను నా కంటిపాపలో వున్నాడు, నా శరీరంలో వున్నాడు, నా ఆత్మలో వున్నాడు' అని.

## మాట్లాడలేనివాళ్ళ కోసం కొన్ని మాటలు

- పలమనేరు బాలాజీ

94409 95010

అలకలో, కోపాలో, అహంభావాలో...
మనుషుల మధ్య కనపడని దూరాలో!?

ఉన్నట్లుండి ఇద్దరు మాట్లాడుకోవడం
మానేస్తారు.
సమస్త ప్రపంచం కాదు కదా...
ఒక్క ఇసుక రేణువైనా చలించదు.
మాటల్లేక పోవడమే తప్ప -
ఈ విశాల ప్రపంచంలో
ఇక ఇతరత్రా మార్పనేదే ఉండదు.
ఎదుటి మనిషికి, ఇతర స్నేహితులకి,
మరి చుట్టుపక్కల నీడల్లాంటి వాళ్ళకి
అంతెందుకు?
అసలు ఇద్దరి మనుషుల మధ్య
మాటల్లేకపోవటాన్ని
ఒక్కోమారు ఆ ఇద్దరే గమనించరు,
లేదా అసలా విషయాన్నే మర్చిపోయి
వుంటారు.
మాట్లాడకుండావుండటమో, మాట్లాడుతూ
వుండటమో అంటే
మరేమో కాదు.
ఒకరితో ఒకరు లేదా ఒకరికోసం ఒకరు
స్నేహంగానే, నామ మాత్రం పరిచయంగానే,
ప్రేమగానో, నమ్మకంగానో, విశ్వాసంతోనో,
భూమి పొరల్లో దాగిన చెమ్మలానో,
బ్రతకాలనుకోవడమే.
నాలుగునాళ్లే బ్రతికామా?
నూరేళ్లూ బ్రతికామా? అనేది ముఖ్యమే కాదు.
నిఖార్సుగా, ఉత్తేజంతో, మనుషులతో -
మనుషులకోసం
మనిషిలా బ్రతికామా లేదా అన్నదే ముఖ్యం.

ఎవరెవరితో మాట్లాడ్డం మరచిపోయామో,
ఎవరెవరు మాట్లాడ్డం మానేశారో...
లెక్కలేసుకోవాలి...
ఒక ఆదివారపు ఉదయం.

అన్నం పెట్టినవాళ్లు, ఆదరించినవాళ్లు,
స్నేహ హస్తాన్ని అందించిన వాళ్ళు,
ప్రేమించినవాళ్ళో, ప్రేమించబడినవాళ్ళో...
ఈ పొడవాటి రహదారిలో మనల్ని
జారవిడుచుకున్న వాళ్ళెవరు?
మనం చేజార్చుకున్న వాళ్లెవరు?
వుంటారు, తప్పకుండా వుంటారు.
ఆలోచిస్తే గుర్తుకొస్తారు.
మనుషులు మర్చిపోతారు కానీ... మానవ
హృదయాలు మాత్రం
జ్ఞాపకాలుగా మనుషుల్ని పదిలంగా
కాపాడుకుంటూనే ఉంటాయి.

మనుషులు మనుషులతో మాట్లాడబట్టి,
మనుషులు మాటలతో మనుషుల్ని
ఆవహించబట్టి
ఇంకా ఈ లోకంలో
మాటలు, మనుషులు కాస్తయినా
మిగిలున్నాయేమో?

## గాయాల నా మనసా !

- తైదల అంజయ్య

98668 62983

వెచ్చని రంగులేవో మది నిండా
పరుచుకున్నవి
చల్లని జాబిలి తలనిండా మెరుస్తున్నది.
ఘనమైన మంచు నన్ను గడ్డ కట్టిస్తూవున్నది.
అగ్ని పర్వతమైన గుండె
వాహిని పారిస్తున్నది
ఎన్ని గాయాలే మనసా నీకు!
పడుచు తలపోత- సిగ్గుమీద పాలసముద్రం
అలల మీద
లేత సిగ్గుల కులుకు నవ్వుల కన్నెల మీద
జొన్నసేండ్లో నా తలపోత
పాటల కూలిపిల్లల మీద
మనసా నిన్ను ఎన్నిసార్లు సారేసుకుంటినే!
సాటి మనిషే దూరముండు మన్నపుడు
ప్రియురాలి కన్నుల్లో కులం పొరను
చూసినపుడు
రూపాయి కత్తి నా వెన్నులో దిగినప్పుడు
నా మనసా నీకు ఎన్ని గాయలే!
అడవి చెట్ల మీది ఎర్ర జెండాల మీద
ఎరక్తకోట మీద ఎగురబోయే నీలిజెండాలమీద
ప్రశాంతంగా కూర్చున్న
బుద్ధుని ధ్యాన ముద్రలమీద
పారేసుకుంటిని గదనే నిన్ను నా మనసా!
జెండాలు మారినా గండాలు దప్పలేదు!
మొగలి పూల గాలేదో గాయాలను
తాకుతున్నది.
ఎదురు నడిచిన కాలమేదో
హృదయాన్ని మీటి పోతున్నది.
నువు మూగదానినేగాని
చెవులున్నవి మనసా నీకు!
దేహమంతా నదులు పారుతున్నవి.
ఆకాశమంతా సుడులు తిరుగుతున్నది.
కాంతిపావురమైన మది ఎటో ఎగిరిపోయింది.
ఏమిసేతురా తండ్రీ!
పారేసుకున్న మనసు దొరికే లోగా
పండువెన్నెల సీకటాయె!
నిదురలేచిన తూరుపేమో తెలతెల్లని రేకలాయె!
వెలుగుపిట్టల దోసిలాయె !!

## సింధూకి ప్రేమతో

- కాశి రాజు

97010 75118

ధమనులు ధైర్యం కోల్పోయి
సిరల్లో సింధూ ప్రవహిస్తుంటే
టీవీలకు అతుక్కుపోయి బంగారానికి
ఆరాటపడ్డ హృదయాలు కూడా నిన్ను
శ్వాసలోకి తీసుకున్నాయ్.
ఓ కుచ్చులపిల్లా
దేహాన్ని దేశం చేసుకున్నదానా
హృదయాల్ని షటిల్ కోర్ట్ చేసి మళ్ళీ ఎప్పుడైనా
కలియ తిరిగేందుకు
మహా అయితే ఇప్పుడు నిన్ను గానం చేసిన
గుండెలకి క్షమాపణ చెప్పు.

దేహాలే దేశానికి ప్రతీకలయ్యే సమయాలమీద నీ
గెలుపు యుద్ధం,
ఓటమి జీవితమని మభ్యపడకుండానే
ఓ కుచ్చుల పిల్లా!
మళ్ళీ నీ ఉనికిని పాటెత్తుకున్న ప్రతీ గొంతులో
ప్రార్థనై
మా గుండె గుడిలో కనీసం నాలుగేళ్ళకి ఓసారి
నిలబడు. అచ్చం నీలాగే వినబడు.

## జీవితమై ప్రవహించు

- నూకా రాంప్రసాదరెడ్డి
70753 51877

మిత్రుడా
నీ ఉత్తరం చదివాక గానీ తెలియలేదు
నీవింతటి ధైర్యశాలివని
అక్షరాలన్నీ తడితడిగా తగిలితే గానీ
తెలియలేదు
నీవెంతటి ఆశాజీవోనని
వైఫల్యాల రుచి తెలీకపోతే
గెలుపులో అందంలేదు, ఆనందంలేదనే వాడివి
చెప్పలేనంత దుఃఖాన్ని తాగి
రెప్పచాటు ఉప్పెనలెన్నో దాటి
జీవితాన్ని నాలుగైన్ల రహదారిలా విస్తరించుకుని
నిటారుగా నిలబడుతున్న వేళ
నిన్ను నమ్ముకున్నవాళ్లని వదిలి
యే బోధి చెట్టు కిందకు వెళ్లావు మహాత్మా!
మనిషెప్పుడూ నదిలో నీటిలా వుండాలనే
వాడివి
ముట్టుకుంటే చాలు కరిగిపోవాలనే వాడివి
అంతో యింతో మిగిలిన హృదయాన్ని
కరెన్సీలతో కప్పేసుకుని
యెవడికి వాడు శవపేటికల్ని సిద్ధం
చేసుకుంటుంటే
నిశ్శబ్దంగా నిశ్శబ్దంలోకి నడుచుకుంటూ
వెళ్లిపోయావా మిత్రమా?
యెప్పుడూ మౌనంగానో
పొద్దునపూట సూర్యోదయమంత నిర్మలంగానో
నవ్వుల వెలుగుతో కాంతినిండిన కళ్లతో
లోకాన్ని జయించే పసిపాపలా వుండేవాడివి
లోలోపల నిరంతరాయంగా
ఒక సంగీత ఝరి ప్రవహిస్తుండేది
వర్షంతో చిక్కుకుని దారి తప్పిన రాత్రికి
ఉషోదయం వెలుతుర్ని పంచినట్టు
నీ ఆలోచనలు సంచలనాలై
ఒక కొత్త సృష్టికి పురుడు పోసుకుంటాయి
అయినా సరే, అనివార్యంగానే అడుగుతున్నా
చావడానికున్న ధైర్యం
బతకడానికెందుకు లేకపోయింది మిత్రమా !

## విధ్వంస చిత్రం

- శివ్
98485 27109

బాంబులు బద్ధలౌతున్నాయ్
కత్తులు కుత్తుకలను
కర్కశంగా కౌగిలించుకుంటున్నాయ్
తుపాకుల్లోంచి తూటాలు
విశృంఖలంగా దూసుకొస్తున్నాయ్
బాంగ్లా దేశ్ లోనో, బాగ్దాద్ లోనో
టర్కీలోనో, ఆర్లెండోలోనో
భూతలంలో ఎక్కడో ఒకచోట
మతి మతంలోకి అతి తీవ్రంగా
మళ్ళిన ఒక మాదర్చోదో
స్థిమితం తప్పిన చిత్తంతో ఒక చంచలుడో
నరమేధాన్ని సృష్టిస్తాడు
తాను ఆత్మాహుతి చేసుకుని
అమాయకుల ప్రాణాలను
అనంత వాయువుల్లో విలీనం చేస్తాడు
ప్రపంచ దేశాలు ఒక్కసారి ఉలిక్కిపడతాయి
తీవ్రవాదాన్ని తుదముట్టించే వరకు
తాము నిద్ర పోమని
నాయకులు ప్రతిజ్ఞ మళ్ళీ పూనుతారు
మరుసటి రోజునుంచీ కథ
మరొక్కసారి మొదటికొస్తుంది
తాజాగా మరో ఉగ్రతాండవ కాండ
తారాస్థాయిలో పత్రికల్లో నిలుస్తుంది
చర్విత చర్వణంగా
చరిత్ర పునరావృతమౌతుంది
ఏమిటి ఈ సమస్యకు పరిష్కార మార్గం?
మనుష్యుల మనసులు వికసించినప్పుడే
సృజింపబడుతుంది ఇలలో అసలైన స్వర్గం!

## చెక్ పోస్ట్ ..!

- పెరుగు రామకృష్ణ
98489 23443

జీవితాన్ని దృశ్య కావ్యం చేసుకుంటూ
పంచుకున్న ప్రకృతి అందాల పేజీల్లోంచి
అక్షరాల పిడికెడు ముద్దలై
ఆ కూడలిలో కలుసుకుంటారు
రెండు పెదవుల చివర నవ్వుల్ని
హెడ్ లైట్స్‌గా మలుచుకొని ఒకరు
వికసించిన గుండెల లయను
రహదారి బాటగా మార్చుకుని యింకొకరు
ప్రపంచమంతా విస్తరించిన రాస్తాల్లో
మజిలీ చలివేంద్రాలై నిల్చిన చెక్ పోస్ట్ లో...
చిరునామాలు వేరైనా
చేరాల్సిన గమ్యాలు వేరైనా
ఒకటిగా వొచ్చి పలుకరించుకుంటారు
ప్రవహించే నది లాంటి మనిషి
నదుల వారధి లాంటి ఆ సముద్రపు గది వద్ద
ఆగి
ఆత్మాలింగనం చేసుకుంటారు
భాష వేరైనా, యాస వేరైనా, వేషం ఏదైనా
వాళ్ళ పలకరింపు ఆత్మ మారదు
వారి ఆలింగనాల వేడి చల్లారదు....
ప్రపంచంతో పాటు నడుస్తున్నట్టే వుంటారు
కానీ, ప్రపంచం అంతా వాళ్ళ వెనకే వుంటుంది
మబ్బుల కావల నీలాకాశం వొదిగినట్టు
కురిసిన వర్షపు జల్లుల్లా వాళ్ళంతా
ఒకే ఆకాశం క్రింద
స్వేద నక్షత్రాల కాంతిలో
హమ్ సబ్...సాత్...సాథ్...హై
అనే సమైక్యతా రాగం పాడుకుంటారు
ఎండనక, వాననక, నిరంతర ప్రవాహమై
సాగిపోయే ఆ జీవితాలను అనివార్యమై
ఆ మలుపు గది ఆపుతుంది...
ఎగురే పక్షులని సాయంత్రం నిడువాలుపు
చీకటిలో
సేదతీర్చే పచ్చని చెట్టు లాంటి గది
మనుష్యుల యాతా యాత జీవితంలో
వాణిజ్యపు విలువలకు త్రాసైన ఆ గది ముందు
క్షణమైనా ఆగక తప్పదు
ఒక ప్రియ శ్వాస కోసం....!!

(సరిహద్దు తనిఖీ ప్రాంగణంలలో నిత్యం
గుమికూడి వుండే డ్రైవర్‌లను చూశాక..)

## నదిని జ్ఞాపకంగా

- మందరపు హైమావతి
94410 62732

సిమెంటు రంగు తప్ప
ఏదీ కనబడని
నగర నరకాన్ని దాటి
లోపలికి ప్రవేశించానో లేదో
సరికొత్త ప్రపంచంలోకి ఆహ్వానిస్తూ
కరచాలనం చేసే తరువులు
అడుగుపెడితేనే మాసిపోయే
ఖరీదైన గచ్చు కాకుండా
చెక్క మెట్లు ఒక్కొక్కటి ఎక్కిపైకి వెళ్తుంటే
ఒక మార్మిక ప్రపంచంలోకి
వెళ్తున్న పారవశ్యం

పెళ్ళి ఊరేగింపులో
పెట్రో మాక్స్ దీపాలు
తలపై పెట్టుకొని నడుస్తున్న మనుషుల్లా
దారి పొడవునా నిలచిన
తరు దీపస్తంభాలు
గది కిటికీ తలుపులు తెరవగానే

చెట్ల సందుల్లో నుంచి
కనువిందు చేసే నదీ సోయగం.

సాయంకాలం స్నానం చేసి
నదీ సుందరి అలల అద్దం చూసుకుంటూ
నుదుటి మీద గుండ్రటి కుంకుమబొట్టు
దిద్దుకొనేవేళ
ఎక్కువైన కుంకుమను
అటూ ఇటూ సరిచేసికొంటున్నట్లు
సందెవేళ చెల్లాచెదురైన
నారింజరంగు మబ్బులతో
రసరమ్య నదీ కావ్యం ●

**(విజయవాడ భవానీ ద్వీపం అందాలను చూసి)**

## ఇష్టయాతన

**- ఎలనాగ**

9866945424

గుండెమీద నిరంతరం
ఒక బరువైన దిమ్మ
కుమ్ములో చెక్కిన మనసు
సన్నని సెగ మీద ఆగదు కాలుతూ -
బొమికల లోతుల్లో వెలితిక్రిమి
ఎప్పుడూ కొరుకుతూ కదుల్తూ
చంపదు చావనివ్వదు
తరగని దాహం తీరదు ఎంత తాగినా -
సగం నిండిన కప్పునీళ్ల కనపడని యాతన
ఖాళీగా వున్న మరో సగం వెక్కిరించే భూతం
చిన్న ఉల్లాసాల బుడగల్ని చిట్లజేసే
పెద్ద వైఫల్యపు సూది
శూన్య ఎడారులకవతల మరులు గొల్పుతూ
సీతాకోకచిలుకల పంట
రాయకపోవటం బాధ
రాయటం ఇంకా పెద్ద ప్రసూతి బాధ
రాస్తూ రాయక రాయాలనిపిస్తూ
ఇది ఎంతకూ తెగని యానం
ముళ్లకంపలు ఒరుసుకుపోతున్నా
ముందుకు సాగటమే ఇష్టమైన ప్రయాణం. ●

## ఆత్మ గౌరవం..!

**- పెరుగు సుజనారామం**

ఎన్ని ఉదయాలు
ఎన్నెన్ని సాయంత్రాలు
నెత్తిన ముసుగుతో
చేతిలో చెంబుతో
చెట్టు పొదల్ని ఆసరా చేసుకుని
మమ్మల్ని మేం కోల్పోయాం...
తరాలుగా చెప్పలేని.
చెప్పుకోలేని ఆకృత్యాల పాలయ్యాం.......
డెబ్బయేళ్ళ స్వాతంత్ర్యం సాక్షిగా
ఇప్పుడొక పిలుపు
మా ఉనికిని,
మా ఉలికి పాటుని గుర్తించింది
మా ఆత్మ గౌరవాన్ని పలకరించింది...
ఇప్పుడు
కురిసే చినుకుల సవ్వడి లో
మనసంతా ఆనందపు అల్లరి చేస్తుంది
ముసుగు తొలగించి
తలెత్తుకుని నడవగలుగుతున్నందుకు
మా మాన రక్షణ కోసం
ఒక అభయ హస్తం కాపుకాస్తున్నందుకు
స్వేచ్ఛా భారతంలో
మా కోసం ఒక స్వచ్ఛ ఆలోచన మొలకెత్తినందుకు
మాకోసం ప్రతి ఇంటా అన్ని గదులతో పాటూ
మా పరువు నిలిపే ఒక మరుగు గది కూడా
వెలుస్తున్నందుకు...
తరం మారిందనే ఒక నమ్మకాన్నిస్తూ....
ఇప్పటికైనా స్త్రీకి అసలు సిసలైన..
ఆత్మగౌరవం ●

## బుద్ధుడు ఒక్కడే

- రెంటాల శ్రీ వెంకటేశ్వర రావు
77991 11456

దేవుడి గురించి కాక
మనిషి గురించి తపస్సు చేసిన వాడు బుద్ధుడు
స్వర్గానికి వేలాడుతున్న మనిషిని భూమి మీదకి దించి
ప్రేమగా దేవుడినుంచి అతనికి ముక్తిని ప్రసాదించిన వాడు
మనిషి జీవితాన్ని తిరిగి అతని చేతిలోనే ఉంచిన దయామయుడు ఆయన

కురుల చిక్కుకు దువ్వెన లాగా
అంతస్సంఘర్షణల చిక్కుకు ధ్యానాన్ని అందించిన వాడు
బహిస్సంఘర్షణల ప్రక్షాళనకు
మెత్తను ఉపాసించమన్న వాడు
జీవహింసా నిషేధంతో
జంతువులనే కాక మనలోని 'మానవుణ్ణి' కూడా కాపాడిననాడు
నెత్తుటి మరకల చరిత్రపుస్తకంలో
ఒక తెల్లటి అధ్యాయం బుద్ధుడు

రాజ్యాన్ని విడిచిపెట్టాడు దేశాలు ఆయనను ఆశ్రయించాయి.
కుటుంబాన్ని విడిచిపెట్టాడు జాతులు వరించి వచ్చాయి
తృష్ణని విడిచిపెట్టాడు నిర్వాణం సిద్ధించింది
విడిచివెయ్యడంలోని, నిష్కాంక్షలోని వైశాల్యాన్ని ఉదాత్తతని
ఆయన జీవితం ఉపదేశించింది.

ఆయన ఆనందాన్ని కాక / దుఃఖ రాహిత్యాన్ని బోధించినట్టు గమనిస్తే
మన లక్ష్యం ఆనందోద్రేకం కాక / శాంతి అయి ఉండాలని తెలుస్తుంది.
ఆరామాలను ఆయన మన దేవాలయాలుగా చేసినట్టు గమనిస్తే
అసలైన మతం దేని చుట్టూ ఉండాలో తెలుస్తుంది
ఆయన సిద్ధి స్థలాన్ని గమనిస్తే
ఎప్పటికైనా మనిషికి జ్ఞానోదయం
చెట్టుకింద ప్రకృతి ఒడిలో కావాల్సిందే అని తెలుస్తుంది.

## పుట్టినరోజు ఒక్కటే

- నేతల ప్రతాప్ కుమార్
98488 39669

ప్రకృతిలోని ప్రాణికోటిలో
మనిషికి ఒక్కడికే కదా
పుట్టినరోజు ఉండేది

మనిషికి మాత్రమే పుట్టినరోజు ఉంటే
మేము మనుషులుగా మారినరోజే కదా
మా పుట్టినరోజు

కొన్ని తరాల పాటు
కేవలం ప్రాణులుగానే బతికి
పశువులుగానే జీవించి
మనుషులుగా మారినరోజే కదా
మా జీవితాల్లో మరపురాని రోజు

అమావాస్య కడుపున పుట్టి
అంధకారం ఒడిలో పెరిగినవాళ్ళం
మేమంతా ఒకేరోజున
గొప్ప వెలుగుతో కలిసి జన్మించాం

సగంభూమి చీకటిలో ఉన్నపుడు
అర్థగోళమైనా వెలుగులో ఉంటుంది
జీవితం మొత్తం చీకటిలో తడిసినవాళ్ళం

ఆ రోజు నుండి సూర్యుణ్ణి చూస్తున్నాం
నెలకో కృష్ణపక్షమూ
ఒక శుక్లపక్షమూ ఉంటుంది
బతుకంతా కృష్ణపక్షంలోనే గడిపిన వాళ్ళం
ఆరోజు నుండే నిండు చంద్రుణ్ణి చూస్తున్నాం

కాలాన్ని బట్టి
ఆకులు రాలుతూ ఉంటాయ్
మోడులు చిగురిస్తూ ఉంటాయ్
కాలం మొత్తం
మోడులుగానే మిగిలినవాళ్ళం
ఆ రోజు నుండే
పచ్చపచ్చగా మొలకెత్తడం ప్రారంభించాం

మనిషన్నాక కన్నీళ్ళుంటాయి
ఆనంద భాష్పాలూ ఉంటాయి
'హిందూ' మహాసముద్రమంత
కన్నీళ్ళ కడలిలో జీవితాలను ఈదినవాళ్ళం
మా ముఖాల మీద
ఆరోజు నుండే
కాస్త నవ్వులు మొలవడం చూస్తున్నాం

ఎవడైనా సరే
ఈ దేశంలో జన్మించడం అంటే
అమ్మ చల్లని కడుపునుండి
కులం కుప్పతొట్టిలోకి పడడమే
అని తెలుసు గాని
అదనంగా మేము
అంటరాని పెంట జీవితం
యుగయుగాలు భరించినవాళ్ళం
ఆ రోజు నుండి మేము
అందరిలాంటి మనుషులుగా మారిపోయాము

మనిషిలాంటి పశువెవడో పుట్టి
మా నుదుటిమీద
రాక్షసులని రాసిపారేసాక
మా చావు మీకు పండగయిన వాళ్ళం
చెప్పులు కుట్టో మట్టిని పిసికో
బతుకుబండిని ఈడ్చడం తప్ప
ఏ పండుగకూ నోచుకోనివాళ్ళం
ఆ రోజు నుండే
గుండెల్లో నిండుగా పండుగ చేస్తున్నాం

అదే మాకు నిజమైన పండుగరోజు
వెలివాడకు మనుగ్రహణం విడిచినరోజు
మేమంతా ఒక్కసారిగా జన్మించినరోజు
మాకు విడివిడిగా పుట్టినరోజులుండవు
మీ పుట్టినరోజు ఎప్పుడని
ఇక నుండి ఎవరూ మిమ్మల్ని అడగకండి
మేమంతా పుట్టినరోజు ఒక్కటే
ఏప్రిల్ పద్నాలుగు ఒక్కటే

## ఇమం నావం సిత్తాతే లవూ మేస్సతి

- జి. లక్ష్మీనరసయ్య
92465 72073

కొడుతూ ఉంటేనే ఆ గంట మోగేది
చేతులు మార్చుకొనయినా చతికిలబడయినా
వంతుల వారీగా తంతుల కతీతంగా
కొడుతూ ఉండాల్సిందే
వేసిన ఈల తెగేలోపు మరో ఈల
ఎలలో దూకాల్సిందే.

ఎంత మొనదేలిన పెన్సిలయినా
చేతి కొసల్లో కుదిరినప్పుడే
దస్తూరి రాస్తాలో విస్తరించేది.
పగళ్ళ నరాలకు పొగబెడుతూ పోతే
కొమ్ములు తిరిగిన డప్పయినా చప్పబడాల్సిందే.
శాక్యో ఫోన్లతో శబ్దాన్ని కడిగి పారబోస్తుంటే
సన్నాయి గుక్కపట్టి నీకోసం పాడదు.

ఊరు కరిచినప్పుడో దారి ఉరితీసినప్పుడో
జముకేదీ కంజరేదీ కుందేదీ డోలేదీ అని
గవ్వపగిలి గలగలా ఎగిరి ఆవిరైపోయిన పాట
ఉరికొచ్చి నీచేతిలో ఊడి పడదు.

నేలపాలయిన పాలు ఎగిరి పొదుగులో
కూర్చోవు
తునిగి రాలిన పండ్లు తిరిగి చెట్టెక్కి కొమ్మల
ఛాతీకి అతుక్కుపోవు
ఎప్పటికప్పుడు కట్టెల్ని ఎగదోస్తూ
విడతల వారీగా ఊపిరిని ఒలిచి
తినిపించినప్పుడే పొయ్యి వెలిగేది
తనువు మీద ఎరుపు పడుతుంటేనే అక్షరాలు
మాటలుగా
పదాలుగా వాక్యాలుగా అల్లుకుపోయి
వృక్షాలయ్యేది.

పాటల్ని తాగుతూ గట్టు మీద ఒరిగితే
వరిచేను బరువుతో వంగి కంకులు కంకులుగా
పరుచుకోదు.
గడలు గడలుగా చెరుకు ఊరంత పొడవై
చరిత్రను తిరగరాయదు.

పేనుబడి చేను కాలాక చేసేది కాదురా సేద్యం.
రాలిపడ్డ ఎండపొడల్లో పొరాడటం కాదు వై
వైద్యం.
లేచి ఆ నీటి కడ్డంగా ఉన్న రాయిని బయటికి
లాగు.
పడవలో కడవల కొద్దీ పేరుకున్న నీళ్ళను
పారబొయి.
ఇగిరిపోయిన పొగరుకు పసరుకట్టు బిగించు.

*(పాళీభాషలో పడవలో చేరిన నీళ్ళను పారబోస్తూండు అని అర్థం)*

## మధ్యాహ్నపద్యం

- బుర్రా సాయిబాబు
92912 91751

వీపుమీద మూపురంలా కొన్ని ఆశల్ని
మోసుకుంటూ,
దారంటా ముడుచుకున్న నక్షత్రాల్ని
చూస్తున్నప్పుడు, అనిపిస్తుంది!
ఎలా మొదలైందో ఈ ప్రయాణం,
అడుగులు కదలవు! ప్రగతికనిపించదు!!
పట్టున పగటి వెలుగుచూసిన
దాఖలాలె కనిపించవు
రాత్రినీడనులాగేసుకున్న వైనం మాత్రం
తెలుస్తోంది
ఎప్పుడు మొదలైందో ఈ ప్రయాణం
కక్ష్యలులేవు లక్ష్యాలు లేవు
కాలం నన్ను తాకకుండానే
ముందుకు వెడుతోంది
తియ్యటి వాసనేదో
నాసికాగ్రాలకి తగలకుండా వెళ్ళిపోవడం
తెలుస్తోంది
వువ్వెత్తున ఎగసినబూదిదరంగు పొగలో
నా రేణువేదో తెలియడంలేదు
నావునికిని నిర్ధారిస్తూ కొంచెం వేడి
ఇంకా మిగిలి వుంది!

## తొలి అడుగు..

- డా॥ కాంచనపల్లి

96760 96614

పట్టాలకు వ్రేలాడే రైలు బండి లాంటి

అతను

పొగకక్కడమే జీవితమనుకొంటాడు

చివరికి మిగిలేదేముందని

ఎవరు ఎంత ప్రశ్నిస్తే ఏమిటి

తానుకూడా ఒక అవశేష దుఃఖమని

ఎంతకూ అర్థం చేసుకో లేదు

తాను బతుకగా మిగిలిన

ఏ కొంచెం గాలో అది

దాన్నైనా శుభ్రంగా పీలుస్తాడా అంటే

అబ్బే అసలు ఇష్టపడడు

అగాధ వ్యాకరణం

సరళీకరణం చెందినప్పుడు

ఒక రసోన్మాదంవల్ల

తనకు నచ్చిన ఈ ప్రపంచాన్ని

ఒక నిమిత్త చర్యగానే అర్థం చేసుకొన్నాడు

పాపం......

విజయోత్సవం కూడా

అనాగరిక యుద్ధ సంకేతమేనని

అతడెపుడు గుర్తిస్తాడో

వెలసిన దీర్ఘనిద్రలో

అతడు కనువిప్పిన క్షణం

మహా ప్రస్థానానికి

మొట్ట మొదటి

అడుగు పడుతుంది.

## వెకేటింగ్

- అనిల్ డ్యాని

9703336688

ఆ సాయంత్రం
ఆమె గేటు తీసుకుని లోనికొచ్చేప్పుడు
ఓ నిద్రగన్నేరు ఆమె పాదాల వద్ద రాలింది
కళ్ళు లేటయిందా అని ప్రశ్నించాయి
దేహం మురికిది కదా
ఓ నాలుగైదు పొరలుగా సబ్బు అరిగి
ఆమెకు పరిమళం పూసేసింది
ఛామన ఛాయ రంగు దేహం
చిన్న దీపపు వెలుతురులో
డబుల్కాట్ బెడ్పై వెన్నెల్లా పరుచుకుంది
అక్కడక్కడా పుట్టుమచ్చలు
కాలిన గాయాల మచ్చల్తో కలిపి
గతపు తాలుకా గాయాల జ్ఞాపకాల్ని
ఆమె దాచ దలచలేదు
జీతం, జీవితం, ఎక్కే గడపా, దిగే గడపా
మాటల్ని కుప్పగా పోసి
కొసరి కొసరి వినిపిస్తుంది
బయట వర్షం, గదిలో ఏసి ఒకేసారి ట్యూన్ అయ్యాయి
రాత్రంతా సముద్రం ఆటుపోట్లకి గురైంది
ఇనుప కడ్డీకి కట్టేయబడిన నావ అల్లకల్లోలమైంది
మల్లెలు మరణించాయి.
మరికొన్ని మచ్చలూ కొత్తగా చేరాయి
బాహ్య ప్రపంచం వాన తాలూకా చలికి వణుకుతోంది
పర్స్ లోపల నోట్లు పెళ పెళ లాడుతున్నాయి
ఆమె వెనుతిరిగింది
రాలిన పూలపై నడుచుకుంటూ వెళ్తుంది
ఆ రాత్రే అవి మరణించాయి, ఆమెతో సహా
అవి మళ్ళీ పుట్టవు.... తాను మాత్రం సాయంత్రం
పునర్జన్మిస్తుంది
రూం నెంబరు 173 వెకేట్....
బయట ఎవడో గోడకి సున్నం వేస్తున్నాడు
దారంతా శవయాత్రలో రాలిన పూలు
అవి, నా మనసు మళ్ళీ బతికే అవకాశం లేదు
రాత్రి వానకి గట్టు కోతకి గురైంది
ఎంతకోతో ఆ గట్టుకీ తెలీదు.

## నన్నడుగు

- వీరెల్లి రవి

నీ కాలి పట్టీలు పాడే గతుల సంగతుల గురించి
నీ జడకుప్పెలు పోయే హొయల గురించి
నీ కళ్ళలో అరవిచ్చుకునే మంచుపిండి మొగ్గల గురించి
అసలే అడక్కు
నాకేం తెలీదు.

నీ అడుగుల సవ్వడి విసిరే ఆగ్రహారావాల గురించి
నీ పెదవివిరుపుల మెరుపుల్లో జ్వలించే మాటల గురించి
నీ జడ విసుర్ల గతీ గమనం గురించి
నన్నసలే అడక్కు
నాకేం తెలీదు.

కానీ
నీ కంటికి నా కంటికీ మధ్యన
కనీకనిపించని ఆ గులాబీవారధి గురించి

నీ మనసునీ నా మనసునీ కట్టేసిన
ఆ వేయి వెలుగుపోగుల దారం గురించి

నా కళ్ళలో పండే బాధని నీ కళ్ళతో యిట్టే కోసి రాలుస్తావే
ఆ కన్నీటిబొట్ల గురించి నన్నడుగు

ఏడేడు జన్మల వెనకనించీ చెప్పుకురాగలను.

## నీకు నువ్వు మాత్రమే

- అరుణ నారదభట్ల

మౌనమెందుకూ
గుండెలోని సముద్రం కళ్ళలోకి రానివ్వు
తుళ్ళిపడే అలను చూసి అందంగా మారిపో
క్షణకాలమే కావచ్చు... కానీ జీవితం
ఎవరికోసం త్యజించనక్కర లేదు
నీకోసం నువ్వు మాత్రమే ఇక్కడ

ఆ పువ్వును చూడు
ఎవ్వరికోసం ఆరాటపడదు
ఎవ్వరో ఉద్ధరించాలనుకోదు
ఏ పూజకోసమో పుట్టాననుకోదు
ఏ జడనో చేరుకోవాలనుకోదు
ఒంటరిగానూ ఒదిగిపోదు

ఎదలోతులు ఎవరికి తెలుసనీ
పెదవులు
మనసుతో స్నేహం చేస్తూనే ఉంటాయి
మనం ఉన్నంత వరకు
కానీ బాహ్యప్రపంచానికి ఎంతవసరమో
అంతే స్పందిస్తాయి

ఉన్నచోటే ఉండి ఆకాశానికెగురుతుంది
నీళ్ళలో మునుగుతుంది
సంద్రంలో పయనిస్తుంది
చెట్టుపై కోయిలవుతుంది
ఎక్కడికంటే అక్కడికి
టికెట్టక్కరలేకుండా
విశ్వ సందర్శనం చేస్తుంది మనసు ఏకాంతంగా

ఎక్కడైనా నువ్వనుకుంటేనే ఈ అందరూ
నిజానికి నీకు నువ్వు మాత్రమే

## మెతుకు

- ఈతకోట సుబ్బారావు

94405 29785

వాన మబ్బు కొసిరే చినుకు కోసం
ఆకుల చేతుల్ని చాపి
ఎదురు చూసే మొక్కకి తెలుసు -

పంటల్లేక ఎండకెండి పోయి
కడుపు నెర్రెలిచ్చిన
నేలతల్లి మనసుకు తెలుసు -

రాత్రంతా చలికి వొణికిపోయి
హండ్రెడ్ వోల్టుల బల్బు వెలుగుల్లో
నిద్ర మరచిన ఫారం కోళ్లకి తెలుసు -

అయినా తెలియని దెవరికని ?
అందరికీ తెలిసిన వాస్తవమే.

అమ్మా-నాన్ననీ, వూరు-వాడనీ, యింటినీడని
వొదిలి ధర్మసత్రం లాంటి ప్రభుత్వ హాస్టళ్లలో
అడ్డమైన గడ్డినీ అమృతంలా తింటున్న
అమాయకులైన పిల్లకాకులకీ బాగా తెలుసు
ఆకలి రుచెరుగదని!

నీళ్లచారూ, గొడ్డుకారం, వుడికీ, వుడకని
మెతుకులే
మృష్టాన్న భోజనమని!

గుర్రాలకీ, గేదెలకీ చాకిరిగొడ్లకి గడ్డి కోసినట్టు
తమ సత్తు గిన్నెల్లోకి ముద్దన్నం చేరితే
కళ్లకద్దుకొని ఆరగించే బాలబ్రహ్మలు
నేటి భారతంలో కోకొల్లలు.

పెచ్చులూడిన గచ్చునేల మీద పడక
భీష్ముడి మరణాన్ని తలపించకపోదు
సగం ఖాళీ కడుపుతో నిద్రోతున్న బుడతలకి
తమని మింగేస్తున్న రోగాల కొండచిలువ
కలలోకి రాక మానదు.

ప్రతి మెతుకునూ పట్టి చూడనట్టే
ప్రతి విద్యార్థినీ పలకరించనక్కర్లేదు
మధ్యాహ్న భోజన పథకంలో
రాళ్లు నిండిన అన్నంలో మెతుకులేదనక్కర్లేదు
హెడ్ మాస్టర్లూ మినిష్టర్ల
తడిసిన చేతులు చెప్పే సాక్ష్యం
వీళ్ల గుండెలు తడిలేని బంజర్లని
దయామేఘాల తుంపర్లు వీటిని తడపలేవనీ
మెతుకులా వీళ్లు మెత్తబడటం
కలలోని సేద్యమే అని !

## బాంధవ్యము

- దూసి శ్రీరామమూర్తి

88863 08886

అనిపిస్తుందది
అందంగా ఉందని.
చిరిగి మరుగుపడిన అంగవస్త్రము
దానం చేయాలనుకుంటే.
అగుపిస్తుందది అపురూపంగా
అరిగి-విరిగి ఉపయోగంలేని
ఇంట ఏ వస్తువైనా ఎవరైనా కావాలంటే అందుకేనేమో
దానంచేయని చిరుగు అంగవస్త్రము
కన్నీళ్ళిడుతూ గదులూడ్చు.
నిజమేనేమో నిజరూపంలేని
అరిగి-విరిగిన వస్తువు
నరాల్ని రేకెత్తించి
నిలకడలేక ఇల్లంతా నడుచు.

## సాయుధం కావాలి వెన్నెల

- పిల్లి కవితామల్లి
80963 53324

వెన్నెలా వెన్నెలా వెన్నెలా
అందాల సుందరి వన్నెలా
వికసించు పుష్పాల నవ్వులా
వయ్యారి నాట్యాల మువ్వలా

పూరిపాకల మీద కసిదీర కురిసింది
పూలజడ జవ్వనితో చిందేసి ఆడింది
అటు ఊగి ఇటు ఊగి వాడపై చెలరేగి
చిరుగాలి చెలికాని ముద్దాడ పిలిసింది.

తెల్లని వెన్నెల చల్లని వెన్నెల
మృదువైన వెన్నెల మత్తైన వెన్నెల
మరుమల్లె అందాలు వెదజల్లు వెన్నెల
గోదారివరదలా జారేటి వెన్నెల

రేలపాటలలోన పదుచు ఆటలలోన
మల్లెతోపులలోన సందెవేళలలోన
కన్నెగుండెలలోన కందిచెలకలలోన
జలజలారాలింది వెన్నెల జతగాన్ని పిలిసింది
వెన్నెల

అడవి బిడ్డలగోదు ఎవరు వినగారారు
ఎవరు వారికితోడు న్యాయమైన పోరు
నలుగు చీమల బారు రక్తపు టేరులు పారు
సాయుధం అవ్వాలి వెన్నెల సమరము చేయాలి
వెన్నెల

నిలువనీడలేని నిర్భాగ్యులెందరో
నిట్టనిలువున కూలు చిగురుటాకులు ఎన్నో
మాననిగాయాలగుండెల యతలెన్నో
ఏమని చెప్పుదు వెన్నెల ఎన్నని చెప్పేది వెన్నెల

చిట్లిపోయిన నొసలు ఎన్నని చెప్పేది వెన్నెల
తెగిన బతుకుల గొలుసు పతివాడికి తెలుసు
జీవితం లేదసలు మా బాధలెవరికి తెలుసు
నాదేశమే నన్ను వెన్నెల నంజుకొని
తింటుంది వెన్నెల

దేశదేశాలను తిరిగేటి వెన్నెలా
కలనైన తెగిపోని ఆత్మీయ బంధమా
ఆకుమెదిలినగాని వెన్నెలా
కనుగుడ్డు కదిలినగాని వెన్నెల
తూటాలుపేలేను వెన్నెలా స్వప్నాలు
కూలునే వెన్నెలా.

## హేమలత జానకమ్మ కోడలు

- వర్మ కలిదిండి
99489 43337

ఇద్దరు పోతుమారాజుల్ని కన్న అగ్ని
తిరుమల వెళ్ళాదు
తిరుపతికి అల్లంతదూరం నుంచి
వకుళ మాత అందరినీ కనిపెట్టుకుంటూనే ఉంది
తిరుగు ప్రయాణంలో...
ఒకటో నంబరు ప్లాటుపారం
ప్రకటన మీద ప్రకటనలు
తప్పిపోయిన పిల్లల తలితండ్రుల కోసం
పిల్లని చేరదీసి ఊరుకోబెట్టి పోలీసుకు
వప్పచెప్పిన
హేమలత జానకమ్మ కోడలే కదా
మగపిల్లఓ కదండీ మనకీ... ఎవరూ
రాకూడదు..
తీసుకుపోయి పెంచుకుందామంది
పెనిమిటితో...
ఆశ నెరవేరే సంఘటనలా...
శ్రీనివాసుడికి నిత్యకల్యాణమే
కడుపుపంట పండితే చూడాలని..
వకుళ మాత ఎదురు చూస్తోంది.
పద్మావతో- శ్రీదేవో
తీపి కబురు చెప్పక పోతారా అని
అమ్మలు- తల్లులు
పిల్లలు దేవుళ్ళు

## కారంచేడు

- సురేంద్ర దేవ్ చెల్లి
984987851

ప్రకాశ భానుదని
ప్రకాశం జిల్లాలో
కారుమబ్బులు కమ్మేసాయి
అది
జులై 17, 1985.
గాలిలో ఈ తేదీ మాట
ప్రయాణిస్తుంటే
మల్లెల గుబాలింపు నింపుకున్న
చల్లగాలిలో ఊచకోత గాయాల
దళిత రక్తవాసన సెగలు సెగలుగా
నా కంటిని తాకి
కుడి-ఎడమ కాల్వలను తెరిచి
నన్ను రోదించేలా చేస్తున్నాయి.

మూడు దశాబ్దాల అమానుషం
ఇంకా కన్నీళ్లు ఇంకలేదు
రాత్రిళ్ళు ఇంటికి గొళ్ళెం పెట్టి
కర్రను చేతపట్టుకొని
కునుకు లేని
నా కన్నులకు తెలుసు
భయం గూటిలో
నిదురిస్తున్న మా పేట
జీవితాల గురించి.

అగ్రతత్వం మా కన్నుల ముందు
నడిచిపోతుంటే
గ్రహణం పట్టిన మా జీవితాలలో
రేపటి దశ చచ్చినట్లే.

తేళ్ళ-దుడ్డు వారి ఇంట్లకే జరిగిందని
మరి మాకెందుకు అంటూ
దుప్పటి ముసుగులో
మార్చురీశవంలా
నిదురిస్తున్నావా?
శభాష్.

## స్వచ్ఛ రాయబారులు

- అన్నవరం దేవేందర్
94407 63479

ఆమె రహదారిలో పరుచుకున్న మాలిన్యాన్ని
సవ్యంగా శుభ్రపరిచే పరిచారిక

పొద్దంత పోగుబడ్డ చెత్తా చెదారాన్ని
ఆహొరాత్రులు స్వహస్తాలతో
స్వచ్ఛపరుస్తుంది.

ఆమెకు నిద్ర అలసట పవలింపులు లేవు
రాత్రంతా పని ప్రయాణ కొలువులే

రోడ్ల మీద నగరీకులు విసిరేసిన
సకల అపరిశుభ్రాల్ని తొలగించే మాన్విత

రద్దీ రవాణా నిద్రపోయిన తర్వాత
రహదారులు అలసట తీరిన యాళ్ళ
అప్పుడే మున్సిపల్ స్వీపర్ల మేలుకొలుపులు

హైదరాబాద్ వరంగల్ కరీంనగర్ కార్పోరేషన్ల
వాడవాడల వెదజల్లే కాంతులు
ఆ మహాతల్లుల చీపుర్ల చలువే
మైలతీసిన నగరాలు తెల్లని మల్లెపువ్వులైతయి

పొరకల చీపుర్లలో నిత్యం నడిచి క్లీన్ చేసినా
ఎన్నడూ ఆ దారుల మీద డ్రైవ్ చేయని వాళ్లు

పని చేయడమే వాళ్ల జీవనం
కంట్రాక్టర్ల దగ్గర తక్కువకు ఎక్కువ పనిచేసే
ఎట్టి పువ్వుల రెమ్మలు వీళ్లు.

మన రహదారుల కోసం
రాత్రుళ్లను ధారపోస్తున్న వాళ్లు
వాళ్ల చీపుర్లకు, వాళ్లకూ ఒక్కసారి మొక్కాలి
నగర స్వచ్ఛ రాయబారులు ఆ వనితలు.

## ఒకనాటి అతిథి

- ఆర్. పద్మావతి
99663 07777

పొద్దున్నే
తలుపు తీయగానే
అలవాటయిన వాడిలా
లోపలికొచ్చేసి
కాస్తంత మొహమాటమైనా లేకుండా
సోఫాలోకి చేరిపోయాడు
అనక నా ఇండోర్ ప్లాంట్ ని
తడిమితడిమి చూసాడు
టేబుల్ మీద తెరచివున్న పుస్తకాన్ని
ఒకపరి పరికించాడు
లోపల గదుల్లోకి ఆసక్తిగా
తొంగి చూసి
ఫ్లవర్ వేజులోని పూల అందాన్ని గమనించాడు
టీవీ రిమోట్‌ను స్పృశించి చూసాడు
కర్టెన్ల నాణ్యతను కనులారా పరికించాడు
అలసిఉన్నాడేమో
ఆనక మంచంపై విశ్రమించేడు
అతిథిమర్యాదలు లేవు
అన్నపానీయాలసలే లేవు
సాయంకాలమవగానే
మళ్ళీ వస్తానంటూ
చల్లబడి వెళ్ళేడు
వెచ్చగా వచ్చాడు
వెలుతురై నవ్వేడు
దీపతోరణమై వెలిగాడు
మనసంతా నిండి
నాకు తోడుగా ఉన్నాడు
అందాల బాలుడే వాడు
అపరంజి భానుడు.

## నదిని చూస్తూ...

- దర్భశయనం శ్రీనివాసాచార్య
94404 19039

సరళరేఖలా కాక
ఈ నదెందుకు వొంపుల్తో
సాగుతుందో తెలియదు
వొంపు వొంపులో
సౌందర్య రేఖల్ని ఎలా
గీస్తుందో తెలియదు
వెళ్లేదేదో నిస్సవ్వడిగా వెళ్ళక
దీనికి సరాగాలెందుకో తెలియదు
ఏవో చెట్లనుంచి
వీచే గాలుల్ని
పాటలుగా ఎందుకు
మలుచుకుంటుందో
తెలియదు
ఈ నదీ గీతాల్ని వింటూంటే
నాకు చెట్లూ కోయిలలూ
ఎలా గుర్తుకొస్తున్నాయో తెలియదు
నదిలో మబ్బుతునకలు
ఎలా దాక్కున్నాయో
తెలియదు
ఈ తడి అద్దంలోకి

ఆకాశం ఎందుకు
తొంగి చూస్తున్నదో తెలియదు
ఈ జలస్పర్శకే ఘనశిలలెలా
మృదుల పడుతున్నాయో తెలియదు
మృదులశిలలమీద
యే కన్నులు మెత్తని
ప్రేమగీతాల్ని రాసుకుని
వెళ్లిపోయాయో తెలియదు
ఈ నదినిలా దర్శిస్తూ
ఇప్పటికిప్పుడు దానిమీదే వూగే
పడవనవుతున్నానా
అదీ నాకు తెలియదు
ఒకటి మాత్రం తెలుసు
నదిని నిరంతరం తాకి పులకించే
తీరం బతుకు ధన్యమని!

## పాండిచ్చేరి

- డా॥ ఎన్.గోపి

93910 28496

రోడ్లకేం కొదువ
నగరాలన్నిటా వుంటాయి.
కాని పాండిచ్చేరిలో
ప్రతిరోడ్డూ సముద్రం వైపే దారితీస్తుంది

కడలి గాలి
ఎన్ని దేశాల మీంచి ఎగిరొచ్చిందో
పాయలుగా విప్పి చూపడం కష్టం!
అటు నీటి సముద్రం
ఎదురుగా జ్ఞానసముద్రం
అరవిందా శ్రమంలోని నిశ్శబ్దం
సాగరహోరును మింగేసింది.

భూమ్మీద మట్టి అంతా
ఒక్కటే కావచ్చు
కాని వందల దేశాల మృత్తికను
ఒక్కచోట కుప్పవోయడం
వివిధ రంగులన్నీ
ఒకే పువ్వుగా పూయడం లాంటిది.

అరవిల్లి
భేదాలను తుడిచేసిన ఫ్రెంచి తల్లి.
సుబ్రహ్మణ్యభారతి
కాళ్ళకు పేదరికాన్ని తొడుక్కొని
సంచరించిన పుణ్యభూమి ఇది.
'సుందర తెలుంగు' భావనకు
ఎట్టాయపురంలో
గట్టి పూనాదులే పడ్డాయి.

గురజాడ ముత్యాలసరాలు
వెదజల్లిన సంవత్సరంలో
భారతీయార్ 'కుయిల్‌పాట్టి'తో
రత్నాలు వెదజల్లుతున్నాడు.
ఎటు తిరిగినా
గతంలోకి వెళ్తున్నట్లుగా వుంది.
ఫ్రెంచి విండోలు
విశాల దర్శనానికి ఆనవాళ్ళు,
చెన్నై నుండి పాండిచ్చేరి దాకా
డెబ్బై మైళ్ళ సముద్రతీరం
ప్రతి బీచీ
దాని పాదాల ముందు జనహారం.
మళ్ళీ వస్తామో లేదో!
వస్తే ఈ రాళ్ళు
నన్ను గుర్తుపడుతాయో లేదో!
హైదరాబాద్‌లో దిగగానే
చరిత్రలో
స్నానం చేసి వచ్చినట్టు స్ఫురణ
వెంట తెచ్చుకున్న యోగావరణ

**(కవిమిత్రుడు ఆకెళ్ల రవిప్రకాష్‌కు ప్రేమతో...)**

## అనువాద కవిత

హిందీమూలం: సంత్ కబీర్

తెలుగుసేత: వాడ్రేవు చిన వీరభద్రుడు

### అతడి పేరు నా వంటికద్దుకున్నాను

అతడి పేరు నా వంటికద్దుకున్నాను
అది ఎన్నాళ్ళైనా వెలిసిపోని రంగు
ఎన్నిరంగులైనా
సాటిరాని రంగు.
ఈ రంగు వంటికద్దుకోగానే
అన్ని రంగులూ చెరిగిపోయాయి
ఒక్కసారి పూసుకున్నాక ఆ వన్నె
ఎన్నటికి చెరగదని తెలుసుకున్నాను
కబీర్ అంటున్నాడు, అతడే
ఒక రంగై నన్ను హత్తుకున్నాక
మరే రంగులూ వంటబట్టవు.

### చెప్పలేనిది ప్రేమ కథ

చెప్పలేనిది ప్రేమ కథ
చెప్పగలిగే వాళ్ళూ లేరు
అది మూగవాడు తిన్న చక్కెర,
ఆ రుచికి చిరునవ్వు ఒక్కటే వివరణ,
ప్రేమ తరువు వికసించడానికి
భూమీ, బీజమూ అక్కర్లేదు
అంతులేని పండ్ల వెలుగు,
నా స్నేహితుడు నాకే రుచి చూపించాడు.
మనుసు పడి నేనతణ్ణి తలచుకోగానే
ఊహలన్నీ ఊకలాగా చెదిరిపోయాయి
కబీర్ అంటున్నాడు. ఆ శక్తి నాది కాదు
నాకు తోడు నిలబడ్డవాడిది.
మనసు మనసుని చేరుకుంది.
ఊగిసలాట ముగిసిపోయింది.

## అసూయ

- ఐ.ఎస్.గిరి

95533 23758

మీరంటే అప్పుడప్పుడు అసూయ
కలుగుతుంది
మీలా కీర్తి శేషున్నై
జాతి గర్వించే వీర స్వర్గం నేను పొందలేనని
అవును
మీరంటే నాకు అసూయ నాకు
దేశ సరిహద్దుల్లో ఎముకలు కొరికే చలిలో
తల్లిని- పిల్లని- పెళ్లాన్ని వదలి
దేశ భద్రత కోసం ప్రాణం పణంగా పెట్టే
మీరంటే అసూయ నాకు
మేమంతా మా కుటుంబాలకు సరి హద్దులు
కట్టుకొని
స్వార్థానికి బ్రతుకుతుంటే
దేశమంతా కుటుంబం చేసుకొని
సరిహద్దుల్లో కళ్ళను కాగడాలుచేసి
నిస్వార్థపు కంచెలు కట్టే మీరంటే
అసూయేనాకు...
కె.జి ల బరువు బూటులేసుకొని
బుజాన్న లగేజి, చంకలో తుపాకి మోసుకొని
మీటర్లు మీటర్లుగా కిలోమీటర్లు
నడచి నడచి మన కోటలకు కట్టిన
గోడలవుతున్నారు
తల్లి భారతికి మీరేముద్దు బిడ్డలవుతున్నారు
అందుకే మీరంటే అసూయ నాకు...
రొమ్ములో దిగుతుందో
నెత్తికే తగులుతుందో తెలియని
శత్రుదేశాల తూటాలకు
రొమ్మువిరుచుకు నిలబడుతున్న

మానవ పర్వతం లాంటి
మీరంటే అసూయనాకు
మీ ఇంట దీపం ఆర్పేసి
నూరు కోట్ల సహెూదర్లకు కాంతికిరణమయ్యే
మీ త్యాగమంటే అసూయ నాకు...
అయినా... అయినా
మీలా జాతి త్రివర్ణాన్ని
గుండెల మీద వేసుకొని
దేశంకోసం కడతేరిపోవాలని ఆశ...నాకు

## మన్నించు మిత్రమా

- ఆదూరి వెంకట సీతారామమూర్తి

94419 40653

నువ్వు గాయపడతావని తెల్సు
గాయం నిన్ను మృత్యుకుహరంలోకి
విసిరేస్తుందనీ తెల్సు
ఎన్నేళ్ల సహజీవనం మనది!
ఇవ్వడమేగాని అడగడం తెలియని త్యాగశీలివి
అయినా నీ పట్ల ఎంత నిర్దయ!
నీపుట్టుకేదో నీకే తెలియని వయసులో
తన అరచేతులమధ్య నిన్ను పెంచిందామె
నీ సుకుమార బాల్యం
అందమైన పచ్చని యౌవనం
నీ ఔదార్యం, నువ్వందించిన సుమధుర
ఫలాలూ
అన్నీ చూసి మురిసిపోయింది
నీ చల్లని నీడలో పులకించిపోయింది
నీ ఉపకార బుద్ధి
నీతోపాటు మాకూ మంచి గుర్తింపునే
తెచ్చిపెట్టింది
అయినా తప్పలేదు మిత్రమా
నిన్ను కాపాడటానికి ఆ చేతులిప్పుడు లేవు
మారుతున్న కాలాలకీ తరాలకీ అనుగుణంగా
మనసు మార్పిడి చేసుకుంటున్నవాణ్ణి
సకల ప్రాణికోటిలోనూ నిబడీకృతమైయున్న
సహజీవన సౌందర్యాన్ని
కడవరకూ పదిల పరుచుకోలేని అసమర్థుడిని
మరో జన్మంటూ వుంటే
మళ్లీ మీతోనే
కలిసి బతకాలనివుంది.

(ఇంటి ముంగిట్లోని పండ్లచెట్టుని తీయించాల్సి వచ్చినపుడు- బాధతో)

## ఏది నలుపు

- కొండూరి రామరాజు

95420 42003

రెండూ నలుపే అయినా
కోకిలంటే ఇష్టమా
కాకంటే ఇష్టమా
అని నన్నడిగితే
ఏంవని చెప్పేది ?
మా పిల్లల పిల్లలు
కేకలతో కేరింతాలు కొడ్తున్నప్పుడు
కోకిలే మా ఇంట్లోకి వచ్చి
వాలినట్టుంటుంది.
మా పిట్ట గోడ మీద వాలి
కాకి అరుస్తున్నప్పుడు
నా ఏడు తరాల వారూ
ముని వాకిట నిలుచుని
పలకరించినట్టుంటుంది.

## తను

- మోతుకూరు శ్రీనివాస్

98660 61350

వాడిన పసుపు నవ్వు
జారినకురుల వెండి తీగలు
గుండెలు దాటని శబ్దం
దీపకాంతిలో దేవకి
ఆమె ముఖం
లేత చిగురులా మెరిసింది
తను ఒక సందేహ రాగం
నిశబ్దంలో
ఆమె గొంతు విప్పింది
విరిగిన గాయం
అనంత శోకాన్ని మోస్తున్న
రెండు తనువుల ఒక బరువు
మూసిన తలుపులు
తనకు తను ఒక విదేహం

## రొట్టె లాంటి మనిషి

- శిఖామణి

98482 02526

రొట్టె అతణ్ణి కలవర పరుస్తుంది.
రొట్టె అతణ్ణి కలవళ పెడుతుంది
తను ఎరిగిన రొట్టె
తనకు చిర పరిచితమైన రొట్టే
ఎందుకో ఈ రోజు తనని తాను
కొత్తగా పరిచయం చేసుకొంటోంది.
మిత్ర సమూహం మధ్య కూచొని
సంభాషిస్తుంటాడా
మేఘాల్లో తెలియాడుతూ
చందమామ వచ్చినట్టు
రొట్టె అతని ఊహల్లో విహరిస్తుంటుంది.
క్రిక్కిరిసిన
జన సమూహాన్ని వుద్దేశించి
ఉద్వేగంతో
మహూద్రేకంతో
అతను ఉపన్యసిస్తుంటాడా
ఎదురుగా కూచున్న వారి మొహాల్లో
లీలగా రొట్టె కనబడుతూవుంటుంది.
కమ్ముకొస్తున్న కవిత్వం లాంటి
ఉదయపు పొగమంచులో
చూపుడు వేలితో
గాలిలో ఏదో రాస్తున్నట్టు సున్నాలు చుడుతూ
నడుచుకుంటూ వెళ్తుంటాడా
వెనక దూరంనుండి
తెలిసిన మిత్రుడెవరో
పేరుపెట్టి పిలిచినట్టు
రొట్టె అతణ్ణి పిలుస్తుంది.
పగలు సూర్యబింబం
రాత్రి చంద్రబింబం
చివరికి కాళ్లకింది బల్లపురుపు భూమీ
ప్రతీదీ అతనికి రొట్టె కిందే తోస్తుంది.
అంతెందుకు
కవిత్వం రాద్దామని
కాగితాన్ని ముట్టుకున్నా రొట్టెకూచుంటుంది.
బయటి ప్రపంచపు
సమస్త లౌకిక పనులూ పూర్తిచేసుకుని
దండెం మీది తువ్వాలును దులిపినట్టు
ఒకసారి తనను తాను దులుపుకుని

దేహమాళిగనుండి
మనోవల్మీకంలోకి దారిచేసుకుంటూ
ఇంటి ముఖం పడతాడు.
ద్వారబంధాల్ని
రెండు చేతులుగా చేసుకుని
పైకెత్తి ఎత్తుకోమంటున్న మనవడూ
పూర్తిచెయ్యని అబ్ స్ట్రాక్ట్ తైలవర్ణ చిత్రంలా
ఇంతకీ అర్థం అయీ అవ్వని జవ్వనపు
కొడుకూ
కాళ్లు కడుపులో దాచుకుని
ముడుచుకు పడుకున్న
పెంపుడు కుక్కలాంటి అలిగిన కోడలూ
మంచంలో కూచుని
అసహనంగా అటూ ఇటూ కదులుతూ
ఇన్సులిన్ ఎదురుచూపుల భార్యా
అందరూ అతని వెనకే
అడుగుల సవ్వడి వినబడనంత
మెత్తగా నడుస్తుంటారు.
అలా ఇంట్లోకి
అడుగు పెట్టాడో లేదో
కామరూప విద్య ఏదో తెలిసినవాడిలా
అతను
మనిషినుండి రొట్టెగా
రూపు మార్చుకుంటాడు.
మూడు వేళ్లకే
మృదువుగా చిదుముపడే
రొట్టెలాంటి అతణ్ణి
ఇంటిల్లిపాదీ
తలాఒక తుంపు తుంచుకుంటారు ●

(ఈ కవితనిచ్చిన గురువు కె. శివారెడ్డి గారికి)

## అనువాద కవితలు

హిందీ మూలం: దేవీప్రసాద్ మిశ్రా

తెలుగు: ఖాదర్ మొహియుద్దీన్

90009 76999

### బరువు

మనిషి దారిపక్క తన బరువు దగ్గర
కూర్చున్నాడు
ఎవరైనా వస్తే ఆ బరువును ఎత్తి తన నెత్తిమీద
పెడతాడని

ఎవరూ రావటం లేదు

ఒక మనిషి కనిపించాడు.
కానీ అతని నెత్తిమీద కూడా వుంది ఒక
బరువు.
కాస్తంత సాయం పట్టి కిందికి దింపుతావా
నా నెత్తిమీది బరువుని
అని ఎదురు చూస్తున్న మనిషిని అడిగాడు
అతను.

చాలా దూరంనుంచి, చాలా సేపటినుంచి
నెత్తిమీది బరువుని
మెల్లగాకిందికి దింపుకుందామని చూస్తున్నాను
మనిషి కోసం
ఇద్దరి సాయంతో నెత్తిమీద పెట్టించుకున్నాను.

ఇద్దరి సాయంతో మాత్రమే కిందికి
దింపుకోవటం సాధ్యం అన్నాడు.

ఎదురు చూస్తున్న మనిషి దింపించాడు
సాయం పట్టి కిందికి అతని బరువుని.

నీ బరువుని నెత్తికెత్తుకునేందుకు సాయం పడతా

నీ దారిన ముందుకు నీ ప్రయాణం
సాగించవచ్చు అన్నాడు
తరువాత వచ్చిన మనిషి ఎదురు చూస్తున్న
మనిషితో
నువ్వు వెళ్ళిపోయిన తరువాతే నేను వెళ్ళటం
సాధ్యం.
అప్పటివరకూ నేను వేచివుంటాను.
నువ్వు నాకూ, నేను నువ్వు వెళ్ళిపోయాక వచ్చే
మనిషి
నెత్తిమీద కూడా బహుశా బరువు
వుండివుండవచ్చు
నేను అపుడు దించుతాను కిందికి అతని
బరువుని.

తిరిగి నా బరువుని నెత్తిమీదికి ఎత్తుకునేందుకు
సాయం పడతాడు అతను.
తన బరువుతోపాటు కూర్చుని వుంటాడు
ఎదురు చూస్తూ
తన బరువుని నెత్తిమీదకెత్తుకునేందుకు
ప్రయాణం ముందుకు సాగించేందుకు
సాయపడే మనిషి కోసం.

మిగిలిపోయిన మనిషి ఎదురు చూస్తుంటాడు
ఎవరయినా వస్తారని... ●

## అమరత్వం

మహా అయితే నేను ఇరవై ఏళ్ళ తరువాత
చచ్చిపోతాను
నా కవితలు ఎన్నేళ్ళ తరువాత చచ్చిపోతాయో
చెప్పటం కష్టం, బహుశా అవి
నేను చచ్చిపోకముందే చచ్చిపోవచ్చు,
నియంతల పేర్లు ఎందుకోసం
అమరత్వం పొందాయంటే
వాళ్ళు నానా రకాల నియంత్రణ పద్ధతులను
ఆవిష్కరించారు.

నేనూ కొన్ని ఉపాయాలను
ఆలోచించాను, ఉదాహరణకు
మనిషిని చేరుకునే టికెట్టు
ఏ కిటికీలోంచి తీసుకోవచ్చు.

మరుపునకు గురైన ఒక కవి, ఎక్కువగా గుర్తు
చేసుకునే పాలకునికన్నా నిరంతరం నయమే
సుమా
అమరత్వపు అనంతత ఒక జీవితం కన్నా
పెద్దదేం కాదు. ●

## ప్రతిధ్వనులు

- డా॥ ఎస్. రఘు
98482 08533

రాజకీయ ఆకాశంలో
అవకాశవాద విహంగాలు
ఎగురుతూనే వుంటాయి
వాగ్దానాల్ని నింపుకున్న
ఎన్నికల మబ్బులు
ప్రజల ఆశలతో ఆడుకుంటూ
పోలింగ్ ముగిసాక అదృశ్యమైపోతాయి!

ప్రతిరోజూ సూర్యుడు
ప్రశ్నారూపంలో
ఉదయిస్తూ
కాలపత్రం మీద
భవిష్యత్ సంతకాన్ని చేస్తుంటాడు!

ఎన్ని సాంకేతిక అద్భుతాలు
ఆవిష్కారమవుతున్నా
నీకూ నాకూ మధ్య

సిగ్నల్స్ అందడం లేదు
గ్లోబల్ విలేజ్‌లో
రాజ్యానికి సమాజానికి మధ్య
ఆరిపోని అగ్నిజ్వాల
రగులుతూనే వుంది !

రంగులు మార్చే
రాజకీయ జెండాలు
కుట్రల్ని రాజేస్తూనే వుంటాయి

ఆధిపత్యపు కోటగోడల్ని
బద్దలు కొట్టిన శక్తులివి.
మట్టిలో దాగిన విత్తులో
ధాన్యాగారాల్ని దాచిన చేతులివి!

బతుకులో ఊరుతున్న
కన్నీటి ఊటను
ఏ ఇంకుడు గుంతలోకో
మళ్ళించాలి!

దుఃఖపు ఎడారుల మీద
ఆకుపచ్చని స్వప్నాల్ని
మొలకెత్తించాలి!

గుండెమీద
ఉద్యమజెండా ఎగురుతూనే ఉంది!
బిగించిన పిడికిలి తెరవనే లేదు!

చరిత్రలోని నినాదాలు
మట్టిలో ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి!

యుద్ధం ఇపుడే మొదలయింది!
పునర్ నిర్మాణమే నిజమైన ఉద్యమం!!

**అనువాద కవిత**

## యిప్పుడింక నువ్వు నాకు స్వంతం

**- పాబ్లో నెరూడ**

అను సృజన: కలేకూరి ప్రసాద్

యిప్పుడింక నువ్వు నాకు స్వంతం
నా కలలో నీ స్వప్నాలతో సహా
విశ్రమించు
యిప్పుడింక
ప్రేమా, బాధా, పనీ
అన్నీ నిద్రపోవలసిందే
ఈ చీకటి రాత్రి కనిపించని
చక్రాల మీదుగా కదలిపోతుంది
నిద్రించే ఆకాశంలాగా పవిత్రంగా
నా పక్కనే వున్నావు నువ్వు
ప్రేమ మాత్రమే
నాకలల్లో నిద్రపోతుంది
నువ్వు వెళ్ళిపోతావు
కాల ప్రవాహాల కెరటాల మీదుగా
మనిద్దరం కలిసే వెళతాం
ఈ దోబూచులాటల నీడల గుండా
నాతో కలసి ఎవరూ పయనించరు
నువ్వు మాత్రమే
నిత్య హరితంగా...
నువ్వు నిత్య చందమామవి..
నిత్య సూర్యకాంతివి
నీ చేతులు సుతిమెత్తని పిడికిళ్ళని
తెరుచుకున్న వెంటనే
మృదువైన రేఖలు జారిపడ్డాయి.
నీ కనురెప్పలు రెండు

బూడిద రంగు రెక్కల్లాగా అలా మూసుకొని వున్నాయి
ఈ రాతిరి.... ఈ ప్రపంచం... ఈ గాలి...
తమ లక్ష్యాలను మార్చుకొన్నాయి.
నువ్వు లేక నేను నీ కలగా మిగిలాను
కేవలం కలగా
కే.. వ.. లం కలగా
అంతే.. మరేమీ కాదు
('బహుజన కెరటాలు' సౌజన్యంతో)

## చలి

**- మెయిద శ్రీనివాసరావు**
99082 56267

సాయింత్రమయేయసరికి...
చలి మొదలయ్యింది
నలుదిశలా కమ్మేసి
ప్రతి వస్తువును పట్టేసింది
దేనిని ముట్టుకున్నా కుక్కై కరుస్తుంది

నాలుగు కాగితాలను చదివి
మెదడులో మంట వేసాను
చలి తగ్గలేదు సరికదా....
కొండ చిలువలా కబళించబోయింది

రోడ్డుపై....తాటాకును తగలెట్టి
నినాదాల మంట కాగుతున్న వారి వద్ద
కాసింత వెచ్చదనాన్ని తాగాను
కొద్దిక్షణాలతోనే... చలి
మంటల మేకపిల్లను మింగేసింది

రాత్రి కల్లంలో
వెన్నెల రాశులకై చెమటోడుస్తున్న
నాగళ్ళు దగ్గరికి నడిచాను
అడ్డపొగై కాలుతున్న ఆగ్రహాన్ని
కాసిన్ని గడ్డి పరకలకంటించారు
మంట... మహోగ్రజ్వాలగా మారింది
మరుక్షణంలోనే మంచుగా మారిపోయింది

చలి...నల్లని ఎలుగుబంటిలా
మారి నా ఎదురుగా నిలిచింది
నా వెన్నులో వణుకు పుట్టించింది

చేతివేళ్ళన్ని పిడికిళ్ళుగా
మారుతున్న ఫ్యాక్టరీలోకి పరుగుతీసాను
చలిని చంపాలంటే మంట చాలదన్నారు
రేపటి వెచ్చటి ఉషోదయానికై
గుండెల్లో మండుతున్న సూరీళ్ళను
విసురుగా ఆకాశంలోకి విసిరాను.

## గెలుపు బాట

**- యలమర్తి అనురాధ**

ఏ పనైనా
ఏదో చేసేసాం అని చేస్తూపోతే
ఎక్కడివాడివి అక్కడే ఉంటావ్
అదే నైపుణ్యం జోడిస్తే
రాణింపు తథ్యం
సృజనాత్మకత తోడైతే
శిఖరానికి దారి తెలిసినట్లే
శ్రద్ధ ఎక్కువైతే
ఆలోచనా సరళికి పదును పెట్టినట్లే
పట్టుదల నీదైతే
గమ్యం బాట దొరికినట్లే
శ్రమ నిలకడైతే
సత్ఫలితాన్ని సాధించినట్లే
ఇక పైకి ఎగబ్రాకటమే
వేగం ఉనికిగా
సత్వర ప్రయాణం సాగిస్తే
కలల తీరం చేరినట్లే
విజయరహస్యాన్ని చేధించినట్లే !

## వాళ్ళని ప్రేమిద్దాం!!

- పాతూరి అన్నపూర్ణ

94902 30939

వాళ్ళ మాటకు గొంతుక వుండదు
మౌనాన్ని ఛేదించే ప్రయత్నంలో
సైగలు భాషగా రెక్కలు విప్పుకుంటాయి.
వాళ్ళ కళ్ళకు వెలుగు కనిపించదు
చీకటి తప్ప రంగుల ప్రపంచం తెలీదు
మొక్క దశలో వున్నప్పుడే
వాళ్ళ వెన్నెముక నిటారుగా నిలబడుతుంది
అప్పుడు హృదయంతో మాటాడతారు
మనసుతో చూస్తారు.
అమ్మా, నాన్న లేని పిల్లలు మాత్రమే
అనాధలు కాదు.
వుండీ వీధినపడ్డ వాళ్ళంతా అనాధలే
కొందరి బాల్యం బందీగా మారి
డబ్బు కట్టలతో హాస్టల్స్‌కి అమ్ముడు పోతున్నది
మరికొందరి అవిటితనం వీధిన పడేసి
అడుక్కునే వాళ్ళుగా తయారు చేస్తున్నది.
బంధాల దారాలను పెనవేసుకుంటూ పోవాలి
తెంపుకుంటూ పోతే ఏం మిగులుతుంది?
లేదంటారా? వాళ్ళ చేతులు
ఆయుధాలవుతాయి.
వాళ్ళు విసిరేసిన రాళ్ళుగా మారితే
ఆ రాయే వెనక్కి వచ్చి ప్రశ్నిస్తుంది!!
శిల్పి చేతిలో పడితే అందమైన శిల్పంగా
మారుతుంది.
వాళ్ళని కలుపు మొక్కల్లా పెరగకుండా
చుట్టూ రక్షణ కంచెను కట్టాలి.
ప్రేమానురాగాల తడి అందించాలి
ఇంకొకరికి బ్రతుకును ఇస్తేనే
మనం కూడా బ్రతికినట్లు

## కవిని కన్న ఇల్లది

- బాలసుధాకర్ మౌళి

96764 93680

కుటీరంలాంటి ఇల్లు
ఇంటికి ముందు వెనుక
ఆకుపచ్చని దీపస్తంబాల్లాంటి చెట్లు
సాయంత్రానికి చుట్టపుచూపుకొచ్చే
చీకటి కూడా
ఆ ఇంటి లోగిలిలో
ఆకుపచ్చగానే మారిపోతుంది
కుటీరంలాంటి ఆ ఇంట్లో
జీవితాన్ని నాటకంగా
నాటకాన్ని జీవితంగా
జీవించిన తండ్రి వుంటాడు
ఉన్న ఆ రెండుగంటల్లో ఏదో వొకటి తిననిదే
వదలని తల్లి వుంటుంది
మాటలపిట్ట చిన్నారి జుహిత వుంటుంది
జుహితలాంటి కవి వుంటాడు
ఎక్కడ చేయి పెడితే
అక్కడ నీ కవిత వుండాలంటాడో మహాకవి
కంబ మహాకవి
ఇంటి నిట్టాడి
కూడా కవిత్వం చెప్పినట్టు
ఆ ఇంట్లో
ఏ మూల చూసిన కవిత్వమే
తాటితేగల్లా తేలుతుంది

కవిని కన్న ఇల్లది
కవిని కన్న ఇల్లెలా వుంటుంది
అచ్చం కవిలానే వుంటుంది.

## ఆమె - నేను

- వి. ప్రతిమ
98485 41485

మేం రోజూ మాట్లాడుకోం
ఒక్కోసారి ఏళ్ళ తరబడి కూడ
అయినా... ఇంకా
నీళ్ళు నిండుకోని కాలువపై
అద్దరినీ, ఇద్దరినీ కలుపుతోన్న
సన్నవంతెన మీద అవి పాదాల జంటలా
ఒక బంధమేదో ఇరువురి నడుమా
పూసల్లో దారమై ముడివడి ఉంటుంది
కాలువలో విరబూసిన కలువ పూల
పరిమళమేదో పగలు మాత్రమే కాదు
ప్రతిక్షణం ఆఘ్రాణింపు కొస్తూఉంటుంది
ఉషోదయపు రంగుల చింతనతో పాటు
చీకటి రాత్రుల చింతలనీ స్పృశిస్తుంటుంది
కష్టం సుఖం, సుఖమూ కష్టమూ
నిరంతరం కరచాలనం చేస్తున్నట్టు
ఒక కెమిస్ట్రీ ఏదో నడుస్తూనే ఉంటుంది
మేం రోజూ మాట్లాడుకోం
ఒక్కోసారి ఏళ్ళతరబడి కూడ
అది పరిచయమో, స్నేహమో
ప్రేమో, ఆరాధనో విశ్లేషించలేం
మూడేళ్ళ వయసులో సరస్వతీ నిలయంలో
ముఖాలనిండా చిరునవ్వులతో
పలకరింపుల పులకరింతలై పలవరించిన
క్షణం నుంచీ
ఆమె, నేనూ మాటలు మాటలుగా
పాటలు పాటలుగా, పరీక్షలుగా
రోజులు, రోజులుగా, సంవత్సరాలుగా
వృత్తులు, వృత్తులుగా
కుటుంబాలు, కుటుంబాలుగా
యుద్ధాలు, యుద్ధాలుగా
గెలుపోటములుగా, పెనుగులాడుతూనే
కళాత్మకంగా జీవన శిల్పాలని
చెక్కడంలో నేర్పరితనం ప్రదర్శిస్తూ
ఒక్కసారి తిరిగి చూస్తే, చెరోవైపుకీ
సాగి సాగి వేలమైళ్ళ దూరం
ఎంత దూరమో అంత దగ్గర
మేం రోజూ మాట్లాడుకోం
ఒక్కసారి ఏళ్ళ తరబడి కూడ
అయినా.... మీ నడుమ
జీవరస సమీకరణమేదో నిత్యం
ధృవీకరింప బడుతూనే వుంటుంది.

## కాలప్రవాహం కాస్త వెనక్కి..

- భగవంతం
99081 97562

గుత్తులుగా కాసిన పసి సీతాఫలాలు
రాబోతున్న శీతాకాలాన్ని
అప్పుడే గానం చేయడం మొదలు పెట్టాయి
అంత వానాకాలపు ఉక్కలో కూడా
ఆ చెట్టుకింద మంచుతెమ్మెర ఒకటి
చుట్టుముట్టి
నన్ను కాలబిలంలోకి తోసింది
ఆ సాయంత్రపు నడకలో
నాలోని శాఖోపశాఖలు వెనక్కి.. వెనక్కి వెళ్లి
అప్పటి పక్షుల కాళ్లకింద వాలాయి.

xxx

పూరిగుడిసె ముందు నిలబడి ఉన్నాను
దసరా సెలవుల సంబరం నాముందు నిల్చొని
ఉంది

షోలే మ్యాట్నీషోలోంచి బయటకు రాగానే
చీకటి పలకరించింది
(ఆ రాత్రి ధర్మేంద్ర నిద్రపోయాడో లేదో కానీ
బసంతి హేమమాలిని మాత్రం
నా పదహారేళ్ల పడుచుతనాన్ని
నిద్రపోనివ్వలేదు)
మైదానంలోని ఖాళీల్ని
ఒక్కొక్క మిత్రుడు ఒక్కోలా పూరించాడు
సత్తుపిండి వాసన సకలలోకాలకు వీచింది
బతుకమ్మ నెత్తుకొని అమ్మ
బృందగానానికి బయలుదేరింది
జమ్మిచెట్టు జాతరలో
ఆ అమ్మాయి నవ్వుముందు తప్పిపోయాను
టపాకాయల ఊహాగానాలు
నక్షత్రాల కింద నాట్యం చేసాయి
మట్టిగోడలమీద మట్టిప్రమిదెల
వరుస వెలిసింది
కళ్లల్లోని వత్తుల్ని
నాయిన తెచ్చిన కాకరపువ్వొత్తులు
వెలిగించాయి
కార్తీకపున్నమి నాటికి
కాల్చడానికి కాగితాలు తప్ప
టపాకాయలేం మిగల్లేదు
అమావాస్య పున్నమివైపు అడుగులేసింది
కప్పుకోడానికి కావలసినంత చలీ
కరిగిపోవడానికి తగినంత వేడి
సంక్రాంతి సంబరాల సకినాల ఉత్సవం
వేలిముద్రల్ని తీసుకొని గాలిపటం
అంతరిక్షానికి ఎగిరింది
ముగ్గుల్ని తాకి మురిసిపోతూ
పొగమంచు వీధిమలుపు తిరిగింది
చెట్టుకొమ్మ చివర పూసిన
మంచుబిందువుని నోటకరుచుకొని
పక్షి తన ముందరి కాలంలోకి ఎగిరింది.

×××

గత స్మృతుల్లోంచి బయటికొచ్చి
తిరిగి ఇల్లు చేరేసరికి బాగా చీకటిపడింది
ఆరాత్రి ఊరిచివరి దారిలోని
ఆ పసి సీతాఫలాల చెట్టుకూడా
వానాకాలపు చివరి వెన్నెల ఒంటికి తగిలి
తన బాల్యస్మృతుల్లోకి జారిపోయినట్లు కలొచ్చింది. ●

## ఎదురుచూపు

- విల్సన్ రావు కొమ్మవరపు
89854 35515

ఎక్కడ పోగొట్టుకున్నావో
జ్ఞాపకం లేదు
నా గది తాళం చెవులు పోయాయి.

నాకు కనిపించని
నా రహస్య మనసు వాకిలి తెరిచి
తలార స్నానం చేయించి
ప్రతి రోజు కొత్త జీవితాన్నిచ్చే
తాళం చెవులు పోయాయి.

గుండె గాయాల్ని తుడిచి
ప్రతి నిత్యం
సూర్యోదయానికి ముందే నిద్రలేపి
రాత్రి కలలో నేను సేవించిన
వోడ్కా వాసనను శుభ్రం చేసి
స్వాప్నిక అంతర్లోకాన్ని చూపే
నా తాళం చెవులు పోయాయి.

మాంసరహిత దేహంలోని
పురాతన మార్గాల్ని శుద్ధిచేసి

బాహువులు చాచి ఆహ్వానించి
బొట్టూ కాటుక లేని
నా ముఖాన సూర్యోదయమై
కాంతివిహీనమైన
నా బతుకుని పండించిన
నా తాళం చెవులు పోయాయి.

చీకటి సరస్సులోకి
కాంతిని ప్రసరింపజేసి
నాకూ, నా చూపుకూ మధ్య
సన్నని గీతను చెరిపేసే
నన్ను వశపరచుకొని
సమూలంగా మార్చేసిన
నా తాళం చెవులు పోయాయి.

మొలకలెత్తిన నా ఆలోచనల్నీ
నన్ను ఉత్తేజపరిచే ఆరుద్ర పురుగునీ
దాచుకున్న ఆ ఆరోగది తాళం చెవులు
ఈ రాత్రి రాలిపోయేలోగా వెతికిపెట్టే
నిరాకారుడి కోసం ఎదురుచూపు.

## చలిపిల్ల సందడి

- అందోజు పరమాత్మ

98485 52512

సాయంకాలం కాగానే
చలిపిల్ల చంకనెక్కుతుంది
ఆపైన చెవుల్లోకి చేరి
గుట్టుగా నసపెడుతుంది

ఒక్కొక్కసారి
పెదాల పూమొగ్గలు గిల్లి
చెంపల కెంపులు రాలుస్తుంది.

ఇంకొక్కసారి
వెచ్చదనం కోసం చుట్టుకున్న
మఫ్లర్ కుబుసం లాగి
కోపం దీపాన్ని మండిస్తుంది

విసుగుతో కసురుకుంటామా
నాల్కతడి గుడ్డను పిండి
నోటికొలిమి మూయిస్తుంది

దుప్పట్లోకి దూరిపోతామా
మాటల ఊపిర్లనాపి
చెమటల చెలిమలు తొవ్వుతుంది

గ్లౌజుల్లోకి చేతులు దూర్చేలోపున
వేళ్ల ములక్కాయల్ని లాగి
జడపాయలుగా అల్లుకుపోతుంది

ఇంటివెనక పూలమొక్కల్ని
కరేపాకు చెట్టునూ, మనీప్లాంటును
మంచుశాలువై చుట్టుకుంటుంది.

పడమటి కొండల్లో తలవాల్చిన
రవివర్మ ఏకాంతం చిద్రమయ్యాక
ఉదయం ఎస్కిలేటర్ మీదినుంచి
వెలుగు సెగల అడుగులేస్తోంటే
చలిపిల్ల సిగ్గుతో తలొంచుకుని
దిగంతాల్లో అదృశ్యమవుతుంది.

## చాకిరి

- ఎం.ఎస్. నాయుడు

94914 39739

కదలదు కల
మొదలవ్వదు ఆకారం

పెదాలపై నీడలు
నాచు పదాలు

కన్నీళ్ళకీ తెలియని అక్షరాలు
అద్దంపై విరిగి

మెడలేని మెతుకు
ఓడిన కిటుకు

చతికిలపడే వాక్యాలు
కళ్ళతో మూసేయ్

## పుస్తక ప్రపంచం



**బొమ్మల బాయి**

కవి: సిద్ధార్థ

పేజీలు : 208; వెల: 150/-

ప్రతులకు : 9848015364




### రెండు దశాబ్దాల కవితాయానం- బొమ్మల బాయి

సిద్ధార్థ 1994లో 'దీపశిల"తో తెలుగు సాహితీలోకానికి వచ్చి "దీపశిల సిద్ధార్థ"గా పేరు తెచ్చుకొన్నారు. ఇప్పుడు తన ఇరవై సంవత్సరాల కవిత్వాన్ని ఒకచోటకు చేర్చి 'బొమ్మలబాయి' పేరుతో సంపుటిని తెచ్చారు. సిద్ధార్థ కవిత్వంలో- గొప్పజీవన కాంక్ష, ఆదిమ సౌందర్యం, వలస దుఃఖం, గ్రామ్యజీవనం వివిధ కోణాలలో దర్శనమిస్తుంది. ఇప్పుడు వస్తున్న కవిత్వ తీరులకు పూర్తి భిన్నంగా ఉంటూ చదువరులకు సరికొత్త పఠనానుభవాన్ని కలిగిస్తుంది.

ప్రముఖ మలయాళీ కవి శ్రీ సచ్చిదానందన్ "కవిత్వానికి సమాంతర భాష కావాలి" అంటారు. అంటే- కవిత్వంలో వాడే పదాలు తమ మామూలు అర్థాల్ని వదిలి వేరే విశిష్టార్థాల్ని ధ్వనించాలని, వాక్యాలు ఒట్టి వాచ్యంగా ఉండకుండా భిన్న పొరలలో ఒక అనుభవాన్ని దర్శింపచేయాలని ఆయన ఉద్దేశం. అలాంటి కవిత్వంలో పదాల అర్థాలు క్రమక్రమంగా అదృశ్యమై మనోద్వేగం మాత్రమే మిగుల్తుంది. పదాలు అర్థాల్ని వీడి ఉద్వేగాన్ని తొడుక్కొంటాయి. ఏ ఉద్వేగానికి కవి లోనై ఆ కవితను సృజించాడో అది యధాతదంగా స్పష్టంగా దర్శనమిస్తుంది. "సమాంతర భాష" అని సచ్చిదానందన్ అన్నది అలాంటి కవిత్వభాష గురించే. ఇది ఉత్తమోత్తమ కవిత్వాభివ్యక్తి. తెలుగు సాహిత్యలోకంలో సమాంతరభాషలో కవిత్వం వ్రాసే అతికొద్దిమందిలో సిద్ధార్థ ఒకరు.

కురిసిన వానలన్ని ఏమయిపొయ్యాయి/ పక్కటెముకల ఎద్దూ ఆకాశమూ/ ముచ్చటించుకొంటున్నాయి/ భూమిపొరల్లో దొరికిన వొకడి అస్థిపంజరం గురించి/ అందులో పడుకుని నిద్రిస్తూన్న/ పచ్చచిలుక దేహం గురించి "వానలు సిప్తల వనాలు" అనే కవిత ఒక భయంకరమైన కరువును సమాంతర భాషలో దృశ్యమానం చేస్తుంది. ఆ అస్థిపంజరం రైతుది కావొచ్చు, అతనిలో నిద్రిస్తున్న పచ్చచిలుక అంటే అతను జీవితకాలమంతా ఎదురుచూసిన పచ్చదనం అవ్వొచ్చు. ఇక్కడ పదాల అర్థాలు అదృశ్యమై వాక్యాలు కరువుకాలపు ఉద్వేగాల్ని ఆవిష్కరిస్తాయి.

'బొమ్మలబాయి'లో కనిపించే అనేక దేశీపదాలు, ప్రయోగాలు జానపద సాహిత్యరూపానికి దగ్గరగా ఉంటాయి. సమకాలీన కవిత్వరీతులతో పోల్చితే ఇది ఒక భిన్నమైన స్వరం. బండమైసమ్మ, గట్టుమైసమ్మ, ఒగ్గుకథలు, బాలసంతు, పెద్దలకు బియ్యాలివ్వటం, శివసత్తు, ప్రభలు, మల్లన్న, గండెమ్మ, జోగిని, చిందెల్లమ్మ వంటి వివిధ విషయాలు, తెలంగాణ సంస్కృతికి, ఆధునీకరణ పేరుతో మార్జినలైజ్ అవుతున్న జీవనరీతులకు ప్రతీకలు. వీటిని స్మరించుకోవటం, అక్షరాలలో పదిలపరచటం నేటి కాలానికి చాలా అవసరం. సిద్ధార్థ తన కవిత్వం ద్వారా ఆపని చేసినట్లు బొమ్మలబాయి నిరూపిస్తుంది.

సిద్ధార్థ కవిత్వం నిండా పల్లెదనం ఉంది. అక్కడ గడిపిన బాల్యం ఉంది. ఖేదమో మోదమో అర్థంకాని ఆధునిక జీవనముంది. తనకలలకు, జ్ఞాపకాలకు వారధిగా నిలిచి తనలోకి కవిత్వప్రవాహాల్ని ఒంపిన మహా నగరముంది.

సీమసింతకాయ నవ్వినట్టు/ నల్లతుమ్మ పువ్వు రాలినట్టు/ తనకడియాల దరువులో కాలమంతా పొగిలినట్టు/ –(బుశ్శెడ) అంటూ పల్లె సౌందర్యాన్ని కళ్ళకుకడతాడు.

సిటీ కదులుతూంటే/ ఎటుతిరిగినా వొక బరువుంటుంది/ నన్ను నాకుతూనే వుంటుంది/ / వలసపోవటం ఎంత నరకం/ నా గూడుకు నేను కిరాయి కడుతున్నాను/ – (సింగాడ) అంటూ నగర జీవనపు ఒరిపిడిని, వలస దుఃఖాన్ని పట్టుకొంటాడు.

బాకీ మొత్తం/అతివాస్తవం/వొక మల్టిమీడియా బ్లూ సరస్సు/ దానిపైని ఫ్లైవోవరు/ పేగును కొరికే కరెంటు బిల్లు/ కుత్కెలోపల వంకరగా దిగిన రేగుముల్లు/– (కర్రెసామీ జంగపోడా) వాక్యాలలో నగరజీవితాన్ని నగ్నంగా మనముందు నిలుపుతాడు ఫ్లైవోవర్లు, హైటెక్ సిటీలతో అందంగా కనిపించినా, తీర్చాల్సిన అప్పులు, కరంటుబిల్లు కట్టలేనితనం, మహాకవి కాళోజీ "ఏం తినేట్టు లేదు, ఏం తాగేట్టు లేదు" అన్నట్టు గొంతులో దిగిన ఆకలిముల్లు..... అని ఒకానొక భీభత్స దృశ్యాన్ని చూపిస్తాడు చిన్న చిన్న పదాలలో, సిద్ధార్థ కవిత్వగొప్పతనం అది.

అజంతా కవిత్వంలో పదేపదే వచ్చే భయం– రాక్షసాకారం దాల్చి రక్తం పీల్చే మహానగరం పట్ల భయకంపితుడైన వ్యక్తి వైయక్తిక అనుభవంలా అనిపిస్తుంది అంటారు నున్నా నరేష్ ఒక మిసిమి పత్రికా వ్యాసంలో. 'బొమ్మలబాయి' లో కూడా భయం, ఒక భీతావహ వాతావరణం అనేక కవితల్లో కనిపిస్తుంది. కానీ ఇది వైయక్తిక అనుభూతిగా కాక ఒక సామాజిక ప్రకటనలా వ్యక్తమౌతుంది.

భయం తింటున్న జాతివాణ్ణిని/ తిట్టూ తిట్టూ నాకేమీ సిగ్గులేదు/ నా భయమో పదిజిల్లాలంత వెడల్పూ/ ఏడు సముద్రాలంత లోతూ. అంటాడు (భయచరాన). ఇక్కడ పదిజిల్లాలు అనటం ద్వారా తన సమాజపు చారిత్రకనేపథ్యాన్ని ప్రతిభావంతంగా ప్రతిబింబిచగలిగాడు సిద్ధార్థ. ఆశ్చర్యకరమైన అంశమేమిటంటే మలిదశ తెలంగాణా పోరాట సాహిత్యం ఇంకా

ఊపందుకోని కాలం లోనే (1999) సిద్ధార్థ భవిష్యత్తుని దర్శించాడు. ఆ తరువాత కాలంలో విరివిగా వచ్చిన తెలంగాణ అస్థిత్వ సాహిత్యానికి సిద్ధార్థ కవిత్వం చక్కని భూమికను ఏర్పరచిందనటంలో సందేహం లేదు.

సిద్ధార్థ కవిత్వాన్ని ఓపికగా చదవాలి. ఏ వాక్యమూ వాచ్యంగా ఉండదు. అంతా ధ్వనిప్రధానంగా ఉంటుంది. ఆ వాక్యాన్ని మనోలోకంలో మరోసారి చదువుకొన్నప్పుడు ఏదో దృశ్యం కనిపిస్తుంది. దాన్ని అలా మనకు మనం ఏర్పరుచుకుకొన్నప్పుడు గొప్పతృప్తి ఆనందం కలుగుతాయి. ఇది ఒకరకంగా డీకోడింగ్ చేసుకోవటం లాంటిదే. ఆ కాస్త ప్రయత్నం చేయని, చేయలేని వారికి సిద్ధార్థ కవిత్వం జఠిలంగా కన్పించవచ్చు. కవిత్వం రాయటంలో కవి పడే తపనతో పోల్చుకొంటే, పాఠకుడు కూడా ఎంతోకొంత శ్రమించకపోతే కవిత్వప్రయోజనం ఎలా దక్కుతుంది?

కినిగె పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో "కవిత్వం అనేది నేచర్. నేను మీడియం మాత్రమే. మన చుట్టూతా ఉండే అనేకానేక శక్తులు మన మీద దాడి చేసి, మనల్ని ఎంచుకుని, ఒక మీడియంలా వాడుకుని వదిలేస్తాయి. అప్పుడు కవిత్వం పుడుతుంది" అంటారు శ్రీ సిద్ధార్థ. ఈలోకంలో చెట్టు, పుట్టా రాయి తప్పా వాగు గుట్టా వాటి పనులు నిర్వహిస్తున్నట్లే నేనూ నా పని నిర్వహిస్తున్నాను అంటూ కవిత్వాన్ని ఒక ఒక సహజమైన స్వభావంలా భావించే శ్రీ సిద్ధార్థ 'బొమ్మల బాయి' మంచి, చిక్కని కవిత్వాన్ని ఇష్టపడేవారికి తప్పక నచ్చుతుంది. ఎందుకంటే ఇది స్పందించే హృదయమున్న కవి రెండు దశాబ్దాల జీవితపు కవితాయాత్ర.

**- బొల్లోజు బాబా,** 98493 20443




## మళ్లీ ఎగరాలని

కవి: కాశీభట్ల వేణుగోపాల్
పేజీలు: 61, వెల: రూ. 45/-
ప్రతులకు: అన్ని పుస్తక కేంద్రాలు

### ప్రహ్లాద కవిత

**ఈ** కవిత్వమంతా ఒక కలాపన. లేదా... కాలాపన. తను కదలాలనుకునే సంకల్పంలోంచి జనించిన స్వస్ఫోటన. నిజానికి ఏదీ కదలకుండా ఉండదు. అట్లాగని ఏదీ కదులుతూ మాత్రమే నిలువకుండా పోదు. నిశ్చలనం చలన గర్భం దాలుస్తుంది. చలనం నిశ్చలనాన్ని తిరిగి ప్రసవిస్తుంది. 'మళ్ళీ ఎగరాలని' కవిత్వంలో కవి, తన ఉదాసీనతను దగ్ధం చేసుకుంటూ... దుఃఖతను ముగ్ధపరుచుకుంటూ... జీవ సంచారం చేయబూనుతున్నాడు.

ఈ కవిత్వం మృత్యువుతో విభాషణ, జీవితంలో సంభాషణ చేస్తుంది. "Art Symbolises the meaning of our existence" అన్నది చాలా గొప్ప మాట అని తిరిగి గుసగుసగా చెప్పిన చిన్న కవితల పుస్తకం ఇది.

ఇప్పుడు మనం అతి వేగపు నాగరికతలో ఉన్నాం. వేగం మన మూలాలను వెక్కిరిస్తూంది. వేగం విలువల్ని ధ్వంసం చేస్తూంది. వేగం మానవ సంచారం లేని... అమానవ రంగాల్లోకి మనల్ని విసిరిపారేస్తుంది. మొత్తం మనిషి జాతికి ఇప్పుడు Communal / racial / mencentred / imperialistic ప్రపంచీకరణ వైరస్ సోకింది. మనలోని సగం మెలకువల గురించి కాక, సగం చందమామల గుడ్డి కాంతుల గురించి కాక, పూర్తి మెలకువల గురించి సంగతులు చెబుతున్న Spiritual Monologue ని దర్శించగలం ఈ కవితల్లో. Slownessలోని సౌందర్యం చూడగలం.

“తెల్లవారుజాము నక్షత్రాన్ని మంచుకడుగుతోంది
తెల్లగా రాత్రిపూసిన జాజి మల్లెను ఏదో తెంచుతోంది”
“ఒడ్డును వొరుసుకు ప్రవహించినా...
సెలయేరా, వంటరివే....”
(“సగం చంద్రుడు” లోంచి)

ఈ కవిత్వంలో... కవి తనను నిసర్గంగా ప్రేమించిన భాషతనం తెలిసివస్తుంది. ఇతను భాషను బుజ్జగించి, ప్రేమించి మచ్చిక చేసుకున్నాడనిపిస్తుంది. అటువంటి పదాల్లోంచి కవిత్వాన్నీ, మేలిమి వర్ణ జీవచ్ఛాయనూ మననం చేసుకుంటున్నాడు. ఎక్కడా ఆరోపణ లేని చింతన ధారతో చిన్నచిన్నగా సందడించే కవితలు “సగం మెలకువ”, “ఏమని”, “అతను” లాంటివి...

ముగించనిదే.. జీవితం, ముగింపులోకి దరిచేరనిదే అస్తిత్వం. ఇందులోని కవితలు ఇటువంటి సారాన్ని ద్రవీభూతం చెయ్యగలిగాయి.

"Now summer is gone
And Might never have been
In the Sunshine its warm
But there has to be more...."

అని తార్కో విస్కీ.... లో చిత్ర లిఖితం చేసినట్టుగా... తలపిస్తాయి...

ప్రాచ్య సంప్రదాయ కవిత్వాల్లోనే కాకుండా ఆధునిక – ఆధునిక అనంతర కవిత్వాల్లోని చాలా కవుల జీవన మన్నన, ఆప్యాయత, విడిపోని తనం... జీవితాన్ని పూర్తి స్థాయిలో సంగమించాలనే వాంఛలోనే వుంటుంది. దీపం ఆరిపోదు... దానికాంతి ఎప్పటికీ ప్రజ్వలిస్తుంది...

అనే ధీరత... ఇటువంటి కవిత్వానిదని నాకనిపిస్తుంది. అందుకే బహుశా ప్రాహ్లాద కవిత్వమని కూడా అనొచ్చు. (thanks to శిష్ట్లా... కవులందరి తరపున)

అటువంటి ప్రాహ్లాదతను తక్కువ మాటల్తో చిర కవితల్లో సాధించిన కవితలు ఉన్నాయి ఈ సంపుటిలో...)

తననుంచి... విశ్వత్వంలోకి, లోకి శూన్యబిందువులోకి సాగే, తన ప్రస్థానావస్థను సూచిస్తుంటారు కవి... 'సమూహంలోంచి', 'పునర్జన్మ', 'పుస్తకం పక్షి' లాంటి కవితల్లో ఇటువంటి కవిత్వాన్ని గురిపెట్టాలంటే... తనపై పేరుకుపోయిన భాష తాలూకు బరువునంతా దించుకుని... మళ్ళీ కవి భాషలో తనను re-organise చేసుకుని... బయటపడి రాయాలి. అది కాశీభట్ల సాధించాడనిపించింది. అది పట్టుబడిన పిదప ఒక Spiritual Energy తాలూకు సువాసన కవిత్వానికి అబ్బుతుంది. ఆ సువాసనకు మృత్యుస్పర్శ వుండదు. అందులో వొక నిరంతరాగ్ని పొగ భుగ మంచు ముసురుగా... ఎగుర్తూంటుంది.

'మళ్లీ ఎగరాలని' కవిత్వంలో అటువంటి అనాది ముసురేదో వుంది.

**- సిద్ధార్థ**, 96033 18460




**పిట్టకు ఆహ్వానం**

కవిత్వం: సుజాత పట్వారి

పేజీలు: 86, వెల: రూ. 50/-

ప్రతులకు: కవి, ఫ్లాట్ నెం. 302, శ్రీవైష్ణవి ఎన్‌క్లేవ్, అచ్చయ్య నగర్, వి ఎస్ టి క్రాస్ రోడ్స్ దగ్గర, అజామాబాద్, హైదరాబాద్ - 500 020.

## సాంద్రమూ, సరళమూ అయిన పరికల్పన ఈ కవిత్వం

'పిట్టకు ఆహ్వానం' అన్న శీర్షికలోనే ఒక భాషకందని దేన్నో కోల్పోయిన రిక్త పరితపనతో పాటు వెదుకులాటా, అన్వేషణా ఉంది. నిజానికి పిట్ట ఏదైనా మనిషి హృదయాన్ని పరవశింపజేస్తూ పులకింతలతో పాటు గిలిగింతలను మిగిల్చే ఒక చిరుజీవి. పిట్టలు కళ్ళముందు చిన్న చిన్న చెట్ల కొమ్మలపై, కిటికి ఊచలపై, పిట్టగోడలపై, పూలమొక్కలపై కిచకిచలాడ్తూ సంచరిస్తున్నప్పుడు పెద్దవాళ్ళైనా, చిన్న పిల్లలైనా ముచ్చటగా తాదాత్మ్యతలో మునిగిపోయి లీనమైపోతూండడం మనందరికీ అనుభవమే. ఈ అతి సున్నిత భావ వీచికను సుజాతా పట్వారి అలా ఒక తెమ్మెరలా విసిరారు గాలిలోకి. అంతా స్థిరంగానే ఉన్నట్టనిపిస్తూనే అస్థిరమై స్వానుభవంలో అనుకంపనగా

ధ్వనించే ఒక వైయక్తిక రసానుభూతిని ఈ కవితలో తాత్విక పరిమళంతో అంటారు.. 'చీకటి పడే వేళకు / గూడు చేరుకుంటాననే / బయలు చేరుతుంది / పక్షి / వేల వేల మైళ్ళు ఎగిరెళ్ళినా / తిరిగి ఇల్లు చేరడం / గాలితో పెట్టిన విద్య దానికి.' అని. ఏ రాడార్ వ్యవస్థ తెలియని పక్షులు తమ స్వయం ప్రాకృతిక దార్శనిక జ్ఞానంతో ఏ దారులూ లేని ఆకాశంలో సెన్సర్లకంటే ఖచ్చితంగా తమ పథాన్నీ గమ్యాన్నీ నిర్దేశించుకుంటూ స్వేచ్ఛగా విహరిస్తుండడం నిజంగా విచిత్రమే. ఈ అతిచైతన్యవంతమైన సూక్ష్మవిషయాన్ని అలా అలవోకగా చెప్పడం బాగుంది.

సుజాత ప్రధానంగా భావుకురాలు. ప్రకృతి ప్రేమికురాలు కూడా. ఈ కోణంలో ఆమె అక్షరీకరించిన పలు పద్యపాదాలు చాలా సున్నితమైన అనుభూతులను శరపరంపరగా ఆవిష్కరిస్తూ వెళ్ళాయి. కాగా ఈమె చాలా నిరలంకార శైలితో ప్రవాహకత కల్గిన ఒరవడితో తన సున్నిత భావాలను కవిత్వీకరించి అందివ్వడం ఈ పుస్తకంలోని ప్రతి పద్యంలోనూ కనిపిస్తుంది. చిన్న చిన్న పద్యపాదాలతో అతి సంక్లిష్ట విషయాలను హృదయానికి హత్తుకునే విధంగా పాఠకులకందివ్వగల నేర్పును ప్రదర్శించిన సుజాత దీర్ఘంకాని చిరు పంక్తులతో భావస్ఫోరకమైన ఈ పుస్తకంలోని ముప్పయ్యేడు కవితలను రసగుళికల్లా అందించారు.

ఈ కవితలన్నింటిలోనూ అంతర్వాహినిగా ప్రవహించే కవిత్వ ద్రవ్యమేమిటంటే పొన్నపూలు రాలుతున్నట్టు నిశ్శబ్ధంగా మనసు స్వాధీన పర్చుకునే విలక్షణ వ్యక్తీకరణా వైశిష్ట్యం. అందమైన అక్షరాల నడక.. సోయగం... భావసౌందర్య వ్యంజన.

కవికి తను ఒకానొక సందర్భంలో పొందే అనుభవానుభూతిని యథాతథంగా అక్షరీకరిస్తూనే దాన్ని కవిత్వ భాషలోకి అనువదించే నిర్మాణ రహస్యం తెలియాలి. ఎందుకంటే కవిత్వం నిజానికి హృదయభాష. వ్యవహారిక భాషలకు అతీతమైన, కేవలం హృదయ గ్రాహ్యమైన ఆదానప్రధాన వ్యవహారం ఈ కవిత్వ సృజన. ఈ కోణంలో సుజాత పట్వారికి భావాలను కవిత్వంగా రూపాంతరీకరించే రసవిద్య తెలుసు. ఈ క్రింది వ్యాక్యాలను గమనిస్తే ఈ నిజం ఋజువౌతుంది.

'చిత్రం అదృశ్యమై / ధ్వని మాత్రమే గోచరమైన / ఉత్పతన స్థితి / అవునూ / నా కాగితప్పడవెక్కడ / సముద్రంలో కెళ్ళిన గోదారెక్కడ ...!' (సముద్రంలో గోదారి - పే.10), 'ఆది, అంత్యాలు / ఒకే ఫ్రేం లో ఒదిగి కనిపిస్తే / ఇక వేదార్థం ఒలిచిన అరటిపండేగా' (ఒకే ఫ్రేం - పే.16), 'మేఘాలు రెక్కలయిరాగా/ మా సన్నజాజి కొమ్మ మీంచి / ఎగిరిపోయిన / పొత్తిళ్ళలోని చంద్రుడు / చేతిలో / పూర్తయిన పద్యం' (చందమామను ప్రసవించనా? -

పే-27)', అప్పుడప్పుడు ఈమె ఒక ప్రతీకాత్మక పదముద్రను వేసి మనల్ని చకితుల్ని చేస్తుంది. చూడండిది 'మరొకసారి / చినుకూరిన / తల్లివేరునయ్యాను / అదిగో!! / నే చిలికిన మజ్జిగలోంచి / వెన్నముద్దయి లేచిన కృష్ణుడు. (మంత్రోద్భవం - పే. 33), సుజాత తన తాతగారైన శ్రీ ఉ ప్పులి గురుమధ్యరావు గారి స్మృత్యర్థం రాసిన కవిత 'వెళ్ళిపోయిన సంభ్రమమొకటి' ఒక చాలా మంచి కవిత. వినిసిస్తూ / కనిపిస్తూ / చెట్ల గుబురుల్లోకి / మాయమైన పక్షిలా / ఓ సంభ్రమం / నడిచెళ్ళిపోయింది'. అని ఒక జ్ఞాపకాల ధారగా సాగీ సాగీ 'ఉత్తరాయణమైనా / దక్షిణాయణమైన / ప్రతి పశ్చిమం / తూర్పులో తెచుకుకోవాల్సిందే / వేచి చూడ్డం / తెలియాలంతే!'... మనిషికి 'వేచి చూడ్డం' అనే జ్ఞాన రహస్యాన్ని ఇంత సరళంగా చెప్పడం నిజంగా వ్యక్తిత్వ పక్వతకు సంబంధించిన విషయమే. ఈ సంయమనం, నిగ్రహం, నిరీక్షా తత్వం కలిగి ఉండడం మనిషి వికసనకు ఒక తార్కాణమే.

ఈ సంపుటిలోని కవితలను రూపుదిద్దడంలో ఎంచుకున్న వస్తువులన్నీ ప్రధానంగా హృదయ సంబంధమైనవీ, ప్రతి మనిషికీ అనుభవంలోకొస్తూ ప్రతి నిత్యం అనుభూతింపజేసేవే. అందువల్ల పాఠకుడు ఈ సార్వజనీన వస్తు స్పర్శతో తాదాత్మ్యతను చెందుతూ తనను తాను ఈ కవితల్లో దర్శించుకుంటాడు. ఈ లక్షణం ఈ కవిత్వ సంపుటానికి ఒక అదనపు అలంకారాన్నీ, పరిమళాన్నీ కూర్చింది. సరళసుందర కవిత్వం నిండా నిండి ఉన్న చిరు గ్రంథమిది.

- ప్రొఫెసర్ రామా చంద్రమౌళి, 93901 09993

## హిజ్రాల అస్తిత్వాన్ని ఆరపోసిన "మూడవ మనిషి"

### మూడవ మనిషి - దీర్ఘ కవిత



రచన: రేణుకా అయోలా

వెల:50/- పుటలు: 53

ప్రతులకు: కవి, 8-3-677/ఇ/2, యుకో ఆర్కేడ్, ప్లాట్ నం.2, నవోదయ కాలనీ, ఎల్లారెడ్డి గూడ, హైదరాబాద్-500037




మానవులంటే స్త్రీలు పురుషులేననే భావం అనాదిగా స్థిరపడి పోయింది. స్త్రీ, పురుషుడూ కాకుండా మూడవ మనిషి మానవ సమాజాన్ని అంటిపెట్టుకొని వస్తున్న సంగతి అనాది నుండి పరిగణలోకి రాని సందర్భాలు. ఆ మూడో మనిషి ఎవరు? వీరిని కొజ్జాలంటారు. హిజ్రాలంటారు. మరేదేదో అంటారు. ఇటువంటి ఆడామగ కాని జీవితాలు, వారు ఇష్టం వచ్చిన రీతిలో జీవించడానికి వీలుగా సమాజం సవరింపబడలేదు. వారి పోరాటాలు సాగుతూనే ఉన్నాయి. 'రేవతి' అనే ఒక

హిజ్రా తన జీవితాన్ని నవలగా రాసింది. దీన్ని చదివి కాబోలు ప్రముఖ కవయిత్రి, రేణుక అయోల 'మూడవ మనిషి" అనే దీర్ఘ కవిత రాశారు. నిష్ఠగా, నిజాయితీగా, "వారి మనోభావాల్ని సరళమైన భాషలో భావగాంభీర్యంగా చక్కని అభివ్యక్తితో, ఈ దీర్ఘకవిత నడిచింది. 15 విభాగాల్లో హిజ్రాల ఆత్మకథను అద్భుతంగా ఆవిష్కరించారు.

హిజ్రాలు పురుష రూపంపైకి కనిపిస్తున్నా వీరి మనస్సు మాత్రం "స్త్రీగానే బతకాలని పచ్చని కోరికతో / కట్టెలు కొట్టె గొడ్డలిలా / శరీరాన్ని చెక్కుకుంటూ / వయసు తెస్తున్న మార్పుల లోయలోకి / జారుతూ రేపు అనే మలుపులో / ప్రతి ఉదయాన్ని ఆశగా చూడడం / ఈ జీవితంలో నేర్చుకున్న మొదటి పాఠం" అంటారు.

వెకిలితనం వెలివేస్తుంటే నువ్వు ఆడదానివి కావు అని చేతులతో నెట్టేస్తుంటే "గాయపడ్డ నరం చిట్లినప్పుడు/ లోలోపల ప్రవహించే నెత్తురు చప్పుడు / కళ్ళ కొనలలో ఆగిపోయేది" అంటూ అవమాన గాయాన్ని ఎత్తిచూపుతారు.

వికసిస్తున్న వయసు / అబ్బాయిల కోసం ఆత్రపడేది / అమ్మాయిల స్నేహం అల్లరిపాలు అయ్యేది / కాలేజీ రహదారిలో వెలగని వీధి దీపంలా నేను / పూర్తి ఆడతనానికి / సిద్ధపడని శరీరం / అందరి మధ్య నాటకంగా ప్రదర్శించబడేది" గొప్ప పరిశీలనలో కవయిత్రి ఈ మాటల్ని రాశారు.

ఇంట్లో ఆడంగితనం గమనించి తల్లిదండ్రి ప్రశ్నిస్తే, ఊర్లో ఆడంగిల వాడంటూ అవహేళన చేస్తుంటే, పుట్టి పెరిగిన సమాజం నుండి దూరంగా పారిపోవడమే మేలనిపించే వో తెగువ వాళ్లలో కలుగుతుంది. వారిని బోలిన వారి ఆప్యాయత అనురాగాలకోసం వెతుక్కుంటూ ఇంట్లోంచి పారిపోతుంటారు. పల్లెలు వదలి.. పట్టణాల్లోకి చేరుతుంటారు.

ప్రేమలు, పెళ్లిళ్ళు చాలాకాలం వీరికి దక్కవు. విడిపోవడమే నిజం. వీరి సంపాదన కోసం దగ్గరయ్యే మగవాళ్లు మోసగించి డబ్బు గుంజి మరీ పారిపోతారు. హీనంగా చూస్తారు. ఇది వారి నిజ జీవితం.

రేణుక అయోల మూడవ మనిషి యదార్థ జీవితాన్ని వ్యధామయ జీవితాన్ని ఎంతో గొప్పగా ఆవిష్కరించారు. చివర దశలో ఇద్దరు అనాధ పిల్లలు "మూడవ మనిషి" ఇంట్లోకి వచ్చినట్లు "అమ్మా", "అమ్మా" అంటూ / వేలసార్లు పిలుస్తారు" అంటూ "రేపొకసారి మళ్ళీ వీళ్ళని / సమాజం ప్రశ్నిస్తుంది / జవాబు ఇవ్వకుండా / నిలబడి జీవించడానికి / అంతులేని అంతర్యుద్ధం చేయడానికి / వాళ్ళలో శక్తి ఉంది / శక్తి ఉంటుంది కూడా / అనే ఆశావాహక స్థితిని కవయిత్రి వ్యక్తీకరిస్తారు. అమ్మతనాన్ని వారికి ఆవంహించే విధంగా పెంపుడు తల్లిగా మూడో మనిషిని చూపెడతారు.

"మూడవ మనిషి" అనే శీర్షికలో, ఏ వర్గాన్ని సమాజంలో దయనీయంగా, తృణీకారంగా,

ఎగతాళిగా చూస్తున్నారో వారిని సమాజంలో విలువలతో నిలబెట్టాలనీ ఆకాంక్షతో కవయిత్రి వ్యక్తం చేసారు.

"తన ముఖంతోనే అందరి / ముఖం చూసుకునే సమాజం / తన కోసం తన అవసరం కోసం / బతకలేని రూపాన్ని హింసించే సమాజంలో "మూడవ మనిషిని రక్తమాంసాలతో తోటి స్త్రీ, పురుషుడులా తిరుగుతున్న మనిషిగా నిలబెట్టడానికి యత్నించిన కవయిత్రిగా చాల సాహసోపేతమైన నిర్ణయం తీసుకున్నట్లుగా భావించక తప్పదు.

**- కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

99487 74243




**కవిత్వం 2015**

సంపాదకుడు - దర్భశయనం శ్రీనివాసాచార్య

సెల్: 94404 19039

వెల: రూ. 80/-

ప్రతులకు: నవోదయ, విశాలాంధ్ర, నవచేతన మరియు అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు.

## అరవై కవితల పచ్చల హారం

ఒక సంవత్సరంలో వెలువడిన అనేకానేక కవితలలో నుండి ఒక 60 కవితలను ఎన్నుకుని సంకలనంగా వేయడమంటే పెద్ద సాహసం! ఇప్పుడు అంతర్జాల పత్రికలలో కూడా వెలువడుతున్న కవితలను కూడా కలిపితే, మొత్తం ఒక సంవత్సరంలో వెలువడిన తెలుగు కవితలు వేల సంఖ్యలో ఉంటాయి. వాటినన్నింటినీ చదవడం, ఆ సంవత్సరంలో తెలుగు నేల మీదా, ప్రపంచ వ్యాప్తంగా జరిగిన అనేక కీలక ఘట్టాలను, ఉద్యమాలను కూడా దృష్టిలో పెట్టుకుని, అనేకానేక వడబోతల తరువాత ఒక 60 కవితలను సంకలనం కోసం ఎంపిక చేసుకోవడం, సంకలనం వెలువడిన తరువాత ఎదురయ్యే విమర్శని ఎదుర్కోవడం, అన్నింటినీ మించి, ఎంపికలో ఒక్క 'కవిత్వం' అనే అంశానికి తప్ప మరే ఇతర వైయక్తిక అంశాలకూ చోటివ్వకుండా సంకలనం తీసుకురావడం, నిజంగా సాహసమే!

కవిత్వం పట్ల అపారమైన ఇష్టం, ప్రేమా ఉంటే తప్ప ఇంతటి బాధ్యతను స్వీకరించడం, ఆ బాధ్యతను విజయవంతంగా నెరవేర్చడం సాధ్యం కాదు. తెలుగు సాహిత్యంలో కవిత్వం పట్ల అట్లాంటి అపారమైన ఇష్టం, ప్రేమలతో పాటు, వార్షిక కవితా సంకలనాలు వెలువరించడం ఒక సాంస్కృతిక కర్తవ్యంగా భావించే కవి దర్భశయనం. అందుకే, దాదాపు మూడు దశాబ్దాలుగా

ఒక వైపు తన కవితా సంపుటులు క్రమం తప్పక వెలువరిస్తూ కూడా, మరొక వైపు కవిత్వ సంచికల, కవితా సంపుటుల సంపాదక బాధ్యతలను ఇష్టంగా నెరవేరుస్తూ వస్తున్నారు. దాదాపు ముప్పై ఏళ్ల క్రితం 'చినుకు' బులిటిన్‌తో మొదలైన ఆయన సంపాదక పాత్ర, విజయవాడ సాహితీ మిత్రులు వెలువరించిన 11 కవితా వార్షిక సంచికల (2004 నుండి 2014 వరకు) దాకా సాగింది. ఇక్కడ విశేషం ఏమిటంటే, అటు చినుకు బులిటిన్ సంచికలైనా, ఇటు విజయవాడ సాహితీ మిత్రుల కవితా సంచికలైనా, దర్భశయనంకు తోడుగా మరొక మంచి కవి, విమర్శకుడు పాపినేని శివశంకర్ సహ సంపాదకుడిగా వ్యవహరించడం.

విజయవాడ సాహితీ మిత్రులు వెలువరించే 'కవిత' వార్షిక సంచికల సంపాదక బాధ్యతల నుండి పాపినేని, దర్భశయనం నిష్క్రమించిన తరువాత, దర్భశయనం శ్రీనివాసాచార్య తన సంపాదకత్వంలో వెలువరించిన తొలి వార్షిక కవిత్వ సంపుటే - 'కవిత్వం-2015'. ఇది 'కవన కుటీరం - వరంగల్' వారి ప్రచురణ. ఆయన మాటల్లోనే చెప్పాలంటే - 'అరవై అనే లెక్క ఎందుకంటే, సంకలనం బిగువుగా వుండాలని. తెలుగు సంస్కృతికీ, అరవైకీ వున్న అనుబంధం కూడా దీనికి ఒక అనుబంధ కారణం'. వివాదాలకు తావులేకుండా, ఎంపిక చేసిన కవితలను ఆయా పత్రికలలో ఆయా కవితలు ప్రచురింపబడిన తేదీల క్రమంలోనే ఈ 'కవిత్వం' పుస్తకంలో అచ్చు వేసారు.

చినవీరభద్రుడి కవితా వాక్యాలు 'ఎక్కడో ఒక బంగారు వాకిలి తెరుచుకున్నట్టుంది'తో మొదలైన ఇందులోని కవితా ఝరి, బండారి రాజకుమార్ కవితా వాక్యాలు 'బడుగు జీవుని బతుకు సిత్రమే / గాల్లో ముట్టిచ్చిన దీపమే'తో ముగియడం ఈ సంకలనం లోని ఎంపిక చేసిన కవితల లోని వైవిధ్యాన్ని సూచిస్తుంది.

తెలుగు సాహిత్య ప్రేమికులందరూ తప్పక చదివి దాచుకోవలసిన వార్షిక కవిత్వ సంకలనం ఈ 'కవిత్వం 2015'.

**- కోడూరి విజయకుమార్,** 83309 54074



**అమ్మల పొది**

మోకా రత్నరాజు;

పుటలు:70; వెల:రూ. 60/-;

ప్రతులకు : అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు




## చైతన్య శరాల అమ్ములపొది

విన్నపాలు కవిగా తెలుగు సాహిత్యంలో తనకంటూ ఒక ప్రత్యేక గుర్తింపు పొందిన కవి మోకా రత్నరాజు. నీవు - నీ స్థానం, పొద్దుపొడుపు,

సాగరస్పర్శ, గుండె కొలిమి, ట్రంకుపెట్టె కవితా సంపుటాలు పాఠకుల మన్ననలతో పాటు ఎన్నో అవార్డులను, రివార్డులను పొందిన కవి మోకా రత్నరాజు. ఇటీవల రత్నరాజు వెలువరించిన ఆరో కవితా సంపుటి 'అమ్ముల పొది'.

'అమ్ముల పొది'లో సుమారు నలభై కవితా శరాలు ద్వారా 'సర్వనాడులు' చచ్చుబడిపోయి, కుంటిపడ్డ దేహాలలోకి, నరాలలోకి కొత్త నెత్తురునీ, సరికొత్త చైతన్యాన్ని, ఉత్తేజాన్ని నింపి సూది వైద్యం - కాదు కవితా వైద్యం చేస్తున్నాడు రత్నరాజు. విభిన్న భావకెరటాలను ఆలింగనం చేసుకుని నిత్యం కొత్త కొత్త ఆలోచనల్ని మదినిండా నింపుకుని శక్తివంతమైన కవిత్వాన్ని సమాజానికి అందిస్తున్న సామాజిక కవి మోకా.

నిరసనకారులు తమ నిరసనను తెలియజేయటానికి దిష్టిబొమ్మలను తగులబెడతారు. ఇటీవల ఇది మరీ ఎక్కువైంది. ఈ దిష్టిబొమ్మలను తయారు చేయటానికి ఉపయోగించేది పశువులు తినే ఎండుగడ్డి. ప్రపంచీకరణ వల్ల ఇటీవల వ్యవసాయ రంగంలో ఎన్నో విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. వరి పంటను ఇప్పుడు యంత్రాల సహాయంతోనే సాగుచేస్తున్నారు. మాన్యువల్ విధానం లేకపోవటం వల్ల యంత్రాలతో సాగుచేయటం వలన ఎండుగడ్డికి గిరాకీ పెరిగింది. దీనివలన దొరికిన కొద్ది గడ్డినీ దిష్టిబొమ్మల పేరుతో తగలబెడితే గడ్డి తినే పశువుల సంగతేమిటి? అందుకే 'గో-గోడు' కవితలో గోపూజ / గోరక్షణల మాట / ఆ దేవుడెరుగు కాని, మానోటికాడమేత/ ఎండుగడ్డిని / దిష్టిబొమ్మలుగా చేసి /గుడ్డిగా తగలబెట్టి మాకడుపులను కొట్టెడి వాళ్ల నుండి ఆ మూగజీవాల్ని ఆదుకోమంటున్నాడు. సముద్రమే సాక్ష్యం కవితలో అనాదిగా స్త్రీలకు జరుగుతున్న అన్యాయం గురించి ఆవేదన చెందుతాడు. తన ఆవేదనను ఎంత కవితామయంగా చెప్పాడో చూడండి ఆడజన్మ కష్టాన్ని చూసి / కన్నీరెట్టు కున్నందుకు కాబోలు / రోజు రోజుకీ సముద్రం మరింత ఉప్పనైపోతుంది / మరింత ఉప్పెనైలేస్తుంది. ఈనాటి సమాజంలో పెరుగుతున్న స్త్రీ చైతన్యానికి ప్రతీకగా సముద్రం మరింత ఉప్పెనైలేస్తుంది అని కవిత్వీకరించాడు.

వాస్తవ విషయాలను కవితామయం చేయగలిగిన నేర్పు రత్నరాజుకుంది. అందుకు నిదర్శనం 'యుద్ధవీరులు' కవిత మురికికంపు కొడుతున్న మాసినగుడ్డల్ని ఉతికి ఆరేసి ఇస్త్రీ చేసి ఒక ఆరోగ్యకర సామాజిక బాధ్యతను తమ భుజాల మీద మోస్తున్న పొట్ట గడవని చాకలి బ్రతుకుల గురించి "రేవులో నానిన పాదాలు ఒరిసి ఒరిసి పుండ్లు పట్టి / పెట్టెలో నెరుసులు చెదిరి / చురకలేసి గాయపరచినా / నిస్సత్తువ వెనకబడుగు బద్ధక రోగాన్ని / దరిచేరనీయకుండా / మురికిని తరిమి తరిమి ఉతకటానికే పుట్టిన రేవు బల్లలై / రాజేసిన స్థైర్య, ధైర్యాల నిప్పు కణికల్ని / కడుపునిండా నింపుకున్న సరికొత్త ఉత్తేజ ఇస్త్రీ పెట్టెలై/ ప్రతిరోజు ఓపికతో

ఉదయిస్తారు / వారు బతుకు పోరుబల్ల మీద జబ్బచరుస్తూ, నిలబడ్డ యుద్ధవీరులు/ విరామ మెరుగని జీవన సైనికులు చాకళ్లు" అంటాడు.

మత్స్యకార జీవితంలోని విషాదాన్ని వ్యక్తీకరించిన కవిత 'కరిమింగిన వెలగలు' రేయింబవళ్లు నీటి మీద చెమటోడ్చి వేట నావలై తెచ్చిన చేపలను కాళ్ళకు కళ్ళను అతికించుకుని, నెత్తి మీద చేపల గంపను తన బొందిలో ప్రాణమే ప్రాణమైనట్టుగా, సందు గొందుల్లో ఈదులాడుతూ ఇంటి నావైన ఆమె, అనుక్షణం శ్రమల సాగరాన్ని ఈదులాడుతున్న, సంసార సమరంలో అప్పుల తీరందాటలేక విలవిల్లాడుతూ బ్రతుకునావను ఈడ్చుతున్నారని మత్యకార జీవిత వాస్తవికతను అద్భుతంగా సెల్యూలైడ్ చేసారు.

**- డా॥ కుంచే నాగసత్యనారాయణ**

99890 14767




## అంతర్వేదన

కవిత్వం: మెరాజ్ ఫాతిమ

వెల: రూ. 60-00; ప్రతులకు: ప్రముఖ పుస్తక కేంద్రాలు

### దుఃఖం దోసిట్లో అంతర్వేదన

మెరాజ్ ఫాతిమా "అంతర్వేదన" కవిత్వం చదువుతున్నప్పుడు ప్రతి కవితలోనూ ఒక ఆర్తి - ఆవేదన పొగమంచులా నన్ను చుట్టేసింది. ఆ పదవిన్యాసం - వాక్యాలపోహళింపులూ - లయబద్ధమైన కూర్పులు - నిలకడ లేని నడకల తీరులూ ఒక్క మాటలో చెప్పాలంటే వదలకుండా చదివించే గుణం మెండుగా వున్న కవిత్వం అంతర్వేదన.

ఎక్కడైనా నాలుగు పాదాలు మనల్ని నిలబెట్టి ఆలోచింప చేస్తే అంతకుమించిన మంచి కవిత్వం ఇంకేముంటుంది. నీటిపుట్టలా ఆ పద ప్రవాహం ఈమెకే అబ్బిన ఒక ప్రత్యేకత. ఈ వ్యవస్థీకృత సమాజంలోని పురుషాధిక్య అవలక్షణాలన్నిటినీ కూకటివేళ్లతో పెకలించాలనేది కవయిత్రి లక్ష్యం. అందుకే చీకటి దుర్మార్గాల్ని శోధించటానికి కాంతితత్వం కాగడా వెలిగిస్తున్నానంటుంది.

అందరూ అనుకుంటున్నట్టు అబల "రాగాల కోకిల కాదు / మూగకోకిల" అంటూ వ్యతిరేకార్థకంలో ధ్వనింప చేస్తుంది. "గోడకు వేళ్ళాడే / తుపాకి కూడా / మౌనంగానే వుంటుంది" అని సిద్ధారెడ్డి గారు భూమి స్వప్నంలో అన్నట్టు గుర్తు. తనతోటి స్త్రీ ఇంటా-బయటా, కుటుంబం-పిల్లలు-స్త్రీ పురుష సంబంధాలు - వివక్ష లైంగికత - నిర్బంధాలు-దౌర్జన్యం

అంతిమంగా స్త్రీని ఒక మాంసపు ముద్దగా మారుస్తునన పురుషాధిపత్యపు రాపిడిలో ధ్వంసం అవుతున్న హృదయ విదారక సంఘటనల్ని చిత్రించిన కవిత్వం మెరాజ్ ఫాతిమాది.

ప్రేమ పట్ల దయ - మోసానికి కసి. కట్టుబాట్లపై అసహ్యం. స్వేచ్ఛపట్ల త్యాగం మొత్తంగా మెరాజ్ కవిత్వం గుండెనిండా దుఃఖం వుంది. ఇది అనాది దుఃఖమేకానీ అనాలోచిత దుఃఖం కాదు. తొమ్మిది నెలలు మోసి-కని-పెంచి పెద్ద చేసిన అమ్మస్థానం ఎంత ఉన్నతమైనదో ఏకరువు పెడుతూనే జోలపాటల్లో కర్మ సిద్ధాంతాన్ని, ఉగ్గుబువ్వల్లోనే స్త్రీ పురుష అసమానతల్ని - బతుకుదారుల్లో ఓర్పునీ - అరచేతుల్లో ఆకలి గ్రంథాల్ని పెట్టి వెళ్ళిపోతున్న అమ్మలనూ - అమ్మమ్మలనూ వ్యంగ్యంగా తూలనాడింది.

మెరాజ్ ఫాతిమ మనఃకుహరంలోని "మౌనకణం" కవితల నిండా పర్చుకుని ఉంది. ఇదంతా స్త్రీవాద కవిత్వమో - సామాజిక చేతనా కవిత్వమో అని ముద్రలు వేయటం సరైంది కాదు గాని, తన కౌటుంబిక - మత - సామాజిక ఆవరణంలో నుంచి తనదైన ఆర్ద్రతను - హక్కులను - ఇట్లా ప్రకటిస్తున్న కవయిత్రుల్లో ఒకరు మహెజబీన్, మరొకరు షాజహానా, ఇదిగో ఇప్పుడు ఈ మెరాజ్ ఫాతిమ గొంతు వినగల్గుతున్నాం.

తన కవిత్వాన్ని రెండు భాగాలుగా ప్రకటిస్తూ తనలో రెండు విరుద్ధ స్వభావాలు ఉన్నాయన్నది. కానీ అది సరైంది కాదు. రెండు భాగాల్లోనూ స్త్రీ ఉంది - సమాజమూ వుంది. ఈ రెండు విరుద్ధ స్వభావాలు అనటానికి వీలులేదు. స్త్రీ పురుష సంబంధాలకైనా, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక అంశాలకైనా, అవలక్షణాలకైనా సమాజమే ప్రధానమైన ఇరుసు. శాఖోపశాఖలుగా విస్తరించే చెట్టుకు పునాది భూమి అయినట్లుగానే అంతర్వేదనలోని కవిత్వమంతా సమాజం అనే నేల విడిచి సాములాంటి సాహసం చేయలేదనేది నిజం. అదంతా అభివ్యక్తిలోని వైయక్తికమే కానీ సామూహికమై ప్రవహిస్తుంది.

"గాయమైన గేయం నుండి / రక్తమోడుతున్న రాగాన్ని పలికించే వీణియనై / పెదవి దాటని మాటలు / గొంతులో విచ్చుకత్తులై గుచ్చుతుంటె విరాగ మౌనికనై / బతికేయాలనుకునే భావుకురాలినై / దోసిట అక్షరాలతో మోకరిల్లుతున్న" మెరాజ్ ఫాతిమ అంతర్వేదన చదివితే అల్లకల్లోలమవుతున్న అబల లాంటి సంద్రం కళ్ళముందు కనిపిస్తుంది.

కవిత్వంలోని ఈ లయనూ - తూగునూ నిరాటంకంగా కొనసాగించాలనీ, మరింత బాధ్యతతో శక్తివంచన లేకుండా ఈ అక్షర ప్రయాణం సాగాలనీ ఆకాంక్షిస్తూ తప్పక చదవాల్సిన కవిత్వం యిది అని గుర్తు చేస్తున్నాను.

**- పరమాత్మ**

98485 52512




## కవిత - 2014, 2015

ఒక్కో పుస్తకం వెల: రూ. 150/-
ప్రతులకు: సాహితీ మిత్రులు - 949063489; అనేక బుక్ షాప్, విశాలాంధ్ర - ప్రజాశక్తి పుస్తక కేంద్రాలలో.




### నీడలా వెంటాడే 'కవిత!' సంకలనాలు

దశాబ్ద కాలంగా సాహితీ మిత్రులు (విజయవాడ) వెలువరిస్తున్న వార్షిక కవితా సంకలనాలలోని కవిత్వాన్ని విశ్లేషించినప్పుడు పదేళ్ల ప్రపంచపు రాపిడి ఆవిష్కృతమవుతుంది. ఆ రాపిడిలో లేదా ఆ ఘర్షణలో తెలుగు సమాజం కూడా ఆవిష్కృతమవుతుంది. కవిత్వానికి సంబంధించి ఉత్తమ లేదా సంపాదక వర్గానికి నచ్చిన కవితలను ఓ చోటకు ఓ స్థానం కలిగి ఉండటం తెలిసినదే.

సాహిత్య మిత్రులు విజయవాడ వారు 2004 నుండి కవిత! పేరుతో పాపినేని శివశంకర్, దర్భశయనం శ్రీనివాసాచార్య సంపాదకులుగా వార్షిక కవితా సంకలనాలు వెలువరిస్తున్నారు. సాహితీ మిత్రులు కవిత 2014-15 సంకలనాలను ఈ ఏడాది మేడేన ఆవిష్కరించారు. కవిత 2014 వరకు పాపినేని, దర్భశయనం సంపాదకులు కాగా, కవిత 2015 విశ్వేశ్వరరావు కూర్పుతో వెలువడింది. ఈ రెండు కవితా సంకలనాల గురించి, విశ్లేషించుకునే క్రమంలో, రెండు ప్రధానమయిన అంశాలు తెలుగు సమాజం ముందు నిలిచాయి. 1) ఉమ్మడి ఆంధ్రప్రదేశ్-ఆంధ్రప్రదేశ్, తెలంగాణాలుగా విడిపోవడం. 2) విభజన తర్వాత ఆంధ్రప్రదేశ్‌కు నూతన రాజధానిగా అమరావతి ఏర్పడటం. సహజంగానే కవులు ఈ రెండు అంశాలపట్ల స్పందించారు. అంతేనా ప్రపంచవ్యాప్తంగా చోటుచేసుకున్న రాజకీయార్థిక పరిణామాలను గమనించారు కవిత్వం చేశారు. నిజానికి కవితా సంకలనాల సంపాదకుల బాధ్యత వారు జరిగిన కాలాన్ని అంచనా వేయగలగాలి.

ఆ చారిత్రక పరిణామాలను చిత్రించే కవితలకు స్థానం కల్పించడమే కాదు. మానవ సహజ భావోద్వేగాలను స్పృశించే కవితలకు స్థానం కల్పించగలగాలి. మళ్ళీ ఇక్కడ కవిత్వం కవిత్వం కోసమేనా? అనే ప్రశ్న రావచ్చు. మనిషి కేంద్రంగా మనిషి అస్తిత్వం మాయమవుతుందనే ఆందోళన రెండున్నర దశాబ్దాలుగా బలపడింది. కవిత్వం ఆ రాజకీయార్థిక పరిణామాలను గమనిస్తూనే మొదటి దశ, రెండవ దశ ఆర్థిక సంస్కరణల ప్రతిఫలనం మానవ జీవితంలో

వేగంగా ప్రవేశించి మనిషిని శకలాలు శకలాలుగా విడదీసింది. మనిషి విధ్వంస రూపాన్ని, ఒంటరి, మానసిక, అశాంతులను, కవులు బలంగా పట్టుకున్నారు.

హృదయం ఉండాల్సిన చోట ఒక శిల ఎప్పటిదో ఒక శీతలీకృత వాంఛ చూస్తూ ఉండిపోతాన్నేను. కొన్ని దినాలో యుగాలో రెండూ ఒకటేనని ఆర్థిక సంస్కరణలు, మానవ హృదయం ఉండాల్సిన చోట ఓ శిలను ప్రతిష్టించాయి. ఇవాళ నూతన మానవుడు శిలను మోసుకొని తిరుగుతున్న స్థితి కనబడుతుంది. బహుశా చైతన్యవంతమైన, లేదా విప్లవ మానవున్ని తయారుచేసిన ప్రగతిశీల సమాజం తర్వాతి దశలలో ఒక మనిషిని తయారు చేసుకుంది. ఆ మనిషి విలువలు ప్రాతిపదికన రూపొందిన వాడు కాదు. కుటుంబం, మానవీయ విలువల్ని దాటి, ఆర్థిక స్వేచ్ఛ మాత్రమే ఉందని విశ్వసిస్తున్న మానవుడు. హృదయాంతరాలలోనికి ప్రవేశిస్తున్న ఏకాకితనం నేటి కవితా వస్తువు. వార్షిక సంకలనాల కవిత్వం ప్రధానంగా విభిన్న సమూహాల రాజకీయ మానవ విలువలలో ప్రవేశిస్తున్న అమానవీయతను పట్టుకోవడమే కాదు? కవిత 2014-2015లోని కవిత్వాన్ని పరిశీలించినప్పుడు రెండేళ్ళ ప్రపంచపు దుఃఖరాపిడి మాత్రమే కాదు ఓ రెండేళ్ళ కాలంలో ప్రపంచం, దేశం తెలుగు సమాజం ఏ రాత్రులవంతెనపై నిలబడిందో స్పష్టమవుతుంది. అయితే వార్షిక కవితల సంపాదకులకు ఖచ్చితమైన కొలబద్ధ ఉండాలి. కాలాన్ని రికార్డు చేయడమే కాదు, కవిత్వం అంశ ఎంత ఉన్నదో పరిశీలించగలగాలి. కవిత 2014, 2015 రెండు సంకలనాలను లోతుగా అధ్యయనం చేసినప్పుడు, లేదా గమనించడం, కవిత్వం నాడి తెలిపిన దర్భశయనం - పాపినేనిల కవితల ఎంపిక వస్తువు. శిల్పం మధ్య ఉన్న సమతుల్యత కవిత 2015లో లేదు. వార్షిక కవితలను రికార్డు చేస్తున్నామంటే, దానికి పరిశ్రమ ఉండాలి. అది కవిత 2015లో లోపించింది. మామూలు కవితా సంకలనానికి వార్షిక కవితా సంకలనానికి స్పష్టమైన తేడా కనబడాలి. లేదా తెలుగు కవిత యొక్క లోతు ఇదేనా అనుకునే ప్రమాదముంది. కొత్త వ్యక్తీకరణతో కవిత్వం చేస్తున్న పాత కొత్త తరం కవిత్వాన్ని గుర్తించకపోతే ఈ సంకలనాల వలన ప్రయోజనముండదు.

ఈ రెండు సంకలనాల గురించి వాఖ్యానించుకునేటప్పుడు తెలుగు కవిత్వం తన పూర్వకాలాన్ని, పూర్వకవుల్ని అధిగమిస్తూ, కొత్తదారులను వెతుకుతుంది. ఎక్కడా తను ఎత్తిన ఖడ్గాన్ని కిందకు దించలేదు. ప్రజల గొంతుకగా కవితావరణలో నిలబడి ఉంది. ఆ ప్రయోజనాన్ని కవితలను ఎంపిక చేస్తున్న సంపాదకులు ఇంకా నిబద్ధతతో పరిశీలించాల్సి ఉంది. భారతీయ భాషలలో వస్తున్న కవిత్వానికి దీటుగా తెలుగు కవిత్వం వస్తున్నది. సాహిత్య ప్రక్రియల్లో ఇవాల్టి సామాజిక సంఘర్షణలో కవిత్వం ప్రవాహ దశను కొనసాగిస్తుంది. ఈ సందర్భంలో కవిత్వం

వినిమయ వస్తువు కానందుకు, ప్రచురణ కర్తతో పాటు కవులు కూడా అభినందనీయులే. మానవుని కన్నీళ్ళకు, దుఃఖానికి అంతులేని మానసిక ఒంటరితనానికి, ఉద్యమానికి అన్ని రంగాల ఆత్మహత్యలకు వెల ఉంటుందా!

రెండేళ్ళ రాజకీయార్థిక పరిణామాల వ్యక్తీకరణకు కవితా రూపం ఎలా ఉందో తెలుసుకోవాలంటే కవిత 2014-2015 సంకలనాల్లోని కవుల హృదయాన్ని దగ్గరగా చూడాలంటే వీటి పేజీలను తెరవండి.

**- అరసవిల్లి కృష్ణ,**

92472 59884



**రేపటి జ్ఞాపకం**

అడిగోపుల వెంకటరత్నమ్

పుటలు : 127, వెల : రూ. 100/-

విశాలాంధ్ర & ప్రజాశక్తి బుక్ హౌస్

కవిసెల్ : 9848252946




## రేపటి జ్ఞాపకం

చుట్టూ విశాల మైదానం కనపడుతున్నా ఎక్కడా మనిషి జాడ లేని ఎడారిలో కొత్తదైన, సొంతదైన, దివ్యభాషతో అక్షర మథనం చేస్తూ ఎడారి గుండెను తడి చేయడానికి వస్తున్న శ్రీ అడిగోపుల కొత్తపొత్తం ఈ 'రేపటి జ్ఞాపకం'.

ఇందులో యాభై తొమ్మిది కవితలతో ఈ కవి ఆధునిక సాహిత్యాన్ని దుక్కి దున్నటానికి కావలసిన కొత్త సరంజామాని పట్టుకొచ్చారు. ప్రపంచీకరణతో మనం గోడౌన్‌లలో వదిలేసిన మన పాత అస్త్ర శస్త్రాలకి కొత్త నగిషీలను చెక్కి ఈ సంక్లిష్ట కాలంలో ఈ ప్రపంచంతో మాట్లాడటానికి సిద్ధమయ్యారు. 'మాట జీవితం / మాట ప్రాణం / మాట సంపద / మాట శాసనం'

అంటూ, ఎమిలీ డికెన్‌సన్ చెప్పిన మాటకు మరణం లేదన్న విశ్వరహస్యాన్ని మళ్ళీ చెపుతూ Waste land లోని ఒక మాట మనకు ఆ రోజును జీవించడానికి గొప్ప బలాన్ని , బలగాన్ని ఇస్తుంది. అలాంటి మాటలను మన మధ్య పూయించగలిగితే, మళ్ళీ మనం మాట్లాడుకో గలిగితే, 'మాట్లాడుకుందాం' రండి అని పిలవగలిగితే ఇరవయ్యొకటవ శతాబ్దపు రెండవ

దశాబ్దంలో మనుష్యులతో నడిచే నేలని చూడొచ్చు అంటున్న శ్రీ అడిగోపుల కవిత్వం కొత్త రోగానికి చికిత్స మొదలు పెడుతుంది.

ఈ రోగం కనిపెట్టిన కవి శ్రీ అడిగోపుల. వైద్యశాస్త్రంలో డయాగ్నైసిస్‌కి గొప్ప విలువ ఉంది. రోగమేంటో తెలుసుకోవడంలోనే వైద్యుని ప్రతిభ దాగుంటుంది. ఈ ఆధునిక మరుభూమిలో... మనిషిలో మరో మనిషి వున్నాడు / విధ్వంసాల ప్రేరకుడు / విధ్వంసాల నిర్వర్తకుడు / సమస్తమైన అశాంతికి, అలజడికి కారణమవుతున్నప్పుడు 'మానవ కళ్యాణం ఒక్కటే మనందరి మార్గం ' – అని ప్రపంచానికి బోధిస్తున్న ఆధునిక బోధిసత్వుడు శ్రీ అడిగోపుల వెంకటరత్నమ్. జార్జి ఆర్వెల్ చెప్పినట్టు ఈ కవి to push the world in a certain direction కాబట్టే ఈ కొత్తపొత్తంలో కవితలు మనమెరిగిన సమస్యలని, మనలని బాధిస్తున్న సంగతులను, మనలని వేరు చేస్తున్న ప్రభావాలని, మనముందే రాలిపోతున్న ఎందరో వ్యక్తులను గురించిన యదార్థాల్ని, భారమైపోతున్న బాల్యాల్ని, అప్పుల్లోకి నెట్టేస్తున్న వ్యవసాయాన్ని, చెట్టుకొమ్మకో, పురుగుమందుకో తమ జీవితాన్ని ముగించుకుంటున్న హాలికులని శ్రీ అడిగోపుల మనకి చూపెడతారు. ఒక కాలానికో, ఒక ప్రాంతానికో, ఒక సందర్భానికో సంబంధం లేకుండా నలుదిక్కులా, సర్వకాలాలలోనూ చర్వితచర్వణమైపోతున్న ఈ సమస్య సుడిగుండానికి బెంబేలెత్తవద్దంటూ ప్రపంచానికి భరోసా ఇస్తారు.

**– నండూరి రాజగోపాల్**

98481 32208



**ధూళిచెట్టు కవిత్వం**

వెల: 100/-, పుటలు: 232

దొరకు చోటు: నవచేతన, నవ తెలంగాణ బుక్‌హౌస్, పాలపిట్ట, తోపుడుబండి

కవి-సెల్: 7093788843




## సున్నితమైన వాక్యసంపద ధూళిచెట్టు

ధూళిచెట్టు కవిత్వం దేనికి చెందుతుంది, కవి ఏం చెప్పదలుచుకున్నాడు అనే ప్రశ్న లేదా సందేహం తప్పకుండా పుడుతుంది. దానికి కారణం – ఆయన ఓ వాదానికి చెందిన కవిగా కనిపించడు.

ఆయన కవిత్వాన్ని వాదాల గుంజకు కట్టేయలేం. అట్లని వాదాల స్పృహ ఆయన కవిత్వంలో లేదా అంటే ఉంది. వాదాలను మించిన విస్తృతి గల కవిగా వాహెద్ ధూళిచెట్టు కవిత్వం కనిపిస్తుంది. ఇటువంటి కవి ఆత్మను పట్టుకోవడం కాస్తా కష్టం. కానీ, మనకు అర్థమైన మేరకు మనకు అర్థమైన రీతిలో కాస్తా చెప్పడానికి ప్రయత్నిస్తే మాత్రం దారులు దొరుకుతాయి.

ధూళిచెట్టు కవిత్వంలో ఓ సున్నితమైన వాక్యసంపద కనిపిస్తుంది. కుసుమపేశలమైన

భావపరంపర పరుచుకుంటూ పోయాడు. అయితే, ఆ సున్నితమైన వాక్యసంపద మధ్య మనకు సమాజంలోని, దేశంలో ప్రస్తుత పరిస్థితులు గుండెను తాకి వణుకు పుట్టిస్తాయి. సమాజంలోని బీభత్సమైన స్థితిని ఆయన తన కవిత్వం నిండా పరిచాడు.

సుతిమెత్తని పదాలతో బీభత్సాన్ని ఎరుక పరిచే ప్రయత్నం వాహెద్ చేశాడు. ఆ సున్నితమైన పదాలతో, వాక్యాలతో ఆయన ఆగ్రహాన్ని, ధిక్కారాన్ని కూడా సంధించి వదిలాడు.

వాహెద్ చీకటి వెలుగుల మధ్య ప్రయాణం చేస్తూ సమాజం నిండా చీకటి పరుచుకుంటున్న విషయాన్ని మన కళ్లకు చూపించడు, హృదయానుభూతం చేస్తాడు. అందుకే, ఆయన కవిత్వం వణుకు పుట్టిస్తుందని చెప్పడం. చీకటిని చీల్చే ఖడ్గం కూడా కవిత్వమనే స్పృహ వాహెద్‌కు ఉంది. అందుకే కవిత్వాన్ని ధరించిన మనిషి కావాలంటాడు. కవిత్వాన్ని ధరించటం అంటే సున్నితమైన హృదయం, మానవ స్పృహ, నలుగురి పట్ల పట్టింపు... మొత్తంగా సమాజం పట్ల సానుకూల మానవీయమైన దృష్టి ఉండడమని అర్థం.

కవి నిస్సహాయుడనే విషయం కూడా వాహెద్ కవిత్వం చదివితే అర్థమవుతుంది. ఆ నిస్సహాయత నుంచి వేదనను, ఆగ్రహాన్ని కవి పరుచుకుంటూ పోతాడు. "ఎండలు మండిపోతున్నాయి / అందుకే నీడను వెంటపెట్టుకుని తిరుగుతున్నాను". అంటాడు. మనిషి ఒంటరివాడై పోతున్న వైనాన్ని కూడా వాహెద్ కవిత్వీకరించాడు. మనిషి సామూహికం కావాలనే ఆకాంక్ష ఇందులో ఉంది. "కాకి అరుపుకు పది కాకులు చేరుతాయి/ భాష బలహీనమైంది- ఒక్కరు రారు కదా" అని అంటాడు.

భాష లేని పశుపక్ష్యాదులు ఒంటరి వేదనను ఎదుర్కోవడానికి సామూహికమవుతుంటే, భాష ఉండి కూడా మనిషి సామూహికం కాలేకపోవడాన్ని ఆయన అలా సంకేతించాడు.

వాహెద్ సామాజిక కల్లోలాన్ని స్వీయ కల్లోలంగా మార్చుకున్నాడు. తిరిగి దాన్ని సామాజికం చేస్తున్నాడు. అంటే వస్తుగతాన్ని ఆత్మగతం చేసుకుని తిరిగి వస్తుగతం చేస్తున్నాడు. దీనివల్ల కవిత్వం కళాత్మకంగా వ్యక్తమవుతుంది.

తెలుగులో ముస్లింవాదం బలంగా ముందుకు వచ్చింది. అయితే, వాహెద్ దీన్ని ఎలా పలుకుతున్నాడనేది ప్రశ్న. బహుశా, ఇది ఒక్క ముస్లింల సమస్య కూడా కాకపోవచ్చు. యావత్తు దేశానికి చెందిన సమస్య. వాహెద్‌ది ఇస్లాం మతం. అతనికి మతం వ్యక్తిగతమైంది. కానీ ముస్లింగా తన అస్తిత్వానికి వేళ్లు ఈ దేశంలోనే ఉన్నాయని పలుకుతున్నాడు.

రాజ్యాంగం నిర్దేశించిన లౌకిక విధానానికి, స్వేచ్ఛకు - ఆ స్వేచ్ఛ కూడా ముస్లిం అయినందుకు -భంగం వాటిల్లినప్పుడు వాహెద్ సున్నితంగానే అయినా స్పష్టంగా పలికాడు. తన అస్తిత్వానికి సంబంధించిన వేళ్లు ఈ దేశంలోనే ఉన్నాయని ప్రకటించుకుంటున్నాడు. ముస్లిం కావడం వల్ల వాహెద్ లాంటి కవి కూడా తన ముస్లిం అస్తిత్వాన్ని చాటుకోవాల్సి వచ్చింది.

ఈ కోణం నుంచి వాహెద్ కవిత్వాన్ని అర్థం చేసుకోవాల్సి ఉంటుంది. అతను తన కవిత్వంలో అంతకు మించిన స్వీయ మతాభివ్యక్తులను తీసుకుని రాలేదు. పావురాళ్లు కవిత చదివితే వాహెద్ ఆక్రోశం ఏమిటో మనకు అర్థమవుతుంది. ఆ ఆక్రోశంలోని సామంజస్యం కూడా మనకు అర్థమవుతుంది.

వాహెద్ ధూళిచెట్టు కవిత్వానికి మరో లక్షణం కూడా ఉంది. దేశంలో రహస్యంగా, కూడబలుక్కున్నట్లు విస్తరిస్తున్న దళిత మైనారిటీ వ్యతిరేకతను వాహెద్ చాలా నర్మగర్భంగా చెప్పాడు. నిజానికి ఆయన కవిత్వం పలికే ప్రధాన ఆలోచనాధార అదే. ఈ విషయంలో వాహెద్ చాలా జాగరూకతతో వ్యవహరించాడని ఆయన కవిత్వం చదివితే అర్థం అవుతుంది.

ప్రగతి నిరోధక శక్తులు, ప్రజా వ్యతిరేక శక్తులు... సమాజాన్ని ముక్కలుగా చీల్చే శక్తుల తాత్వికతను ఎత్తి చూపుతూ అవి తెచ్చే పెట్టే పరిస్థితులను కవిత్వీకరించాడు. ఆ రకంగా వాహెద్ కవిత్వం సార్వజనీనతను సంతరించుకుంది. రాజకీయం పేరుతో విస్తరిస్తున్న అరాజకీయ పరిస్థితిని వాహెద్ తన కవిత్వంలో పలికాడు. ఆ రకంగా అతను నిజమైన పొలిటికల్ పోయెట్. అదే సమయంలో నిజమైన మార్క్సిస్టు పోయెట్‌గా కనిపిస్తాడు.

వాహెద్ కవిత్వం సున్నితంగా, నర్మగర్భంగా ఉండడానికి పారశీక, ఉర్దూ కవిత్వ సంస్కారమై ఉండవచ్చు. ఆ ప్రభావం వాహెద్‌పై బలంగానే ఉంది. అది రూపంలో కనిపిస్తుంది. అలాగని అతను అనుచరుడు కాదు. తన సొంత గొంతుతో ధూళి చెట్టు కవిత్వం కొమ్మలను విస్తరిస్తూ వెళ్లాడు. వాటిపై పక్షులను కూడా నాటాడు.

- కాసుల ప్రతాపరెడ్డి

## నెత్తుటి మరకలు - దీర్ఘకావ్యం



కవి: నేలపూరి రత్నాజీ

పుటలు: 20 + 44; వెల: రూ. 40/-

ప్రతులకు: కవి, చాగల్లు (పోస్ట్), పశ్చిమ గోదావరి జిల్లా - 533402

సెల్: 94403 28432




### మనువాదంపై సంధించిన రత్నాయుధం - నెత్తుటి మరకలు

గాయాలను కదిపి అనుభవాలను తరచి చూసే ఆస్తిత్వ చైతన్యంతో, సూక్ష్మ జ్ఞానంతో, నిర్దిష్టమైన వివేచనతో రత్నాజీ దళితకవిగా పరిణామం చెందాడు. దళిత సాహిత్య ప్రస్తానంలో మడమ తిప్పకుండా ముందుకు సాగిపోతూ కలం దించకుండా కవిత్వం రాస్తూనే ఉన్నాడు. 'నాలుగు పడగల హైందవ నాగరాజుపై కత్తుల దూస్తూనే ఉన్నాడు.

దళిత జీవన విధ్వంసాన్ని చూసి రత్నాజి ప్రతినిత్యం నిప్పులకుంపటిలా ప్రజ్వలిస్తుంటాడు. సలసలకాగుతున్న నీళ్ళలా సెగలు కక్కుతుంటాడు. ప్రచండ ఝంఝామారుతంలా ఘోషిస్తుంటాడు. పట్టలేని ఆ హృదయ సంఘర్షణను, కట్టు తెంచుకుని పోటెత్తే ఆ భావ తీవ్రతను సమర్ధవంతంగా రత్నాజీ కవిత్వంలోకి బట్వాడ చేసి పాఠకుల్లో ప్రగాఢమైన అనుభూతిని కలిగిస్తాడు. ఇలాంటి అనుభూతి ఒరవడితోనే "నెత్తుటి మరకలు" దళిత దీర్ఘకవితను తీసుకొస్తున్నాడు రత్నాజీ. లక్షింపేట నరమేధంలో 'పిగిలి పోయిన గర్భసంచుల' పేగుభాషను, 'తెగి పోయిన నాల్కల' మూగ వేదనను, 'కాలిబూడదైపోయిన' బతుకుల వెతల్ని దళిత తాత్విక దృక్పథంతో హృద్యంగా కవిత్వీకకరిస్తున్నాడు కవి. 'క్షుద్ర వేదవాఙ్మయ కుతంత్రాలను', నీతి మాలిన శ్లోకాలు వల్లించిన వైషమ్యాలను నిచ్చెన మెట్ల వ్యవస్థ ప్రవచించిన వక్రగీతోపదేశాలను కాలదన్ని ఆత్మగౌరవ సాహిత్య చరిత్రలో మరో కవితాధ్యాయాన్ని అవర్ణాక్షరాలలో లిఖిస్తున్నాడు రత్నాజీ.

ఈ వర్ణ ధర్మ ఆర్థిక విధానంలో భాగంగానే ప్రాబల్య వర్గాలు భూమిపై తిరుగులేని ఆధిపత్యాన్ని సంపాదించారు. శ్రమైక జీవులైన భూమి పుత్రులు అన్నార్తులుగా ఆకలి మంట్లో మగ్గిపోతున్నారు. 'నెత్తుటి మరకలు' దీర్ఘకవితలో రత్నాజీ భూమి చుట్టూ అల్లుకన్న అనేకానేక కుతంత్రాలను అత్యంత పరిశీలనా దృష్టిలో వివేచించాడు'. దళితులకు భూమికి మధ్య ఉన్న రక్త సంబంధాల్ని ప్రపంచీకరణ సందర్భంలో పచ్చని పంటపొలాలను కబళించే భూబకాసురుల రాజకీయాలను, వారి అడుగులకు మడుగులొత్తే పాలకవర్గాల కువాహ వ్యూహాలను ఈ దీర్ఘకవితలో కవి ఎంతో ప్రతిభావంతంగా బొమ్మకట్టించాడు.

"నా మాట వినగానే జల జల పొంగి/ నా వేళ్ళ సందుల్లో పాపిట దిద్దుకున్న భూమి/ తనచుట్టూ తాను/ తిరగాల్సిన భూమి/ మీ షోకేసులో గ్లోబు ఎలా అయ్యిందో/ ఈ చరిత్రపై కొరడా పట్టాలి/ మేడ గిన్నెలో మెత్తుకై/ వాడ గొంతు దిగని ఎక్కిల ఎందుకయ్యిందో / అంటూ భూ దురాక్రమణదారులపై ప్రశ్నాస్త్రాలను సంధిస్తున్నాడు రత్నాజి. "భూమితోనే ఆత్మగౌరవం/ భూమంటే రాజ్యాధికారం/ మా కోసం ఓ భూభాగం తేగేసి ఇవ్వాలి" అంటూ కోటి గొంతులతో నింగి చెవులు మారుమ్రోగేలా భూమిగీతం ఆలపిస్తున్న నేలపూరి రత్నాజీని మనసారా గుండెలకు హత్తుకుంటున్నాను. దళితులను చైతన్యంచేసే మరిన్ని కవితా సంపుటులను తీసుకురావాలని కోరుతున్నాను.

**- డా॥ కోయి కోటేశ్వరరావు**

94404 80274

## టూకీగా..

### అజరామరం




బిందువు, మనిషి జాడ కవితా సంపుటాలలో సాహితీలోకానికి సుపరిచితుడైన ఎమ్వీ రామిరెడ్డి నూతనంగా ఏర్పడుతున్న ఆంధ్రప్రదేశ్ రాజధాని వాసి. "ఒక నిర్మాణం కోసం / సామూహిక జీవన సూత్రం ధ్వంసం కావడం / వ్యవస్థీకృత విషాదం" అని నిజాన్ని చెప్తున్న రామిరెడ్డి కవిత్వంలో విమర్శనా వాస్తవికత ఉంది. 'నుదుటి మీది చందమామల్ని', 'దేహం నిండా దీపాల వెలుగు'లను చూపిస్తున్న 'సజీవ దృశ్యాల సమ్మేళనం' ఈ కవితా సంపుటి. మనిషంటే నాకు మహా యిష్టం / కవిత్వం అజేయం / మనిషి తనం అజరామరం' అని తన కవిత చిరునామాగా మనిషిని ప్రకటిస్తున్నాడు. మనుషులంటే మహా ప్రేమ ఉండబట్టే సాహిత్యానికే పరిమితం కాకుండా తనకున్న చిన్న పరిధిని విస్తృతపరచుకుంటూ సామాజిక సేవలందిస్తున్న మానవుడు రామిరెడ్డి.

**- పెనుగొండ లక్ష్మీనారాయణ**

**అజరామరం: ఎమ్వీ రామిరెడ్డి; పుటలు: 102; వెల: 80; ప్రతులను: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు; సెల్:9866777870.**

---

### గుండెతడి




కవి విద్యార్థి దశలో ఉన్నపుడు తన 23 ఏట వ్రాసిన కవి కవితలివి. 1980-91 మధ్యకాలం. వైద్య విద్యార్థిగా ఉన్నప్పుడు గుండెలోనున్న కవి మేల్కొన్నాడు. అప్పటి వయసు 23. ఈ కవితల వయస్సు ఇప్పుడు 35 సంవత్సరాలు. నాటి సమాజానికి అద్దంపట్టే కవితలే 'గుండెతడి'లో వున్నాయి. న్యాయం కోరుకుంటుతుంది / అధికారం అమృతమయింది/ అవినీతి మంచమెక్కింది అని అంటారు నేడు అనే కవితలో! కవిత్వాన్ని వ్యవసాయంగా భావించి కలం అనే నాగలిలో / తనివితీరా దున్ని / ఆలోచనా విత్తుల్ని మొలకెత్త జేసి / కవిత అనే పంటను పండిస్తాను" అంటారు నాలో నేను కవితలో.

**- ఆచార్య అనుమాండ్ల భూమయ్య**

**గుండెతడి, డా॥ కె. ఎస్. ఎస్. ప్రసాదరెడ్డి; పుటలు: 150; వెల: యివ్వలేదు; ప్రతులకు: కవి, ప్లాట్ నెం. 215 బిఎస్ఎన్ఎల్ టవర్స్ ఎదురుగా, నందినగర్, రోడ్ నెం. 14, బంజారాహిల్స్, హైదరాబాద్ - 500 034. సెల్: 98480 68926.**



## నా చిరునామా

దాదాపు నలభై సంవత్సరాల క్రితం కవితారంగంలో ప్రవేశించి - అనేక కవితలు వివిధ పత్రికల్లో ప్రచురించి మౌనంగా తెరవెనక్కు వెళ్లిపోయిన రమణ వెలమ కన్ని 2012లో తిరిగి 'జీవన సందర్భాలు' కవితా సంపుటి వెలువరించారు. ఇప్పుడు 60 కవితలలో 'నా చిరునామా' ను ప్రకటించారు. తెలుగులో కవులు కవిత్వంపై కవిత్వం రాయడం కొత్త కాదు గాని రమణ ఈ సంపుటిలో అక్షర ప్రయాణం వంటి అరడజను కవితల్లో కవిత్వం గురించి పలవరించారు. "ఎంత కవిత్వం రాసినా / ప్రతీసారీ తొలిసారిలా / కొత్తగానే తోస్తుంది... అనడం ప్రతీకవీ పొందే అనుభవమే! నేలవిడిచి సాముచేయని రమణ కవిత్వంలో సమకాలీన సమాజం ప్రతిబింబిస్తుంది. చెత్తకుండీ, చీపురు, టెలిగ్రాం వంటి కవితలు రమణ కవిత్వంలోని వస్తు వైవిధ్యాన్ని పట్టి యిస్తాయి.

**- డా॥ వరుగు భాస్కర రెడ్డి**

**నా చిరునామా; వెలమకన్ని రమణ; పుటలు: 136; వెల: 125. ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు; సెల్: 987660 15040.**

---



## విస్ఫోటనం

గొట్టిపర్తి యాదగిరి రావు గారు 1980లో మరో నలుగురితో కలిసి 'అగ్ని పుష్పాలు' మినీ కవితా సంకలనాన్ని ప్రచురించారు. ఈ విస్ఫోటనంలో మినీ కవితలు, కొంచెం పెద్ద కవితలు కలగలసి ఉన్నాయి. జీవితానుభవం కవిత్వానికి పరిణిత రూపం ఇస్తుందన్న సత్యాన్ని మొదటి కవిత పట్టియిస్తుంది. సమకాలీన సమాజాన్ని పట్టి పీడించే సమస్యలు యాదగిరి రావు దృష్టిని తప్పించుకుని పోలేదు. చీడపురుగులు కవితలో ఓటుకు నోటును ప్రస్తావించి రాజకీయరంగంలోని చీడపురుగుల వైపు వేలెత్తి చూపిస్తున్నారు. యాదగిరిరావు కవిత్వం సరళంగా, సహజంగా, సూటిగా వుంది. కొన్ని కవితల్లో తాత్వికను ఇష్టపడితే; మరికొన్నింటిలో తెలంగాణా వాదం పట్ల మొగ్గు ఉంది. కవి అనుభవజ్ఞానం చిమ్మే వెలుగురేకలివి - "మనిషి / రహదారి వీడి / అడ్డదారిపట్టినప్పుడే / జీవితం నరకప్రాయమవుతుంది".

**- డా॥ అమ్మంగి వేణుగోపాల్,** 94410 54637

**విస్ఫోటనం; గొట్టిపర్తి యాదగిరిరావు, పుటలు: 54; వెల: 50/-; ప్రతులకు: పాలపిట్ట బుక్స్, హైదరాబాద్; రచయిత సెల్: 82972 77795.**




## ది హార్వెస్ట్

'ఏ భాషలో అయినా కవిత కవితే' అని ఆర్కిబర్డ్ మెక్‌లీష్ అంటాడు. దేశానికి వెన్నుగర్ర అయిన రైతు సేద్యం అనుభవాలు, రాయలసీమ రైతు వ్యవసాయ జీవనం ఆధునిక కవిత్వంలో అత్యంత సహజంగా అక్షరబద్ధంగావించబడిన ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి గారి ప్రసిద్ధ కావ్యం పొలి. ఇందులోని అంశాలు జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ పాఠకులు అవగాహన పొందడానికి "ది హార్వెస్ట్' అన్న పేరుతో ఈ కావ్యాన్ని ఆంగ్లంలో వెలుగులోనికి తేవడానికి గావించిన చిన్న ప్రయత్నం ఇది. వ్యవసాయ రంగంలో, గ్రామీణ నేపథ్యంలో మూలకావ్యం 'పొలి'లో విరివిగా వాడబడిన వ్యవహారిక పదాలు, తెలుగు మాండలికాలు అన్నీ పాఠకులకు ఆంగ్లంలో సులభంగా వుండే రీతిగా వీలయినంత సరళంగా ఇందులో అందించబడినాయి.

**- డా॥ పి. రమేష్ నారాయణ**

**ది హార్వెస్ట్ (ద్విభాషా కావ్యం) - రాచపాళెం పొలి దీర్ఘకావ్యానికి ఆంగ్లానువాదం - అనువాదకులు: డా॥ పి. రమేష్ నారాయణ; పుటలు: 120; వెల: రూ. 90/-; ప్రతులకు రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, 5/134, 7వ క్రాస్, భైరవ నగర్, జెఎన్‌టియు వెనక, అనంతపురం; సెల్: 94402 22117.**

---

అవధాన విద్యా సర్వస్వము



డా॥ రాపాక ఏకాంబరాచార్యులు

## అవధాన విద్యా సర్వస్వము

ఈనాడు అవధాన కళా ప్రదర్శన అన్ని తరగతుల వారినీ ఆకర్షిస్తోంది. అష్టావధానం, అష్టాదశావధానం, శతావధానం, ద్విశతావధానం, సహస్రావధానం, పంచసహస్రావధానం ఇట్లా సంఖ్యాపరంగా పెరుగుతూ, సాహిత్యేతర ప్రక్రియల్లోకి కూడా ఇది ప్రవేశించింది. నాట్యావధానం, నేత్రావధానం, రాగావధానం, గేయధరావధానం, హాస్యావధానంగా రూపొందింది. ఆధునిక వినోద సాధనమైన సినిమాల్లోని గాయకులు, పాటలపైన కూడా అవధానాలు నిర్వహిస్తున్నారు. ఇటువంటి ఒక విశిష్టమైన సాహిత్యాన్ని తీసుకుని డా॥ రాపాక ఏకాంబరాచార్యుల వారు విశేషమైన రీతిలో పరిశోధన చేసారు. పూర్వం అవధానంపై అనేక గ్రంథాలు వచ్చాయి గానీ ఇంతటి విస్తృతమైన సమాచారాన్ని అందిచలేదు. ఇక చెప్పడానికి ఏమీ లేదన్నంతగా దీనిలో అంతా చెప్పేసారు. ఏదైనా విశ్వవిద్యాలయం దీనికి డి.లిట్. పట్టా ఇవ్వవచ్చునేమో పరిశీలించాలి!

**- డా॥ టి. గౌరీశంకర్,** 94409 69130

**అవధాన విద్యా సర్వస్వము: రచయిత - డా॥ రాపాక ఏకాంబరాచార్యులు; పుటలు: 1042; వెల: రూ. 1,000/-; ప్రతులకు: శ్రీమతి రాపాక రుక్మిణి, ఎంఐజి-2, నెం. 56, మస్కమహల్ కాంప్లెక్స్, హుడా కాలనీ, అత్తాపూర్, హైదరాబాద్-500 064; రచయిత-సెల్:94404 94752.**




## కవితావిపంచి

ఒక వ్యగ్రతతో సోమసుందర్ శ్రీనివాసరావు కవిత్వాన్ని చదివారు. కవిత్వం ఉన్నచోట పరవశించారు. శిల్ప సౌందర్యాన్ని ప్రశంసించారు. ఉత్తమ గుణాన్ని మెచ్చుకున్నారు. అభ్యంతరాలను మెత్తగా ప్రకటించారు. 91 ఏళ్ల పాఠకుడి అనుభవం ఇది. కవితా స్వాదనశక్తి ఇది. సోమసుందర్ గ్రహించలేనివి, ఆస్వాదించనివి కూడా ఉండి ఉండవచ్చు. అవి మనవి. మనం మాత్రమే చూడగలిగినవి. భావించగలిగినవి. తన సమకాలీన కవులలో లబ్ధ ప్రతిష్టులైన కవులందరి కవిత్వం గురించి సోమసుందర్ రాసారు. ఇప్పుడు వైవిధ్యంతో కూడిన శ్రీనివాసరావు కవిత్వం గురించీ రాసారు. ఒక ఉత్తేజ భరిత పఠనం జరిగిందని ఈ పుస్తకం చెబుతుంది. మీరు చదవండి. సోమసుందర్‌ని, శ్రీనివాసరావునూ, కవులనూ, కావ్యాలనూ చదవండి. మరో కోణాన్ని పఠనానికివ్వండి.

**– డా॥ సీతారాం**

**కవితా విపంచి క్రాంతి గీతాలు: ముvvా శ్రీనివాసరావు కవిత్వంపై వ్యాఖ్యానాత్మక విమర్శ: రచన – డా॥ అవంత్స సోమసుందర్, పుటలు: 70; వెల: రూ. 60/-; ప్రతులకు అన్ని పుస్తక కేంద్రాలు; కవి సెల్: 9948099900.**

---




## అకాశం అందుతోంది

డి.కె, చదువుల బాబు ఉపాధ్యాయుడు, రచయిత. బాలసాహిత్య సాంస్కృతిక సేవా సమితి వ్యవస్థాపక అధ్యక్షుడు. బాలల కోసం అసంఖ్యాకంగా కథలు కవితలు, నవలలు, విజ్ఞాన గ్రంథాలు రచించారు. రాయలసీమ నుండి తెలుగు బాల సాహిత్యాన్ని ఉద్యమ సదృశంగా సృష్టిస్తున్న చదువుల బాబు 465 మంది రచయితలను 'కడప జిల్లా సాహితీ మూర్తులు పేరున పరిచయం చేసారు. ఇప్పుడు ఆకాశం అందుతోంది కవిత్వ సంపుటిని పాఠకులకందిస్తున్నారు. ఈ కవిత్వంలోని ప్రధాన గుణం ప్రబోధాత్మకత. కవి నేరుగా మనుషులతో మాట్లాడి మారమని చెబుతున్నట్లుగా ఉంటాయి. సంభాషణాత్మకత మరోగుణం. స్త్రీ పురుష సంబంధాలు, బాలకార్మిక వ్యవస్థ. అమ్మ, నాన్న, రాగింగ్, పర్యావరణం, రాయలసీమ కరువు, వంటి వస్తువుల మీద చదువుల బాబు కవితలు రాసారు.

**– ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి**

**ఆకాశం అందుతోంది: డి.కె. చదువుల బాబు; పుటలు: 70; వెల: రూ. 80/-; ప్రతులకు: కవి, 3/528, వై.ఎం.ఆర్. కాలనీ, ప్రొద్దుటూరు, కడప జిల్లా – 516 360; రచయిత సెల్: 9440703716.**



## నేనెక్కడో తప్పిపోయిన

నల్లాలం, బొగ్గుదంచి కట్టె పలకకు రుద్ది ఆరినంక బలపంతో ఓనమాలు దిద్దుకున్న నాటి నుంచి ఐపాడు మీద అక్షరాలు పేర్చే దాకా గడిచిన జీవిత గమనంలో జ్ఞాపకాల గాలిపటం ఇంకా బాల్యంపైనే ఎగరటం బలమైన బాల్యస్మృతుల ప్రభావమే కావచ్చు. ఉద్యోగ నిర్వహణ తర్వాత నెమరు వేసుకున్న జ్ఞాపకాల చిత్తడి ఈ పుస్తకం. తెలంగాణ ఏర్పడ్డ నేపథ్యంలో తెలంగాణ పదాలతో అల్లుకున్నవే ఇందులో ఎక్కువగా ఉన్నాయి. తూర్పు నుండి పడమటి దాకా పయనించిన పయోధర శకలం అద్దుకున్న కొన్ని ఆధునిక జీవన ప్రతి స్పందనలు కూడా ఇందులో ఉన్నాయి. ఇందులోని కవితలన్నీ దాదాపు ఫేస్‌బుక్‌లో పెట్టినవే.

**(– కవి ముందుమాట నుండి)**

**నేనెక్కడ్నో తప్పిపోయిన (జ్ఞాపకాల చిత్తడి): తుమ్మూరి రాం మోహన్ రావు; పుటలు: 86; వెల: రూ.100/–; ప్రతులకు: కవి, 11–5/173, రామంచ అవెన్యూ, పీర్జాదీగూడ, ఉప్పల్, హైదరాబాద్, తెలంగాణ–500039. సెల్: 970152224**

---

## శిథిలాలలో...



నాగార్జున సాగర్ ప్రాజెక్ట్ క్యాంప్ కాలనీ ఖమ్మంలో దాదాపు 40 ఏళ్ల క్రితం 740 క్వార్టర్లను ఉద్యోగులకోసం నిర్మించారు. అభివృద్ధి పేరిట జరిగే కుట్రలో ఆ క్వార్టర్సులో ఉన్న 95 ఎకరాల స్థలంపై కన్నుపడింది. ఖమ్మం నడిబొడ్డులో ఉన్న ఖరీదైన స్థలం ప్రభుత్వం తన తాబేదార్లకు కట్టిబెట్టే ప్రయత్నంలో కూలగొట్టిస్తూ ఉంటే నిరాశ్రయులైన ప్రజలతరపున తమ అక్షరాల్ని నిరసనాయుధాలుగా అందించిన కవులు కపిల రాంకుమార్, సుభాషిణి తోట, కంచర్ల శ్రీనివాస్, వా.వీ, వి. సులు, ఒక క్యాంప్ కాలనీలో ఒకే సన్నివేశం – రెండు సందర్భాలు ప్రతిరోజూ నేను చూస్తున్నానని ఆ నలువురు కవులు, ఒంటరి తపాలా డబ్బాలా అనాథ బ్రతుకు బ్రతుకుతూ, బ్రతుకుబండిలాగుతున్న ప్రజల కల చెదిరిందనే ఎరుకతో గతం నెగడులో మండుతున్న ఘోషను శిథిలాల్లో మొలిచిన అక్షరాలుగా కవిత్వం చేసారు.

**(ముందుమాట నుండి)**

**శిథిలాలో మొలిచిన అక్షరాలు: కపిల రాంకుమార్, సుభాషిణి తోట, కంచర్ల శ్రీనివాస్, వా.వీ., వి.సు.; పుటలు: 32; వెల: రూ.30/–; ప్రతులకు: బోడేపూడి విజ్ఞాన కేంద్రం, సుందరయ్య భవనం, ఎన్.ఎస్.సి. క్యాంప్ కాలనీ, ఖమ్మం – 507 002.**




## లంబా హై సఫర్

'వెన్నెల కుప్పలు' ఆడిన దిలావర్‌గారికీ, 'కర్బలా' దాకా వచ్చిన దిలావర్ గారికీ చాలా దూరం. ఎంత దూరం అంటే ఆ తిలక్ వాసనలూ ఆ శేషేంద్ర ఛాయలూ ఉన్న దిలావరేనా అనిపిస్తుంది. ఇవాల్టి తరం కవులు మార్పుని స్వీకరించడంలో పెద్ద విశేషమేమీ లేదు. వాళ్ళ తాజాకళ్ళలోంచి కనిపిస్తున్న దృశ్యమే వాళ్ళు అక్షరాల్లో గీస్తున్నారు. కాని దిలావర్‌లాంటి నిన్నటి కవి ఆ పాత భావనల ఇనుప నఖాబ్‌లన్నీ ఛేదించుకుని ఇలా కనిపించడం మాత్రం ఆశ్చర్యం! అలా ఆశ్చర్యపడే కవిత్వాన్ని రాసినందుకు దిలావర్‌గారిని ముందు దిల్‌భర్ మెచ్చుకోవాలి. ఇది ఆయన ఎంతగానో ప్రేమించే కౌముదిగారికి కూడా నచ్చే మార్పే!

**- డా॥ అఫ్సర్**

**లంబా హై సఫర్-డా. దిలావర్ సమగ్ర కవిత్వం; పుటలు: 230; వెల: రూ.100/-; ప్రతులకు: డా. దిలావర్, సిల్ క్యాంపస్, గాంధీనగర్, నవభారత్, పాల్వంచ, ఖమ్మం జిల్లా-507154, సెల్: 98669 23294**

---

## కాలుష్యపు కోఱలలో...




అసలు ఒక పద్య కవితా సంపుటికి కాలుష్యపు కోఱలలో (బండి 'ఱ'తో సహా, అనే నామకరణమే అనూహ్యం. వస్తుపరంగా పద్యం ఆధునికమయ్యింది. అందుకే మనగల్గుతోంది అనడానికి ఇదొక నిదర్శనం. ఈ శీర్షికతో రాసిన పద్యాలను కుమారభారతి పాఠ్యపుస్తకంలోకి చేర్చుకొన్నారంటే, చేర్చుకోరా మరి! రాఘవేంద్ర! అభినందనలు!

దీనికి అనుబంధ శీర్షిక 'తరువేదన'. అత్యంతంబు శుద్ధంబుగా నీ పర్యావరణంబుఁగాచుమము హింసింపంగ నేన్యాయమౌ? అన్నది వీరి ప్రశ్న కాదు. తమ మానాన తాము మౌనంగా ఎదిగే చెట్లు వేస్తున్న ప్రశ్న. సగం నిద్రలో ఉలిక్కిపడి లేచే లేపే ప్రశ్న. కవిత్వానికి ఇంతకన్నా పరమార్థం ఏమిటి?

**- ఆచార్య బేతవోలు రామబ్రహ్మం**

**కాలుష్యపు కోఱలలో... పద్య కవితా సంపుటి; డా॥ ఎస్.వి. రాఘవేంద్ర రావు; పుటలు: 116; వెల: 100/-; దొరకు చోటు ఎం.ఐ.జి.59, ఎ.పి.హెచ్.బి. కాలనీ, లాలాచెరువు, రాజమండ్రి. సెల్: 95334 83294**

# కవిసంధ్య కవితా యాత్ర



దుర్ముఖినామ సం॥ 'ఉగాది'నాడు యానాంలో
ప్రారంభ సంచికను ఆవిష్కరిస్తున్న దాట్ల



ఆగస్టు 15న కవిసంధ్యను ఆవిష్కరిస్తున్న
మంత్రి శ్రీ మల్లాడి కృష్ణారావు, యానాం



కె. శివారెడ్డి, గంటేడ గౌరునాయుడు, చీకటి
దివాకర్, బాలసుధాకర మౌళి-విజయ నగరం



చిత్తూరు జిల్లా తిరుపతి రచయితల సభలో మేడిపల్లి
రవికుమార్, సాకం నాగరాజు, పలమనేరు బాలాజీ



ప్రజ్వలిత సాహిత్య సదస్సులో చిత్రకారులు
ఎస్వీ రామారావు, పొట్లూరి హరికృష్ణ



సాహితీ స్రవంతి - కుసుమాంజలి సదస్సులో
తెలకపల్లి రవి, రాజమండ్రి



ఎస్వీ యూనివర్సిటీలో పలమనేరు బాలాజీ, సాకం నాగరాజు,
మేడిపల్లి రవికుమార్, కిరణ్‌క్రాంత్ చౌదరి, కిట్టన్న




బ.ర.వే. సాహిత్య సదస్సులో
జి. లక్ష్మీనర్సయ్య, స్టీల్ సిటీ-విశాఖపట్నం

**Department of Culture and Arts, Govt. of Puducherry**

**భాషా సాంస్కృతిక శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, అమరావతి సౌజన్యంతో**
**కవిసంధ్య, స్ఫూర్తి సాహితీ సాహిత్య సాంస్కృతిక సంస్థలు, యానాం**
**సంయుక్త ఆధ్వర్యంలో**







Puducherry
Government

## యానాం కవితోత్సవం-2016

తేది: 26, 27 నవంబర్ 2016, శని-ఆదివారాలు

సమయం: ఉదయం 9.30 గం.ల నుండి

వేదిక: డా॥ అవంత్స సోమసుందర్ ప్రాంగణం - బొజ్జాతారకం వేదిక
(క్షత్రియ పరిషత్, ఫెర్రీరోడ్, యానాం, పుదుచ్చేరి)

## ప్రారంభ సదస్సు

**26 శనివారం ఉదయం 9.30 గం.లకు**
**కీలక ప్రసంగం - చిత్రకళా ప్రదర్శన - కవిసంధ్య ఆవిష్కరణ**

| | | |
|---|---|---|
| ముఖ్యఅతిథి | : | **మాన్యశ్రీ మల్లాడి కృష్ణారావు,** ఆరోగ్య & సంస్కృతి, కళల శాఖామాత్యులు, పుదుచ్చేరి |
| గౌరవ అతిథి | : | **మాన్యశ్రీ మండలి బుద్ధప్రసాద్,** డిప్యూటీ స్పీకర్, ఆంధ్రప్రదేశ్ శాసనసభ |
| కీలక ప్రసంగం | : | **శ్రీ కె. శివారెడ్డి,** కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత<br>(అంశం: మానవ నాగరికత - కవిత్వం) |
| సభాప్రారంభకులు | : | **డా. కె. శ్రీనివాస్,** ఎడిటర్, ఆంధ్రజ్యోతి, దినపత్రిక |
| గౌరవ అతిథులు | : | **శ్రీ తనికెళ్ళ భరణి,** ప్రముఖ చలనచిత్ర నటులు, కవి, రచయిత<br>**శ్రీ డా. డి. విజయభాస్కర్,** సంచాలకులు, భాషా సాంస్కృతిక శాఖ, ఆం.ప్ర.<br>**శ్రీ సతీష్ చందర్,** ప్రముఖ కవి, సీనియర్ పాత్రికేయులు |
| సభాధ్యక్షులు | : | **డా. శిఖామణి,** సంపాదకులు, కవిసంధ్య |
| ఆత్మీయ అతిథులు | : | **శ్రీ డి. సుబ్రహ్మణేశ్వరరావు,** ప్రాంతీయ పరిపాలనాధికారి, యానాం<br>**శ్రీ ఆకెళ్ళ రవి ప్రకాష్,** ప్రముఖ కవి, ఎం.డి., గిరిజన సహకారసంస్థ, ఆం.ప్ర.<br>**శ్రీ దాట్ల దేవదానం రాజు,** ప్రముఖ కవి, అధ్యక్షులు, ఆహ్వాన సంఘం<br>**శ్రీ తుల్లిమల్లి విల్సన్ సుధాకర్,** అసిస్టెంట్ డైరెక్టర్ జనరల్, ఇండియా టూరిజం |

కవిసంధ్య ప్రత్యేక సంచిక ఆవిష్కరణ: **మాన్యశ్రీ మల్లాడి కృష్ణారావు**

శీలావీర్రాజు చిత్రకళా ప్రదర్శన ప్రారంభకులు: **శ్రీ తనికెళ్ళ భరణి, ఆర్టిస్ట్ అక్బర్**

| | | |
|---|---|---|
| ఉత్సవ ప్రస్తావన | : | **డా. వరుగు భాస్కర్ రెడ్డి,** వర్కింగ్ ఎడిటర్, కవిసంధ్య |
| ఆహ్వానం | : | **మధునాపంతుల సత్యనారాయణ మూర్తి,** ప్రముఖ కవి |
| వందన సమర్పణ | : | **ముమ్మిడి శ్రీ వీర నాగవరప్రసాద్,** కవి, చిత్రకారులు |

మొదటి సదస్సు ఉదయం 11.30 నుండి

## సమకాలీన భారతీయ కవిత్వం - సదస్సు

అధ్యక్షులు : **ఆచార్య మృణాళిని,** ప్రముఖ రచయిత్రి, విమర్శకులు

గౌరవ అతిథి : **శ్రీ వాడ్రేవు చినవీరభద్రుడు,** ప్రముఖ కవి, అనువాదకులు

1. తమిళ కవిత్వం : **ఆచార్య ఎం. సంపత్ కుమార్,** మద్రాస్ విశ్వవిద్యాలయం, చెన్నై
2. మలయాళ కవిత్వం : **శ్రీ ఎల్.ఆర్. స్వామి,** ప్రముఖ రచయిత, అనువాదకులు, విశాఖపట్నం
3. కన్నడ కవిత్వం : **శ్రీ గురుమూర్తి పెండేకరు,** ప్రముఖ కవి, అనువాదకులు, బెంగుళూరు
4. హిందీ కవిత్వం : **డా. జి.వి. రత్నాకర్,** ప్రముఖ కవి, అనువాదకులు, ఉర్దూ యూనివర్సిటీ
5. ప్రపంచ కవిత్వం : **శ్రీ రామతీర్థ,** కవి, అనువాదకులు, విశాఖపట్నం
6. భారతీయ ఆంగ్ల కవిత్వం: **ఆచార్య ఎం. శ్రీధర్,** సెంట్రల్ యూనివర్సిటీ, హైదరాబాద్
7. ఫ్రెంచి కవిత్వం : **డా. డానియేల్ నెజర్స్,** ఫ్రాన్స్
8. ఉర్దూ కవిత్వం : **జయంత్ పర్మార్,** ప్రముఖ కవి, అనువాదకులు, గుజరాత్

:: భోజన విరామం ::

రెండవ సదస్సు మధ్యాహ్నం 2.00 గంటల నుండి

## గ్రంథావిష్కరణలు

| కవి | గ్రంథం | ఆవిష్కర్త |
|---|---|---|
| డా. ప్రసాద మూర్తి | చేనుగట్టు పియానో | కె. శివారెడ్డి |
| డా. ప్రసాద మూర్తి | దళిత కవిత్వం (పరిశోధన) | జి. లక్ష్మీనర్సయ్య |
| నేతల ప్రతాప్ కుమార్ | పుట్టిన రోజు ఒక్కటే | దాట్ల దేవదానంరాజు |
| డా. జి.వి. రత్నాకర్ | ముసిబాస (దీర్ఘకావ్యం) | యాకూబ్ |
| నేలపూరి రత్నాజీ | నెత్తుటి మరకలు (దీర్ఘకావ్యం) | ఆర్టిస్ట్ అక్బర్ |
| రఘు శ్రీ | చిలక్కొరికిన అక్షరాలు (హైకూలు) | బి.వి.వి. ప్రసాద్ |

మధ్యాహ్నం 3.00 గంటలకు

## బహుభాషా కవిసమ్మేళనం

గౌరవ అతిథి : **శ్రీమతి గౌరి కృపానందన్,** సాహిత్య అకాడమీ అనువాద పురస్కార గ్రహీత

ప్రారంభకులు : **డా. నలిమెల భాస్కర్,** ప్రముఖ కవి, అనువాదకులు, కరీంనగర్

అధ్యక్షులు : **దేవరాజు మహారాజు,** ప్రముఖ కవి, రచయిత, అనువాదకులు

పాల్గొనే కవులు : సంతోష్ ఎలెక్స్, నాగరాజు రామస్వామి, ఎల్.ఆర్. స్వామి, ఎం. శ్రీధర్, డా.జి.వి.రత్నాకర్, ముకుంద రామారావు, కె.ఎం.కె.చక్రవర్తి, పెరుగు రామకృష్ణ, ఎలనాగ, ఎల్.కె. సుధాకర్, సౌభాగ్య, జగద్ధాత్రి, స్వాతి శ్రీపాద, సుజాత పట్వారి, వాహెద్, మాటూరు శ్రీనివాస్, డా. లంక శివరామకృష్ణ, చింతపట్ల సుదర్శన్, గద్దపాటి శ్రీనివాసు తదితరులు

సమన్వయ కర్త: **డా. వరుగు భాస్కర్ రెడ్డి,** తెలుగు అధ్యాపకులు, గవర్నమెంట్ ఆర్ట్స్ కాలేజీ, యానాం

**27 ఆదివారం, నవంబర్ 2016** **మూడవ సదస్సు ఉదయం 9.30 గంటల నుండి**

**శివారెడ్డి పై డాక్యుమెంటరీ చిత్ర ప్రదర్శన**
**శిఖామణి సాహితీ పురస్కార ప్రదానం**
**శిఖామణి దళిత కవితా సంకలనం ఆవిష్కరణ**

ముఖ్య అతిథి : **మాన్యశ్రీ మల్లాడి కృష్ణారావు,** ఆరోగ్య, సంస్కృతి, కళల శాఖామాత్యులు, పుదుచ్చేరి

గ్రంథావిష్కర్త : **పద్మశ్రీ ఆచార్య కొలకలూరి ఇనాక్,** పూర్వ ఉపాధ్యక్షులు, ఎస్వీ యూనివర్సిటీ

శిఖామణి సాహితీ పురస్కార గ్రహీత: **శ్రీ కె. శివారెడ్డి,** కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డ్ గ్రహీత

గౌరవ అతిథి : **శ్రీ తెలకపల్లి రవి,** సీనియర్ పాత్రికేయులు, అధ్యక్షులు, సాహితీ స్రవంతి

పురస్కార ప్రదాత : **డా. శిఖామణి,** అధ్యక్షులు, కవిసంధ్య

కృతిస్వీకర్త : **శ్రీ ఆశా రాజు,** సుప్రసిద్ధ కవి, హైదరాబాద్

అధ్యక్షులు : **శ్రీ దాట్ల దేవదానంరాజు,** ప్రముఖ కవి, రచయిత

ఆత్మీయ అతిథులు : **శ్రీ ఎ.ఎన్. జగన్నాథ శర్మ,** ఎడిటర్, నవ్య వీక్లీ
**శ్రీ మేడిశెట్టి తిరుమల కుమార్,** ఐఆర్ఎస్, ప్రిన్సిపల్ కమీషనర్, ఇన్‌కం టాక్స్
**శ్రీ లోసారి సుధాకర్,** ప్రముఖ కవి, డిఎస్పీ, కడప

అవార్డు గ్రహీత ప్రశంస: **డా. ప్రసాద మూర్తి,** సుప్రసిద్ధ కవి

గ్రంథ పరిచయం : **డా. కోయి కోటేశ్వరరావు,** ప్రముఖ విమర్శకుడు

అవార్డు స్వీకర్త స్పందన: **కె. శివారెడ్డి**

ఆహ్వానం : **కె. విజయలక్ష్మి,** ప్రముఖ కవయిత్రి

వందన సమర్పణ : **బొల్లోజుబాబా,** ప్రముఖ కవి

:: టీ విరామం ::

**నాలుగవ సదస్సు 11.30 గంటల నుండి**

**సమకాలీన తెలుగు కవిత్వం - సదస్సు**

అధ్యక్షులు : **ఆచార్య మేడిపల్లి రవికుమార్,** ఎస్వీ యూనివర్సిటీ, తిరుపతి

1. తెలుగు పద్యం గేయం : **శ్రీ రసరాజు,** ప్రముఖ కవి, తణుకు
2. అభ్యుదయ కవిత్వం : **డా. చందు సుబ్బారావు,** ప్రముఖ రచయిత, విమర్శకులు, విశాఖపట్నం
3. విప్లవ కవిత్వం : **శ్రీ ఎన్. వేణుగోపాల్,** ఎడిటర్, వీక్షణం, హైదరాబాద్
4. కవిత్వంలో అనుభూతి : **శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత శర్మ,** ప్రముఖ కవి, విమర్శకులు
5. స్త్రీవాద కవిత్వం : **డా. ఎం.ఎం. వినోదిని,** కవి, విమర్శకులు, తిరుపతి
6. దళితవాద కవిత్వం : **శ్రీ జి. లక్ష్మీ నరసయ్య,** ప్రముఖ విమర్శకులు

సమన్వయకర్తలు : **డా. నెమలేటి కిట్టన్న,** కవి, తిరుపతి, **డా. బెల్లి యాదయ్య,** ప్రముఖ కవి

**అయిదవ సదస్సు 12.30 గంటల నుండి** **సమకాలీన తెలుగు కవిత్వం - సదస్సు**

అధ్యక్షులు : **ఆచార్య బన్న ఐలయ్య,** ప్రముఖ కవి, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్

7. ముస్లింవాద కవిత్వం : **శ్రీ ఖాదర్ మోహియుద్దీన్,** ప్రముఖ కవి, విజయవాడ

8. తెలంగాణ కవిత్వం : **శ్రీ దర్భశయనం శ్రీనివాసాచార్య,** ప్రముఖ కవి, హైదరాబాద్

9. తెలుగు కవిత్వం-బౌద్ధం : **డా. చల్లపల్లి స్వరూపరాణి,** ఆచార్య నాగార్జున యూనివర్సిటీ, గుంటూరు

10. ఆధునిక కవిత్వం-అభివ్యక్తి: **శ్రీ కొప్పర్తి,** ప్రముఖ కవి, తణుకు

11. ఆధునిక కవిత్వం-విమర్శ: **డా. ఆర్. సీతారాం,** ప్రముఖ కవి, విమర్శకులు, ఖమ్మం

12. తెలుగు కవిత్వం-సోషల్ మీడియా: **డా. యాకూబ్,** ప్రముఖ కవి, అధ్యక్షులు, కవి సంగమం

సమన్వయకర్తలు: **డా.మంథని శంకర్,** కవి, కాకతీయ వర్సిటీ, **డా.ఎన్. ఈశ్వర్‌రెడ్డి,** కవి,యోగివేమన వర్సిటీ

**:: భోజన విరామం::**

**ఆరవ సదస్సు మధ్యాహ్నం 2.00 గంటల నుండి** **మహా కవి సమ్మేళనం**

గౌరవ అతిథి : **శ్రీ కె. శివారెడ్డి,** ప్రముఖ కవి

అధ్యక్షులు : **శ్రీ మువ్వా శ్రీనివాస రావు / శ్రీ సుధామ / శ్రీ యాకూబ్**

ప్రారంభకులు : **శీలా వీర్రాజు,** ప్రముఖ కవి, రచయిత, చిత్రకారులు, హైదరాబాద్

నిర్వహణ: **డా. బెల్లి యాదయ్య, సిహెచ్. రాం, బొల్లోజు బాబా, పలమనేరు బాలాజీ**

పాల్గొనే కవులు: అదృష్ట దీపక్, అద్దేపల్లి ప్రభు, జి. సుబ్బారావు, రాధేయ, కొప్పర్తి, ఖాజా, బి.వి.వి. ప్రసాద్, సిద్ధార్థ, రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు, తల్లావజ్ఝల పతంజలిశాస్త్రి, అనంత్, ఎన్. ఈశ్వర్‌రెడ్డి, జి. వెంకటకృష్ణ, నామాడి శ్రీధర్, పలమనేరు బాలాజీ, భగవంతం, అన్నవరం దేవేందర్, రసరాజు, మల్లవరపు రాజేశ్వరరావు, పసునూరి శ్రీధర్ బాబు, పి. శ్రీనివాస్ గౌడ్, సజ్జా వెంకటేశ్వర్లు, సుగమ్ బాబు, ర్యాలి శ్రీనివాస్, ఎస్.ఆర్. పృథ్వి, శీలా సుభద్రాదేవి, శశికాంత్ శాతకర్ణి, దేశరాజు, కోసూరి రవికుమార్, శిలాలోలిత, వేముల ఎల్లయ్య, వసీరా, ఈతకోట సుబ్బారావు, ఎం.ఎస్. బండ్ల మాధవరావు, సన్నిధానం, బిక్కి కృష్ణ, రేణుక అయోల, కె. విల్సన్ రావు, ఎస్.వి. రామశాస్త్రి, పుట్ల హేమలత, ఎస్.ఆర్. భల్లం, మంత్రి కృష్ణమోహన్, బదుగు భాస్కర జోగేష్, మల్లవరపు ప్రభాకరరావు, ఎస్.వి. రాఘవేంద్రరావు, మౌనశ్రీ మల్లిక్, వినోదిని, సిఎస్. రాంబాబు, వి.ఆర్. రాసాని, కొండ్రెడ్డి, పసుపులేటి గీత, గంటేడ గౌరు నాయుడు, సాహిత్య ప్రకాశ్, మోకా రత్నరాజు, పల్లెపట్టు నాగరాజు, పద్మజా వాణి, కె.వి. రమణారెడ్డి, బండి సత్యనారాయణ, శిరీష, పొనుగుమట్ల అశోక్, శినారా, మోహిబుల్లాఖాన్, రావి రంగారావు, వేదుల సోమయాజులు, సంపతి సోమయ్య, వి. ప్రతిమ, భగ్వాన్, వక్కలంక శారద, ముక్కామల చక్రధర్, కొల్లూరి, బదబాగ్ని శంకరరాజు, గండికోట వారిజ, ఎం.వి. రమణ, తరపట్ల సత్యనారాయణ, స్వాతి శ్రీపాద, మాకినీడి సూర్యభాస్కర్, పిల్లి మల్లికార్జున్, కారం శంకర్, గనారా, భూతం ముత్యాలు, సూర్యవంశి, కత్తి మండ ప్రతాప్, ర్యాలి ప్రసాద్, బీరం సుందరరావు, అనిల్ కుమార్ సంటి, సింహాద్రి పద్మ, ద్విభాష్యం నగేష్, మేకా మన్మధరావు, కలిదిండి వర్మ, నేతల ప్రతాప్ కుమార్, కోడూరి విజయకుమార్, ఎం.ఎస్. నాయుడు, మారాబత్తుల పెద్దన్న, కరీముల్లా, కల్లెం లక్ష్మణ్, నన్నపనేని రవి, కుంచే నాగసత్యనారాయణ, నూకా రాంప్రసాద్ రెడ్డి, కొప్పోలు మోహనరావు, కెంగార మోహన్, దొడ్డిరామ్మూర్తి, అద్దేపల్లి జ్యోతి, పి.ఆర్.ఎల్. స్వామి, పాలపర్తి శ్రీధర్, అవధానుల మణిబాబు, నెమలేటి కిట్టన్న, పి.బి.డి.వి. ప్రసాద్, అనిల్ డ్యాని, అరణ్యకృష్ణ, గుర్రం ధర్మోజీ రావు, లాడె ధనంజయ, పి. సీతారామరాజు, కొండూరు రామరాజు, తుపాకుల ప్రసాదరావు, ఎ.వి. వీరభద్రాచారి, చింతకింది శ్రీనివాసరావు, వి. వరలక్ష్మి, మధునాపంతుల చలపతి, గూటం స్వామి, పాటిబండ్ల రజని, సిరికి స్వామినాయుడు, నేలపూరి రత్నాజి, శిల్పా జగదీష్, మాధవీ సనారా, కె. ఆంజనేయ కుమార్, రామకృష్ణ శ్రీవత్స, జోశ్యుల కృష్ణబాబు, అబ్బిగారి రాజేంద్రప్రసాద్, రాపాక సన్నివిజయ్, గొట్టిపర్తి యాదగిరిరావు, లకుమ భూదేశ్వర్ రావు, యార్లగడ్డ రాఘవేంద్రరావు, సరికొండ నరసింహరాజు, సిరి లాబాల, సిహెచ్. రవి, ఇంద్రగంటి నరసింహమూర్తి, తుమ్మల దేవరావు, మల్లవరపు వెంకటరావు, ముమ్మిడి చిన్నారి, బెల్లం ప్రభాకర్, సాధనాల వెంకటస్వామినాయుడు, మునిమడుగుల రాజారావు, ఎస్. రఘు, సురేంద్రదేవ్ చెల్లి, అరసవిల్లి కృష్ణ, పావన ప్రసాద్, సిహెచ్. రాం, పినిపె సత్యనారాయణ, మందరపు హైమవతి, కత్తుల కిషోర్ కుమార్, దుగ్గిన పల్లి ఎజ్రాశాస్త్రి, బాల సుధాకరమౌళి తదితరులు.

# ప్రముఖుల లేఖలు



## చలంగారి ఉత్తరం

(డా॥ కామేశ్వరికి రాసింది)

16/11/58

(చలం డా॥ కామేశ్వరికి రాసిన లేఖలు ఇటీవలే 'చలం నాన్న లేఖలు' పేరుతో ప్రముఖ పాత్రికేయులు డా॥ కె. అరుణ జ్యోతి సంపాదకత్వంలో వెలువడ్డాయి.)

డా॥ అరుణ జ్యోతి గారికి కృతజ్ఞతలు



| | మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A103 |
| పుస్తకం పేరు | కవి సంధ్య |
| తారీఖు | 25/5/21 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 133 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | Nandini |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |